ISSN 0971-278X

# ప్రజాసాహితి

సాహిత్య సాంస్కృతికోద్యమ మాసపత్రిక

మార్చి 2014

వెల : రూ. 20/-

## పీటర్ సీగర్

1919 - 2014

369



# ఆ పూవులన్నీ ఏమయ్యాయి!

– పీటర్ సీగర్

(రష్యన్ నవలా రచయిత మైఖేల్ షోలకోవ్ రాసిన నవల "అండ్ క్వయట్ ఫ్లోస్ ది డాన్"లోని ఒక ఘట్టం స్ఫూర్తిగా తీసుకొని పీటర్ సీగర్ ఈ పాట రాశారు. జర్మన్ భాషలోకి అనువదింపబడిన ఈ పాట వారిపై ఎంతో ప్రభావాన్ని కలిగించింది.)

ఏమైనాయి ఆ పూవులన్నీ?
ఎంతో కాలం గడచింది
ఎటుపోయినై ఆ పూవులన్నీ?
ఎంతోకాలం క్రిందట
ఆ పూవులన్నీ ఎటు పోయినై?
ఆ యువతులందరూ - ప్రతిఒక్కరూ
తీసుకున్నారు వాటిని
అయ్యో! ఎప్పటికి తెలుసుకుంటావు నీవు?
అరె! ఎప్పటికి నేర్చుకుంటావు నీవు?
ఆ యువతులందరూ
తమ భర్తలకోసం తీసుకున్నారు వాటిని
యువకులు వారు
అందరూ యూనిఫాంలో వున్న సైనికులు
వారందరూ - ప్రతి ఒక్కడూ పోయాడు
శ్మశానంలోకి
ప్రతి ఒక్కడి సమాధి పూలతో కప్పబడి వుంది
పూలు
యువతులందరూ - ప్రతి ఒక్కరూ
ఆ పూలను ఏరుకొని వెళ్ళారు. *

కవితలు

– ఖిస్త్రిరానా ఖార్యునా

నీ చేతిలో బాంజో
విముక్తి సాధించే సాధనమైంది
పిడుగుల ధ్వనీ, మధువులోని తీపీ
కలగలిసిన నీ గొంతుతో పాడినపుడు
ప్రజల గుండెల్లో కవాతు చేసావు
అలసి సొలసిన కార్మికుడి గురించి,
అగ్రహోద్రోగుడైన పేద రైతు గురించి
నపాళంతో నిండిన దేశానికి వెళ్ళిన
కోపోద్రిక్తుడైన సైనికుని గురించి,
వీధుల్లో నిరాశతో తిరుగుతున్న సామాన్యుడి గురించి,
అందరూ మరచిపోయిన
కథలు చెప్పాయి నీ పాటలు
యుగయుగాలుగా రుద్దిన నిశ్శబ్దం
ఏదో చెప్పాలని నీ గొంతులో గురగురలాడింది
యుద్ధ సైనికుల కరకు బూట్ల క్రింద
నలిగిపోయిన పూవుల గురించి పాడావు
ఎన్నో నిరాశాపూరిత రాత్రుల గురించి
మా లోపల జ్వలించే జ్వాలల గురించి పాడావు
వీటిని అధిగమించాలనుకునే
మాలోని తిరుగుబాటు తత్త్వం
ఊపిరి పీల్చుకునేంతవరకు
మా.... గురించి పాడావు
నీ పాట మాకు అనవరతం
మా అంతరాత్మకు
ఒక మెలకువ పిలుపు
అది మానవత్వపు గొంతు

'ది హిందూ' – ఫిబ్రవరి 9, 1914 *

అమెరికా జానపద గేయం

# విజయం సాధిస్తాం.. మేం విజయం సాధిస్తాం..

| | |
|---|---|
| హమ్ హోంగే కామ్‌యాబ్- | విజయం సాధిస్తాం... |
| హమ్ హోంగే కామ్‌యాబ్- | విజయం సాధిస్తాం... |
| హమ్ హోంగే కామ్ యాబ్ ఏక్‌దిన్ | మేం విజయం సాధిస్తాం ఒకనాడు |
| ఓహో! మన్ మే హై విశ్వాస్- | మదినున్నది విశ్వాసం- |
| పూరాహై విశ్వాస్ | నిండుగ ఉన్నది విశ్వాసం |
| హమ్ హోంగే కామ్‌యాబ్ ఏక్ దిన్! | మేం విజయం సాధిస్తాం ఒకనాడు |
| అకేలీ నహీ హై హమ్- | ఒంటరిగా లేములే మేం |
| అకేలీ నహీ హై హమ్- | ఒంటరిగా లేములే మేం |
| అకేలీ నహీ హై హమ్- ఇస్‌దిన్ | ఒంటరిగా లేములే మేం ఏనాడూ |
| ఓహో! మన్ మే హై విశ్వాస్- | ఓహో మదినున్నది విశ్వాసం |
| పూరాహై విశ్వాస్ | నిండుగ ఉన్నది విశ్వాసం |
| హమ్ హోంగే కామ్‌యాబ్ ఏక్‌దిన్! | మేం విజయం సాధిస్తాం ఒకనాడు |
| చలేంగే సాధ్ సాధ్- | ఒకటయ్యి నడిచేమూ- |
| చలేంగే సాధ్ సాధ్ | చేయి చేయి కలిపేమూ |
| చలేంగే సాధ్ సాధ్ ఇస్‌దిన్ | ఒకటయ్యి నడిచేమూ ఈనాడు |
| ఓహో మన్ మే హై విశ్వాస్- | ఓహో మదినున్నది విశ్వాసం- |
| పూరా హై విశ్వాస్ | నిండుగ ఉన్నది విశ్వాసం |
| హమ్ హోంగే కామ్‌యాబ్ ఏక్‌దిన్! | మేం విజయం సాధిస్తాం ఒకనాడు |
| నహీ డర్ కిసీకా ఆజ్- | ఎవరికి భయపడమీనాడు- |
| నహీ డర్ కిసీకా ఆజ్ | ఎవరికి భయపడమీనాడు |
| నహీ డర్ కిసీకా-ఇస్‌దిన్ | ఎవరికి భయపడమీనాడు-ఏనాడూ |
| ఓహో! మన్‌మే హై విశ్వాస్- | ఓహో మదినున్నది విశ్వాసం- |
| పురా హై విశ్వాస్ | నిండుగ ఉన్నది విశ్వాసం |
| హమ్ హోంగే కామ్ యాబ్ ఇసీదిన్ | మేం విజయం సాధిస్తాం ఈనాడే |
| హోగా శాంతి చారోంఓర్ | నిండును శాంతి నలుదిశలా- |
| హోగా శాంతి చారోంఓర్ | నిండును శాంతి నలుదిశలా |
| హోగా శాంతి చారోంఓర్ ఏక్‌దిన్ | నిండును శాంతి నలుదిశలా ఒకనాడూ |
| ఓహో! మన్‌మేహై! విశ్వాస్- | ఓహో మదినున్నది విశ్వాసం |
| పురా హై విశ్వాస్ | నిండుగ ఉన్నది విశ్వాసం |
| హమ్ హోంగే కామ్‌యాబ్ ఇసీదిన్ | మేం విజయం సాధిస్తాం ఈనాడే * |

visitus@www.prajasahithi.com



# ప్రజాసాహితి

జనసాహితి ప్రచురణ

సాహిత్య సాంస్కృతికోద్యమ మాసపత్రిక

సంపుటి : 37 సంచిక : 8 369 మార్చి, 2014


గౌరవ సంపాదకుడు
నిర్మలానంద

ప్రధాన సంపాదకుడు
కొత్తపల్లి రవిబాబు
సంచారవాణి: 9490196890
ravibabujs@yahoo.co.in

జనసాహితి ప్రధాన కార్యదర్శి చిరునామా:
దివికుమార్,
divikumar1949@yahoo.com
8/28, సిమెంటు ఫ్యాక్టరీ పోస్టాఫీసు వెనుక,
లోటస్ ల్యాండ్, కేదారేశ్వరపేట,
విజయవాడ-520 003
ఇల్లు: 0866-2538890 సెల్లు: 9440167891

రచనలు, పుస్తకాలు పంపవలసిన చిరునామా
పి.ఎస్.నాగరాజు,
సంపాదకుడు
7-15-17, న్యూ కాలనీ,
ప్రశాంతి విద్యానికేతన్ ఎదురుగా,
శ్రీకాకుళం-532001,
సంచారవాణి: 9441913829



| | | |
|---|---|---|
| వ్యక్తులకు సం॥ చందా | | రు. 200-00 |
| విదేశాలకు | చందా | రు. 1000-00 |
| సంస్థలకు సం॥ చందా | | రు. 400-00 |

చందాలు పంపవలసిన చిరునామా
ప్రజాసాహితి
30-7-6, అనపర్తివారివీధి
అన్నదాన సమాజం రోడ్డు, దుర్గాఅగ్రహారం
విజయవాడ-520002
ఫోన్: 9490196890

**చందాలు, విరాళాలు**
మనియార్డరు, డి.డి.ల. ద్వారా పంపండి.
చిరునామా స్పష్టంగా తెలియ జేయాలి.
డి.డి.లపై 'ప్రజాసాహితి, విజయవాడ' అని రాయండి


ముఖచిత్రం : పీటర్ సీగర్ — 3వ అట్ట : సాహిత్య అకాదెమి వారి ప్రకటన
2వ అట్ట : పీటర్ సీగర్ కవితలు, పాడిన పాట — 4వ అట్ట : చిత్తలూరి, డా॥శాంతికుమార్ కవితలు



డి.టి.పి., కవర్ కలర్ డిజైన్ : ప్రగతి గ్రాఫిక్స్, విజయవాడ

## 26 మార్చి 2014
# కొత్తపల్లి వెంకటకృష్ణవర్మ
## 30వ వర్ధంతి



కొత్తపల్లి వెంకటకృష్ణవర్మ స్వాతంత్ర్య సమరయోధులు. వర్మగారు దక్షిణ భారత హిందీ ప్రచార సభలోనూ, గాంధీ స్మారక నిధిలోనూ పనిచేశారు. వారు తన 77వ ఏట 26- 03-1984న మరణించారు. వారి జ్ఞాపకార్థం వారి పిల్లలు 30వేల రూపాయలు "ప్రజాసాహితి" శాశ్వతనిధి కిచ్చారు. వారికి మా కృతజ్ఞతలు. వర్మగారి 30వ వర్ధంతి సందర్భంగా వారిని గుర్తుచేసుకుంటున్నాం.

ప్రజాసాహితి

## ప్రజాసాహితి యాజమాన్య వివరాలు
### (ఫారం 4, రూల్-8 ప్రకారం)

| | | |
|---|---|---|
| 1. ప్రచురణ స్థలం | : | విజయవాడ-520002 |
| 2. ప్రచురణ కాలం | : | నెలకొకసారి(మాసపత్రిక) |
| 3. ముద్రాపకుని పేరు | : | కొత్తపల్లి రవిబాబు |
| జాతీయత, చిరునామా | : | భారతీయుడు<br>30-7-6 అనపర్తివారివీధి<br>అన్నదానం సమాజం రోడ్డు<br>దుర్గాఅగ్రహారం<br>విజయవాడ-520002 |
| 4. ప్రచురణ కర్త పేరు, జాతీయత, చిరునామా | : | పైవిధంగానే |
| 5. సంపాదకుని పేరు | : | కొత్తపల్లి రవిబాబు |
| 6. భాగస్వాములు | | జనసాహితి, ఆంధ్రప్రదేశ్ |

పైన పేర్కొన్న విషయములన్నియు యథార్థములు.

1.3.2014 సం॥ కొత్తపల్లి రవిబాబు
ప్రచురణకర్త

## 14 మార్చి 2014
# వట్టూరి సుబ్బారావు 20వ వర్ధంతి



జనసాహితి సభ్యుడు- వట్టూరి సుబ్బారావు 1994 మార్చి 14న మరణించారు. అతని జ్ఞాపకార్థం అతని కుటుంబ సభ్యులు అతని మొదటి వర్ధంతి సభలో 1995 మార్చి 14న రూ.25,000/ 'ప్రజాసాహితి' శాశ్వతనిధికి అందచేశారు. సుబ్బారావుని అతని 20వ వర్ధంతి సందర్భంగా జ్ఞాపకం చేసుకుంటున్నాం

ప్రజాసాహితి

## శాశ్వతనిధి పథకంలో మార్పు

25వేల రూపాయలు, అంతకు మించి 'ప్రజాసాహితి' శాశ్వతనిధి (Corpus Fund) కి ఎవరి జ్ఞాపకార్థమైనా ఇస్తే, వారి వర్ధంతి జరిగే నెలలో వారిని జ్ఞాపకం చేసుకుంటూ వస్తున్నాం. అయితే మొదట్లో దీనికొక కాలపరిమితి నిర్ణయించలేదు. ఐతే ఏప్రిల్ 2014 నుండీ శాశ్వతనిధి పథకంలో ఒక మార్పు చేస్తున్నాం. అదేమిటంటే ఇకముందు ఈ పథకంలో విరాళం ఇస్తే, ఎవరి పేరుతో ఇస్తారో వారి వర్ధంతి సందర్భంగా పదేళ్ళపాటుమాత్రం జ్ఞాపకం చేసుకుంటాం. దానిని కొనసాగించాలంటే మరల పదేళ్ళ తర్వాత నిధిని ఇవ్వవలసి వుంటుంది. ఈ మార్పు ప్రస్తుతం శాశ్వతనిధి పథకంలో వున్నవారికీ, కొత్తగా ఈ పథకానికి సహకరించే వారికీ వర్తిస్తుందని గమనించ ప్రార్థన. - సంపాదకవర్గం




ఆన్‌లైన్‌లో విరాళాలు, చందాలు పంపేవారు
కెనరాబ్యాంకు, గవర్నర్ పేట, విజయవాడ
ప్రజాసాహితి పేరుతో గల
"అకౌంట్ నెం. 0680101004936 కు
IFSC No. CNRB0000680
పంపించి మాకు తెలియజేయగలరు.
సంచారవాణి : 94901 96890

## సంపాదకీయంగా

# అంతర్జాతీయ మహిళాదినం మార్చి 8ని మహిళల హక్కుల పోరాటదినంగా పాటిద్దాం!

## స్త్రీలపై నిరంతరాయంగా సాగుతున్న హింసాకాండకు, అత్యాచారాలకు వ్యతిరేకంగా పోరాడుదాం!

## పితృస్వామ్యపీడన, దోపిడీ, అణచివేతలకు వ్యతిరేకంగా సంఘటితంగా ఉద్యమిద్దాం!

**గత** వంద సంవత్సరాలకుపైగా మార్చి 8ని అంతర్జాతీయ మహిళా దినంగా, శ్రామిక మహిళలు తమ హక్కుల పోరాట దీక్షాదినంగా పాటిస్తున్నారు. మహిళలకు ఏవిధమైన భద్రత, ఉపాధి అవకాశాలు కల్పించని భారత పాలకులు గత రెండు దశాబ్దాలుగా మహిళలను వంచించటానికి మార్చి 8ని ఒక జాతరలా జరుపుతున్నారు. సెలబ్రిటీలపేరుతో వివిధ రంగాలలో ఉన్నతస్థానాల కెదిగిన వారిని ఈ సందర్భంగా ఆకాశానికెత్తుతూ మహిళలు ఎంతో ఉన్నతి సాధిస్తున్నారని ప్రగల్భాలు పలుకుతున్నారు. కోట్లాదిమంది పేద మహిళలు అనుభవిస్తున్న దుర్భరదారిద్ర్యం, అభద్రతలను, విద్య, ఉపాధిరంగాలలో అమలవుతున్న తీవ్రవివక్షను చూడ నిరాకరిస్తున్నారు. మహిళలపై వివిధ రూపాలలో తీవ్రమవుతున్న దాడులకు, హింసకు గల మూల కారణాలు వ్యవస్థలోనే ఉన్నాయనే విషయాన్ని మభ్యపెట్టి ఏ ఘటనకా ఘటనకు విడివిడిగా పైపైకారణాలు చూపుతూ వాటిలోని ఉమ్మడి సామాజిక అంశాన్ని పట్టించుకోకుండా పరిష్కారాలను నేరము – శిక్షలకు పరిమితంచేస్తున్నారు. రాజ్యమే స్త్రీలపై దాడులకు పూనుకుంటున్న అనేక సందర్భాలతోపాటు, అధికారంలో వున్న పాలక పార్టీల దన్నుతో, స్థానిక పెత్తందారీశక్తులు గ్రామీణ ప్రాంతాల్లో మహిళలపై సాగిస్తున్న దురాగతాలు అన్నీ ఇన్నీ కావు.

20 జనవరి, 2014న పశ్చిమబెంగాల్‌లోని బీర్భూం జిల్లాలోని లాభ్‌పూర్ బ్లాక్‌లోని మహోదరి పంచాయతికి చెందిన ఆదివాసి గ్రామం సుబాల్‌పూర్‌లో జరిగిన దురాగతం అత్యంత అమానుషమైనది. ఆ గ్రామానికి చెందిన 20 సం॥ల యువతి, మరో గ్రామానికిచెందిన ఒక ముస్లిం యువకుడిని పెళ్ళిచేసుకోదలిచినందుకు, అది ఆదివాసీ కట్టుబాటును ధిక్కరించటమన్న పేరుతో ఆ గ్రామంలోని పెద్దలు, గిరిజనేతరుడైన స్థానిక పాలక పార్టీ నాయకుని ఆధ్వర్యంలో పంచాయితీ జరిపి ఇరువురికీ జరిమానా విధించారు. జరిమానా చెల్లించలేకపోయిన ఆ యువతిపై పెత్తందార్ల ఆదేశంతో అందరూ చూస్తుండగానే 13మంది సామూహిక అత్యాచారం జరిపారు. ఇంతటి పాశవిక ఘటన బహిరంగంగా జరగటం, దీనికి ఆ గ్రామస్థుల ఆమోదం ఉండటం తీవ్రమైన ఆందోళన కలిగించేవిగా ఉన్నాయి. ఈలాంటి అత్యాచారాలను ప్రోత్సహించే సంస్కృతి ఆదివాసీలలో లేదు. పెచ్చరిల్లిన నేటి కుళ్ళుసంస్కృతే దీనికి కారణం. సమాజంలో నెలకొని ఉన్న పితృస్వామిక విలువలు, పెత్తందారీ శక్తుల, పాలకవర్గ పార్టీల ఆధిపత్యం దళిత, ఆదివాసీ మహిళలపై ఏవిధంగా ఉంటున్నాయో ఈ ఘటన తెలియచేస్తున్నది. కులపెద్దల, రాజకీయ పెత్తందార్ల ఆధిపత్యంలో నడుస్తున్న ఖాప్ పంచాయితీలు స్త్రీలపై లెక్కలేనన్ని ఆంక్షలువిధిస్తూ, చివరకు వారినే దోషులుగా శిక్షిస్తూ, పరువు కోసమంటూ ప్రాణాలను సైతం తీస్తున్నాయి.

చదువుకోవటానికైతేనేమి, ఉద్యోగాలు చేయటానికైతేనేమి, ఇతరత్రా పనుల కోసమైతేనేమి మహిళలు గతంతో పోల్చినప్పుడు అధిక సంఖ్యలోనే బయటకు వస్తున్నారు. వ్యవసాయరంగంలో కూలీలుగా, పారిశ్రామిక రంగంలో అసంఘటిత కార్మికులుగా స్త్రీలు తీవ్రమైన శ్రమదోపిడీకి గురవుతున్నారు. విద్య, ఉపాధి రంగాలలో సమాన అవకాశాలు లేవు. శ్రమకు తగ్గ ప్రతిఫలమనేది లేకపోగా సమాన పనికి సమాన వేతనమన్నది అమలవుతున్న పరిస్థితే లేదు. మరోవైపు కేవలం కడుపు నింపుకోవటానికే ఆదివాసీ స్త్రీలు విపరీతమైన గొడ్డుచాకిరీ చేస్తున్నారు. ఉపాధ్యాయులుగా, అధ్యాపకులుగా, వైద్య సేవారంగంలో, ఐటిరంగంలో సాఫ్ట్‌వేర్ ఉద్యోగినులుగా, లాయర్లుగా, కండక్టర్లుగా, చిరువ్యాపారులుగా, ప్రభుత్వ పరిపాలనా రంగంలో ఉద్యోగులుగా ఇంకా అనేక విధాలుగా స్త్రీలు సామాజిక ఉత్పత్తి రంగాలలో, సేవారంగాలలో భాగస్వాములవుతున్నారు. ప్రతి రంగంలోను స్త్రీలుగా వివక్షను, లైంగిక వేధింపులను ఎదుర్కొంటూనే పనిచేస్తున్నారు. ఇంటిపని, పిల్లల పెంపకం, గృహనిర్వహణ బాధ్యత కూడా వారికే కేటాయింపబడిన ఫలితంగా అనేక శారీరక, మానసిక సంఘర్షణలకు లోనవుతూవున్నారు. ఇంతటి భారంమోస్తున్న స్త్రీలకు సమాజంలో లభిస్తున్న గౌరవం ఎలాంటిది? స్త్రీని సాటి మనిషిగా కూడా చూడకుండా పురుషునికి లోబడి వుంటూ సేవలు చేయవలసినదానిగా, రెండవశ్రేణి పౌరురాలిగా చూస్తున్నదీ సమాజం. ఎంత కష్టపడినా ఏవిధమైన గుర్తింపు లేకపోగా ఇంటిలోనూ, సమాజంలోనూ కనీసపాటి భద్రతకూడా స్త్రీలకు వుండటంలేదు. మూడేళ్ళ పసిపాపనుండి, 70ఏళ్ళ ముదుసలి వరకు స్త్రీలపై లెక్కకు మిక్కిలిగా జరుగుతున్న అత్యాచారాలు మహిళలకీదేశంలో ఏమాత్రం భద్రత లేదన్న వాస్తవాల్ని రుజువుచేస్తున్నాయి.

ఇటీవలికాలంలో వరుసగా జరుగుతున్న, వెలుగులోకి వస్తున్న అత్యాచారాలు, హత్యాకాండలు ఇప్పుడే మొదలైనవి కావు. పురుషాధిపత్యపు పీడన మొదలైన నాటినుండి కూడా ఇవి జరుగుతూనే వున్నా, మార్కెట్‌శక్తుల ఆధిపత్యంలో వెదజల్లబడుతున్న విశృంఖలమైన విషసంస్కృతి వీటిలోని హింసాత్మకతను మరింత ఎక్కువచేసి భయభ్రాంతులకు గురిచేసేదిగా వుంది. దేశరాజధాని ఢిల్లీలో నిర్భయపై జరిగిన సామూహిక అత్యాచార ఘటన దీనికో ఉదాహరణ. ఈ సందర్భంగా దేశవ్యాప్తంగా వెల్లువెత్తిన నిరసనలు ఒక సరైన దిశలోకి మళ్ళకుండా, వాటిపై నీళ్ళు చల్లటానికి పూనుకుంది ప్రభుత్వం. అత్యాచారాలకు గురైన బాధితులకు సత్వరన్యాయం జరిపిస్తానంటూ, త్వరగా కేసులు కోర్టులో విచారణకు వచ్చేట్లు, కఠినశిక్షలు విధించేట్లు 'నిర్భయచట్టం' తీసుకువచ్చింది. ఇప్పటిదాకా ఉన్న చట్టాలనే అమలుచేయని ప్రభుత్వం మరోచట్టం ద్వారా న్యాయం చేస్తానంటూ

ప్రజలను అసలు విషయాల నుండి, అత్యాచారాలకు మూలమైన వ్యవస్థాగత కారణాల నుండి దృష్టిమళ్ళించి, చట్టాల చుట్టూ తిప్పే ప్రయత్నం చేస్తున్నది. గతంలో వరంగల్లులో స్వప్నిక, ప్రణీతలపై యాసిడ్‌దాడి జరిపిన ముగ్గురు యువకులను వరంగల్లు పోలీసులు ఎన్‌కౌంటర్ పేరుతో కాల్చిచంపి సత్వరన్యాయం జరిపిన హీరోలుగా, సరైన శిక్ష విధించినవారిగా ఫోజుకొట్టి ప్రజలను నమ్మించే ప్రయత్నం చేశారు. తర్వాత పదుల సంఖ్యలో యాసిడ్ దాడులు జరిగాయి. నిర్భయచట్టం వచ్చాకకూడా స్త్రీలపై దాడులు పరంపరగా సాగుతూనే ఉండటం చట్టాలుచేస్తే మాత్రమే సరిపోదన్న వాస్తవాన్ని రుజువు చేస్తున్నాయి. ముంబైలో మహిళా జర్నలిస్టుపైదాడి, హైదరాబాదులో సాఫ్ట్‌వేర్ ఉద్యోగిని అభయపై జరిగిన అత్యాచారం, ముంబైలో మచిలీపట్నానికి చెందిన అనూహ్యపై జరిగిన అత్యాచారం, హత్య, ప్రేమను నిరాకరిస్తున్నారనే పేరుతో చంపేయటం, పెట్రోలు, కిరోసిన్ పోసి నిలువునా తగులబెట్టడం ఇంకా ఇలాంటివే ఎన్నెన్నో ఘటనలు మీడియాలో వస్తూనే ఉన్నాయి. ఇక గ్రామీణ ప్రాంతాల్లో స్థానిక పెత్తందార్ల దౌష్ట్యాలకు బలౌతున్న దళిత, ఆదివాసీ మహిళల గురించి బయట ప్రపంచానికి తెలిసే అవకాశమే లేదు.

గత సంవత్సరం గుంటూరుజిల్లా తెనాలిలోనూ, కృష్ణాజిల్లా పునాదిపాడులోనూ మద్యం దుకాణాల వద్ద ఆకతాయిలు అమ్మాయిలను అల్లరిపెట్టబోగా అడ్డుకున్నందుకు జరిగిన దాడిలో తెనాలిలో యువతి తల్లి సుశీల, పునాదిపాడులో యువతి అన్న రవితేజ ప్రాణాలు కోల్పోయారు. ఈ రెండు ఘటనల్లో బాధితులు దళితులు. ఈ ఘటనల్లో కీలకమైన మద్యం వ్యాపారంపై దృష్టిసారించనివ్వకుండా అనేక పాలకవర్గ పార్టీలు, స్వార్ధపరశక్తులు ఈ విషయాల్లో జొరబడి మొత్తం ఆందోళనను నష్టపరిహారం ఇప్పించటంగా మార్చేశారు. అనేక అత్యాచార ఘటనల్లో సైతం నేరస్తులు బలవంతులైనప్పుడు డబ్బుతో వాటిని మాఫీ చేసుకునే ప్రయత్నాలు సాగుతున్నాయి. ప్రభుత్వం ఆదాయం కోసమంటూ టార్గెట్లుపెట్టి మరీ తాగబోయిస్తున్న మద్యం వ్యాపారం వలన జరుగుతున్న విధ్వంసం పేదవర్గాల ప్రజలపై ముఖ్యంగా మహిళలపై తీవ్రంగా ఉంటోంది. సమాజాభివృద్ధికి ఉపయోగపడవలసిన యువత శక్తియుక్తులు, మద్యం మత్తులో నాశనమైపోతున్నాయి. పురుషాధిపత్యపు భావజాలానికి మద్యం మత్తు తోడైన ఫలితంగా స్త్రీలపై దాడుల తీవ్రత పెరుగుతున్నది. మరోవైపు తాగటమే వినోదంగా భావించే సంస్కృతి పెంచిపోషింపబడుతోంది ఫలితంగా పతన విలువలు పరాకాష్టకు చేరుకుంటున్నాయి. పేదవర్గాల ప్రజల ఆదాయంలో గణనీయభాగం తాగుడుకే ఖర్చవుతూండగా వారి కుటుంబాల నిర్వహణ భారమంతా మహిళలపైబడి, వారి పరిస్థితి మరింత విషాదభరితమవుతోంది.

స్త్రీలపై జరుగుతున్న దాడులకు కారణాలు అన్వేషించటంలో అనేకమంది పురుషాధిపత్యపు భావజాలానికి లోనై బాధితులైన మహిళలనే నేరస్తులుగా చూపే ప్రయత్నం చేస్తున్నారు. అమ్మాయిల వస్త్రధారణ పురుషులను రెచ్చగొట్టేట్లుగా ఉంటున్నదనే వ్యాఖ్యానాలు బాధ్యతాయుత స్థానాలలో ఉన్నవారి నుండి సైతం వస్తున్నాయి. సినిమాలలోను, వ్యాపార ప్రకటనలలోను అమ్మాయిలను అర్ధనగ్నంగా చూపించటం జరుగుతూనే ఉంది. స్త్రీల శరీరాలను వ్యాపార సరుకుగా మార్చి యువత భావోద్వేగాలను సొమ్ముచేసుకుంటున్న పెట్టుబడిదారీ వ్యాపార నీతే దీనికి కారణం. సినిమాలు, ప్రకటనలు నిర్మించే వారినిగానీ, అటువంటి దుస్తులు తయారు చేసే కంపెనీలనుగానీ, స్త్రీల శరీరాలను అడ్డుపెట్టుకుని సాగుతున్న కోట్లాది రూపాయల ఈ వ్యాపారాలను, అటు పాలకులుగానీ ఇటు అధికారులుగానీ ఏమాత్రం నియంత్రించటం లేదు. మరోవైపు పనిచేయగలిగే శక్తి సామర్థ్యాలకన్నా స్త్రీలకు అందంగా ఉండటమే ముఖ్యమనే కుహనా విలువను సౌందర్య సాధనాల కంపెనీలు పెంచిపోషిస్తూ, ఏమాత్రం ప్రయోజనంలేని తమ ఉత్పత్తులను మార్కెట్లో అమ్ముకుంటూ విపరీతమైన లాభాలార్జించటంపట్ల ఈ పాలకులకుగానీ, అధికారులకుకానీ ఏవిధమైన విమర్శాలేదు.

మిత్రులారా! స్త్రీలపై నిరంతరం సాగుతున్న అత్యాచారాలకు, దాడులకు, హత్యాకాండకు మూలాలు మన సమాజంలోనే వేళ్ళూనుకొని ఉన్నాయి. ఫ్యూడల్ దోపిడీ, భావజాలం, పితృస్వామిక అణచివేత, మార్కెట్ శక్తుల దోపిడీ స్త్రీలకు పెద్ద పీడగా ఉన్నాయి. వీటిని గుర్తించనివ్వకుండా, వీటికి వ్యతిరేకంగా ప్రజలు తగిన చైతన్యాన్ని సంతరించుకోనీయకుండా, సంఘటితపడి పోరాటాలు సాగించకుండా ఉండటానికి దోపిడీశక్తులు అడుగడుగునా ప్రయత్నిస్తూ ఉంటాయి. ప్రజల మెదళ్ళను మొద్దుబార్చటానికి ఒకవైపు మద్యం మత్తులో ముంచుతూ, మరోవైపు సినిమాల ద్వారా, టి.వి.ల ద్వారా, ఇంటర్నెట్ సైట్ల ద్వారా సాంస్కృతిక కాలుష్యాన్ని వెదజల్లుతున్నాయి. దాడులు జరిగిన సంచలనాత్మక సందర్భాలలో ఈ కారణాలవేపు ప్రజల దృష్టి మరల్చకుండా ఉండటానికి ఈ దోపిడీ శక్తులే అనేక రూపాలలో హంగామా చేస్తూ, చర్చాగోష్టులు నిర్వహిస్తూ, నేరస్తులకు ఏ శిక్షవేయాలనే దానిచుట్టూ విషయాలను తిప్పుతున్నాయి. కఠినశిక్షలు వేసే చట్టాలు చేయటం, ఎన్‌కౌంటర్లపేరిట చంపెయ్యటం, నష్టపరిహారాలిప్పించటం సమస్య యొక్క అంచులను కూడా తాకలేవు సరికదా సారాంశంలో తప్పనిసరిగా పక్కదారి పట్టించేవిగా ఉంటాయని మన అనుభవాలు నిరూపిస్తున్నాయి.

స్త్రీలపై దాడులు నివారింపబడాలంటే, స్త్రీలు హుందాగా, ఆత్మగౌరవంతో జీవించగలిగే సామాజిక వాతావరణం ఏర్పడాలంటే సమాజంలోని స్త్రీ పురుషులందరూ ప్రగతిశీల విలువలను, సామాజిక స్పృహను కలిగి ఉండి, సమాజంలోని రుగ్మతలపై పోరాడే చైతన్యాన్ని పెంపొందించుకోవాల్సిన ఆవశ్యకత వుంది. భూస్వామ్య, సామ్రాజ్యవాద దోపిడీ, పీడనలకు వ్యతిరేకంగా పోరాడకుండా; ప్రజాస్వామిక విలువలు పెంపొందకుండా; స్త్రీని రెండవశ్రేణి పౌరురాలిగా, లైంగిక సరుకుగా చూసే దృష్టికోణంలో మార్పు రాకుండా స్త్రీలపై సాగుతున్న దాడులకు అడ్డుకట్ట వేయలేము. ఉన్నతమైన ప్రజాస్వామిక విలువలతో కూడిన సమాజాన్ని నిర్మించుకోవటం మనందరి అవసరం, మనందరి బాధ్యత. ఈ బాధ్యతతోనే అన్నిరకాల దోపిడీ, పీడన, అణచివేత, అసమానతలకు వ్యతిరేకంగా సంఘటిత ఉద్యమాలకు సమాయత్తం కావాలని స్త్రీ విముక్తి సంఘటన అంతర్జాతీయ మహిళా పోరాటదినపు పిలుపునిస్తున్నది.

– స్త్రీ విముక్తి సంఘటన
ఆంధ్రప్రదేశ్

సమకాలీనం

# 'తౌండి' రాజకీయాలు - ప్రజల ఆశలూ!!

**అంతర్జాతీయ** మాతృభాషా దినోత్సవం ఫిబ్రవరి 21న విజయవాడలో జరిగిన ఒక సభలో హర్‌మోహిందర్‌సింగ్ సాహ్ని అనే ఒక సిక్కు పంజాబీ, తన యాసలోనే అయినా చక్కని తెలుగులో మాట్లాడుతూ "66 ఏళ్ళ క్రితం బెంగాలీ జాతిని విడగొట్టారు, పంజాబీ జాతిని విడగొట్టారు. ఇపుడు తెలుగుజాతిని విడగొట్టారు. ఒక జాతిని విడగొడితే ఎలాంటి వేదన ఉంటుందో ఎరిగినవాడిగా నేటి పరిణామాలకు విచారిస్తున్నాను" అన్నారు. 1947లో జరిగినదాన్ని దేశ విభజనగా మాత్రమే చెప్పి, జాతుల విభజన అంశాన్ని కప్పిపుచ్చే వారున్నారు. ఉపఖండంలోనే కాదు నాటి బ్రిటీష, అమెరికన్ సామ్రాజ్యవాదులు చైనా, వియత్నాం, కొరియా, పాలస్తీనా, జర్మనీలను కూడా విడగొట్టారు. తన పరాధీన దేశాలను, జాతులను అణచివుంచటం, చీల్చటం సామ్రాజ్యవాదపు సహజ లక్షణమని ఎరగనివారెవరూ లేరు. అయితే ప్రపంచీకరణ (ఎల్.పి.జి.) పేరిట సరికొత్తగా ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక దురాక్రమణను కొనసాగించ పూనుకున్న మార్కెట్టు శక్తులు ఆంధ్రప్రదేశ్‌ను తమ ప్రయోగశాలగా గత 25 ఏళ్ళుగా చేసుకున్నారనే విషయంతో కలిపి అర్థం చేసుకున్నప్పుడే నేటి పరిణామాలను సక్రమంగా బేరీజువేయగలుగుతాము. సామ్రాజ్యవాదపు ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక ఆధిపత్యాలనుండి బయటపడలేని ఏ జాతీ నిజమైన అర్థంలో వికాసాన్నీ, స్వంతకాళ్ళపై నిలబడగలిగిన స్వయం నిర్ణయ వ్యక్తిత్వాన్నీ సాధించలేదని గత నూరేళ్ళ ప్రపంచ చరిత్ర చాటి చెబుతోంది.

బలమైన జాతీయ పునాదులు గల ఆధునిక పారిశ్రామిక వ్యవస్థను నిర్మించుకోవటానికి అవరోధమైన కాలంచెల్లిన భూస్వామిక సంబంధాల నుండి తెలుగుజాతి నేటికీ బయటపడలేదు. కుల, మత, ప్రాంతీయ అసమానతలను రూపుమాపుకోలేదు. విదేశీ దోపిడీ నుండి బడా బూర్జువాల ఆధిపత్యం నుండి విడగొట్టుకోలేదు. తన జాతి భాషలోనే తన ప్రజలను పరిపాలించే కనీస ప్రజాస్వామికతత్వాన్ని కూడా ఇన్నేళ్ళుగా ఏలిన తెలుగు పరిపాలకులు ప్రదర్శించలేదు. ఫలితంగా ఆర్థిక అసమానతలు, అధికధరలు, అవినీతి, నిరుద్యోగం, పొలాల సాగుకు, మనుషుల దాహార్తికీ నీళ్ళు లేకపోయినా పుష్కలంగా మద్యం తాగుడుతోసహా క్షీణ - పతన సాంస్కృతిక విలువలు, మహిళలపై భయంకరమైన హింసలు, లైంగికదాడులు ఇటు తెలుగూ రాని, అటు ఇంగ్లీషూరాని రెంటికి చెడ్డ రేవడలతో రాష్ట్రం నిండిపోయింది. వీటన్నిటితో బలహీనపడిన జాతిని, వీటికి వ్యతిరేకంగా పోరాటంద్వారానే ఐక్యం చేయగలుగుతామనే, బలోపేతం చేయగలగుతామనే రాజకీయ చింతన కూడా బలహీనంగా వుంది. కుళ్ళి, కంపుకొడుతున్న నేటి అర్థవలస - అర్థఫ్యూడల్ వ్యవస్థను సమైక్యంగా కొనసాగించినా, ప్రత్యేకాలుగా పరిపాలించినా ప్రజల జీవితాలలో వచ్చే మౌలిక మార్పులేమీ వుండవు.

సరిగ్గా 45 సంవత్సరాల క్రితం మార్క్సిస్టు మేధావి తరిమెల నాగిరెడ్డి ఆంధ్రరాష్ట్ర అసెంబ్లీకి రాజీనామా చేస్తూ "ఈనాటి అసెంబ్లీలు, పార్లమెంట్లు బాతాఖానీ షాపుల"న్నాడు. కనీసచర్చ (బాతాఖానీ) లేదు సరికదా ఓటింగు కూడా లేకుండా ఆంధ్రప్రదేశ్ విభజన బిల్లును రాష్ట్ర అసెంబ్లీ తిరస్కరిస్తే, కేంద్రంలో పార్లమెంటు ఆమోదించింది. కాంగ్రెసు నాయకుడు జయపాల్‌రెడ్డి హైదరాబాదు అసెంబ్లీలో జరిగిన తిరస్కరణకు సరిగ్గానే 'తౌండి' అని పేరుపెట్టాడు. మరి పార్లమెంటులో జరిగినదంతా ప్రజాస్వామికమా జయపాల్‌రెడ్డిగారూ!! 21 నిమిషాలలో తేల్చగలిగిన వివాదాన్ని 14 సంవత్సరాలపాటు ఎవరు, ఎందుకు కొనసాగనిచ్చారు? ప్రపంచీకరణ మార్కెట్ శక్తుల దుర్మార్గాలను ఒకే జాతిగా ఎదుర్కోవాల్సిన కాలంలో ప్రాంతీయ అసమానతత్వాలకు కారకులైన పాలకవర్గాలూ వారి రాజకీయ ముఠాలే ప్రజల పేరిట అధికార కుమ్ములాట లాడుకున్నారు. తెలుగుజాతిని బహుళజాతి కంపెనీలు, అంబానీలు నిట్టనిలువునా దోచుకుపోతుంటే పట్టనట్టు, ఎగరనట్టూ నటిస్తున్నారు. సమైక్యం - ప్రత్యేకం పేరిట మారీచుల్లా ప్రవర్తించారు.

కాంగ్రెసుపార్టీ-భారతీయ జనతాపార్టీలను పరస్పర విరుద్ధమైనవిగా భావించే రాజకీయ అమాయకులు మనకు చాలామందే వున్నారు. కానీ విదేశీ బహుళజాతి కంపెనీలకూ, అంబానీల్లాంటి బడా దోపిడీదార్ల ప్రయోజనాలను కాపాడటంలో ఆ రెండూ ఒకటేనని అంగీకరించేవారు కూడా వున్నారు. దోపిడీ పాలకవర్గాలకు ప్రాతినిధ్యంవహించే దేశవ్యాపిత పార్టీలుగా(వాటినే జాతీయ పార్టీలంటున్నారు) అవి రెండూ వున్నాయి. వెంటాడుతున్న ఆర్థిక - రాజకీయ సంక్షోభం ఫలితంగా ఏ ఒక్క రాజకీయ పార్టీకి పార్లమెంటులో మెజారిటీ వచ్చే పరిస్థితి గత 20 ఏళ్ళుగా దేశంలో లేదు. అందరూ 'కులగూరగంప' రాజకీయాలే నడపాలి. ఇలాంటి రాజకీయ బలహీనతలో కేంద్ర ప్రభుత్వాలుండగా, ఆంధ్రప్రదేశ్‌లో 2002నాటి విద్యుత్ వ్యతిరేక ఉద్యమానికి మించిన బలమైన ప్రజాఉద్యమాలు చెలరేగి నిలదొక్కుకుంటే ప్రమాదకరమన్నది కూడా పాలకవర్గాలకు తెలుసు. సామ్రాజ్యవాదులకు బడా పెట్టుబడిదార్లకు తమ దేశవ్యాపిత దోపిడీ ప్రయోజనాలకు ప్రమాదం కాగల బలమైన జాతులు, తమనెదిరించగల రాష్ట్రప్రభుత్వాలు ఉండకూడదు. బా.జ.పా. వారి చిన్న రాష్ట్రాల విధాన నిర్ణయం వెనుకనున్న 'గంభీర' రాజకీయమంతా యిదే. రాష్ట్రాలను కీలుబొమ్మలుగా ఆడించటం కాంగ్రెసు మార్క్‌రాజకీయమని ఇన్నేళ్ళ చరిత్రా చెబుతూనే వుంది. అనేక జాతులు నివశించే భారతదేశాన్ని "ఒకే జాతి" (భారతజాతి)గా నిర్వచించిన పాలకవర్గాల సైద్ధాంతికతలో కూడా దేశవ్యాపిత దోపిడీశక్తుల ప్రయోజనాలే వున్నాయి.

ప్రత్యేక తెలంగాణా రాష్ట్రం ఏర్పడితే యువకులకు మంచి ఉద్యోగావకాశాలు లభిస్తాయని, నల్లగొండ జిల్లాకు చెందిన 23ఏళ్ళ శ్రీకాంతాచారి 4ఏళ్ళ క్రితం ఆత్మహత్యకు పాల్పడ్డాడు. తమను కొడుకు వీడిపోయినా అతడి ఆశలు నెరవేరాలని కోరుకుంటూ శ్రీకాంతాచారి తల్లి శంకరమ్మ... **"అన్ని స్థాయిలలో ప్రైవేటు విద్యను, ప్రైవేటు వైద్యాన్ని రద్దుపరిచి ప్రభుత్వపరంగావిస్తేనే ప్రజలకు మేలు జరుగుతుంది. తెలంగాణాలో పుట్టిన ప్రతిబిడ్డా నాణ్యమైన ఉచిత విద్యను అన్ని స్థాయిలలో పొందాలి. ఏ పేదవాడూ కార్పొరేట్ హాస్పిటళ్ళలో ఫీజులు చెల్లించలేక మరణించకూడదు"** అన్నట్టుగా హిందూ పత్రిక విలేఖరి రాశాడు. (23-2-2014)

ప్రజల కనీస ఆకాంక్షలను శంకరమ్మ వ్యక్తంచేశారు. ప్రజలకు వారిదైన మాతృభాషలో విద్యనూ-పరిపాలననూ అందిస్తామనే హామీనైనా యివ్వటానికి సిద్ధపడని సమైక్య - ప్రత్యేక దొరలు శ్రీకాంతాచారి, అతని తల్లి శంకరమ్మల కనీస ఆశలనైనా నెరవేరుస్తారా? 40 ఏళ్ళ క్రితం శ్రీశ్రీ అన్నట్టు బానిసకొక, బానిసకొక, బానిసలమని అనిపించుకోకుండా వుండగలుగుతారా??

**24-2-2014** **- దివికుమార్**



# గురజాడ క్రాంత దర్శిత - మాండలిక భాషా ప్రభావం



- కాందూరి సీతారామచంద్రమూర్తి

**'కవి** క్రాంతదర్శి' అన్నమాట గురజాడ విషయంలో నూటికి నూరుపాళ్ళు నిజం. వ్యావహారికభాషకే ఆమోదంలేని కాలంలో మాండలికాలను యధేచ్ఛగా కథలలో, నాటకాలలో ప్రయోగించిన క్రాంతదర్శి గురజాడ. వ్యావహారిక భాషావ్యాప్తికి గిడుగు రామమూర్తిగారికి సహకారం అందించడంలో భాగంగా గురజాడ రచనలు సాగించాడు. గట్టిగా చెప్పవలసి వస్తే మాట్లాడేభాష గురజాడ వందేళ్ళ క్రితం ప్రయోగించారు. ఉత్తరాంధ్రలో రావిశాస్త్రి ఆ ఒరవడిలో మునుముందుకు సాగారు. కె.ఎన్.వై. పతంజలి వంటివారు అనుసరించారు. తరువాత ఇతర ప్రాంతాల వారూ వారి వారి మాండలికాల్లో రచన సాగించారు.

'వేసిన దారంట వెళ్ళిపోవటం సులభం. అంతేకాదు పదిలం. నలుగురికీ తెలిసిందీ, చిరకాలం నుంచి నలిగిందీ ఒకదారి సుప్రసిద్ధంగా ఉంటూనే ఉన్నప్పుడు వేరే ఒక కొత్తదారి వెదకడం అవివేకం, ప్రమాదం అని అంటారు కొందరు. కాని పురోగమనానికి కొత్తదారులే రాచబాటలు.'[1] అని శ్రీ శ్రీ గురజాడ ప్రయత్నాన్ని సాహసంగా పేర్కొన్నారు. గురజాడ తనకి ముందున్న అభిప్రాయాలు తాను ఖండించడానికే 'కన్యాశుల్కా'న్ని రాసినట్టు పేర్కొన్నారు.

"I clothed the play in the spoken dialect, not only that is better intelligible to the stage going public than the literary dialect, but also from a conviction that it is the proper comic diction for Telugu."[2]

"I wrote it to advance the cause of social reform and to combat a popular prejudice that the Telugu language was unsuited to the stage."[3]

గురజాడ ఇలా పేర్కొనడానికి కారణం ఆనాడు నాటకభాష గురించి జరిగిన రాద్ధాంతమే. 1891లో 'నాగానందము' నాటకం ప్రకటించినపుడు వేదం వేంకటరాయశాస్త్రి గారు 'గ్రామ్యభాషా ప్రయోగ నిబంధనము' అనే వ్యాసంలో సంస్కృత నాటకాలలో సంస్కృతం, ప్రాకృతం వాడినట్లుగా సంస్కృతం స్థానంలో గ్రాంథికభాషను ప్రాకృతం స్థానంలో గ్రామ్యభాషనీ వాడవచ్చుని సిద్ధాంతం చేసారు.[4]

దీనికై రాద్ధాంతం చేసినవారి నుద్దేశించి జవాబు చెబుతూ 'అముద్రిత గ్రంథ చింతామణి' పత్రికాధిపతి పూండ్ల రామకృష్ణయ్య 1899లో "శ్రీనివాస కల్యాణము నాటకమున గ్రంథకర్తగారగు మాడ్గుల రాజాగారు(తరువాత జయపురం మహారాజు శ్రీ విక్రమదేవవర్మ) పీఠికలో 'జనరంజనముగా నుండునను తలంపుతో పాత్రానుగుణ్యముగా నచ్చటచ్చట దేశ్య, గ్రామ్య పదములు వ్యవహరింపబడినవి' అని వ్రాసియుండుట వలన విశాఖపట్టణము మండలమునను నాటకముల బాత్రోచితమైన గ్రామభాషయే వలయునని స్పష్టమయినది గదా" అని గ్రామ్యభాషాప్రయోగాన్ని సమర్థించారు.[5]

ఈ సందర్భంలో వారి వాదనకు ఉపబలకంగా వారు ఉటంకించిన సంస్కృత శ్లోకం గమనార్హం.

ఆనందనిష్యందిషు రూపకేషు వ్యుత్పత్తి మాత్రం ఫలమల్ప బుద్ధిః
యోపీతిహాసాది వదాహ సాధుః తస్మై నమః స్వాదు పరాఙ్ముఖాయ[6]

ఎరగుడిపాటి వెంకటాచలముగారు "పాత్రోచితమైన భాష నాటకాదులయందు ఉపయోగించుట గర్హ్యము కాదు. అత్యావశ్యకము"[7] అని సిద్ధాంతరీకరిస్తూ షేక్స్పియర్ 'మిడ్ సమ్మర్స్ నైట్స్ డ్రీమ్', 'హెన్రీ, ది ఫిఫ్త్' అనే నాటకాలలో నీచపాత్రలకు గ్రామ్యభాషను ఉపయోగించారని వివరించారు.

అసలు గ్రామ్యము అంటే చిన్నయసూరి ప్రకారం "లక్షణ విరుద్ధంబగు భాష గ్రామ్యంబు." దానికి ఉదాహరణలు వస్తాదు, తెస్తాదు, వచ్చేవి, తెచ్చేవి, వచ్చేవాడు, తెచ్చేవాడు, వచ్చేటివాడు, తెచ్చేటివాడు.[8] దీనిని గ్రామ్యము అనడం హాస్యాస్పదం అని గురజాడ అభిప్రాయం.

"It has been remarked that the use of what is wrongly termed the vulgar tongue mars the dignity of a literary production but that is a piece of criticism which one need not heed at the present day when the progress of the science of language has established better standards for judging the quality of usefulness of tongues that whims of the grammarians of old linguistic strata."[9]

ఈ అభిప్రాయాన్ని కన్యాశుల్కం రెండో ప్రచురణ తర్వాత కూడా సమర్థించవలసి వచ్చింది. గిడుగు వెంకట రామమూర్తి గారు "ఏదయినా పెద్దలు నోటను పలికేది ఏదయితే పిన్నలు అది విని నేర్చుకుంటారు. గనుక పాత పుస్తకాలలో ఏలాగున్నా, ఇప్పటి పెద్దలు వాడేదే సాధువు. భాషా లక్షణము చెప్పినవారందరూ ఫలాని దేశంలో జనులు ఆడునదియే ఫలాని భాష అని చెప్పినారు." అని వివరించి దానిని గ్రామ్యం అనకూడదని లాక్షణికులకే గ్రామ్యంపై సరైన అవగాహన లేదని కేతన చెప్పిన గ్రామ్యములు కూచిమంచి తిమ్మకవి ఖండించాడనీ, చులక గ్రామ్యజనులు పలుకునట్టి తెనుగు మాటలు గ్రామ్యములు అని అప్పకవి చెప్పిన ప్రయోగాలు నన్నయ, తిక్కనలు చేసారని కనుక గ్రామ్యము అనకూడదని వ్యావహారిక భాష అనాలని చెప్పారు.[10]

"అసలు గ్రామ్యం అంటే మన పూర్వుల వుద్దేశం ఏమిటి? మనమేమనుకుంటున్నాము? పూర్వుల ఉద్దేశం అసభ్యమైన భాష అని. కొన్ని బజారు మాటలు నలుగురు పెద్దమనుష్యులలో, సభలలో మాట్లాడ రానివి ఉంటాయి. అవీ పూర్వం సంస్కృతంలో కటిగల్లాదులలాంటివి. చన్నులు ఇప్పుడల్లాంటిది." అని విశ్వనాథ సత్యనారాయణ గారు వివరిస్తూ గ్రామ్యం కాదు వాడుకభాష అనాలన్నారు.[11]

గ్రామ్యామా వాడుకభాషా అని ఇంత చర్చ జరిగిందంటే మాండలిక భాష ఆలోచనే రానికాలంలో గురజాడ తన రచనల్లో మాట్లాడేభాషని వందేళ్ళ క్రితం విజయవంతంగా ప్రయోగించాడంటే అతని క్రాంత దర్శిత్వం ఎంత గొప్పదో అర్థం అవుతుంది.

గురజాడ తన రచనలను మళ్ళీ మళ్ళీ దిద్దుకున్నాడు. కారణం మాండలికానికి దగ్గర కావడం కోసమే. ఇది అతని కథలు, కవితలు ముఖ్యంగా 'కన్యాశుల్కం'లోను కనిపిస్తున్నాయి. ఇవి ప్రత్యేకంగా అధ్యయనం చేయాలి.

'దిద్దుబాటు' కథ దిద్దిన పాఠమే తీసుకుంటే అందులోని రెండు పాత్రల సంభాషణలకూ మాండలికాన్నే ప్రయోగించారు. దిద్దినపాఠంలో కథనంలో, గోపాల్రావు సంభాషణల్లో కూడా మార్పు వచ్చింది. పనివాడు రావుడు మాటల్లో మాత్రం పెద్దగా దిద్దుబాట్లు కనిపించడంలేదు. బహుశా

పాత్రోచిత భాషగా అప్పటికే ఆమోదం పొందడం కారణం కావచ్చు. దిద్దినపాఠంలో కథనంలో మార్పుకి రెండు ఉదాహరణలు.

**మొదటి రచన :-**

గోపాలుడు సదయ హృదయుడు. అక్రమమాచరించితినను జ్ఞానము వెంటనే పొడమి ఆగ్రహావేశము దిగజారి పశ్చాత్తాపము కలిగెను. రాముని చేత లేవనెత్తి, పశువువలె నాచరించితి యనుకొనుచు గదిలోనికి తీసుకొనిపోయెను.[12]

**రెండవ రచన :-**

గోపాలరావు దయకలవాడు. వెంటనే కోపం దిగజారి, పశ్చాత్తాపం కలిగింది. రాముణ్ణి చేతలేవనెత్తి, వీపునిమిరి, 'కోపంపట్టలేక పశువువలె ఆచరిస్తిని' అనుకుంటూ గదిలోకి తీసుకువెళ్లాడు.[13]

గోపాల్రావు మాటల్లో కూడా మార్పు స్పష్టంగా కనిపిస్తోంది.

**మొదటి రచన :-**

"నువు చెప్పవలసిన మాటలు చెబుతాను. బాగా విను. 'పంతులికి బుద్ధి వచ్చింది. యిక యెన్నడూ సానుల పాట వినరు. రాత్రులు యిల్లు కదలరు. యిది ఖరారు. తెలిసిందా? మిమ్ములను గెడ్డము పట్టుకుని బతిమాలుకున్నానని చెప్పమన్నారు. దయదలచి ఆయన లోపములు బయటపెట్టక రెండు మూడు రోజులలో వెళిపోయి రమ్మన్నారు. మీరు లేని రోజొ యుగముగా గడుపుతున్నారు.' అని నిపుణతగా చెప్పు."[14]

**రెండవ రచన :-**

"నీకెందుకు? నే అన్నమాట గట్టిగా జ్ఞాపకం వుంచుకుని చెప్పు - పంతులికి బుద్ధి వచ్చింది అను. మరి యెన్నడూ సానుల పాట వినరు. గట్టిగా వొట్టువేసుకున్నారు. - (మరచిపోయి అన్నాను. ఆ మాట అనకు) యిటుపైని యెన్నడూ రాత్రిళ్ళు యిల్లుకదలరు. యిది ఖరారు తెలిసిందా?"

"యింకా యేమిటంటే, గెడ్డం పట్టుకుని బతిమాలుకున్నానని చెప్పమన్నారు. దయదల్చి పంతులు లోపాలు బయటపెట్టద్దన్నారు. (యిది ముఖ్యమైన మాట. విన్నావా?) రెండు మూడు రోజుల్లో తప్పకుండా వెళిపోయిరమ్మన్నారు. మీరు దగ్గర లేకపోవడం చేత వెఱ్ఱెత్తినట్టున్నారు. గడియో యేడు లాగ గడుపుతున్నారు. (యీ మాట మరవగలవు జాగర్త) యేం జెప్పాలో తెలిసింది గద? ఒక్కమాటైనా మరిచిపోకు."[15]

రెండు సంభాషణలలోని తేడాని గమనిస్తే సంభాషణ నడిపే విధానంలోని వైవిధ్యం స్పష్టంగా కనిపిస్తుంది. మాండలిక భాషకి దగ్గిరగా మార్పు జరిగింది. రెండో రచనలోని సంభాషణ ఎదుటి మనిషితో మాట్లాడుతున్నట్టుగా ఉంది. రావుడికి చేసిన హెచ్చరికలు బ్రాకెట్లలో ఉండడం వలన వాటి విలువ పెరిగింది. రెండు సంభాషణలలోను వెళిపోయి రమ్మన్నారు అన్నమాట ఉత్తరాంధ్రలో వాడుకలో ఉన్న వెళిపోచ్చీమన్నారు అన్న మాండలిక పదాన్ని గుర్తు చేస్తుంది. బయల్దేరి రమ్మన్నారు అనచ్చుకాని గురజాడకి మాండలిక పదం మీద ఉన్న అభిమానం వల్ల ఇలా రాసి ఉండవచ్చుననుకోవచ్చు.

రాముడు ఎలాగూ రావుడు అయ్యాడు. అలాగే అతని మారిన సంభాషణలలో మాండలికానికి మరింత పదును పెట్టడం జరిగింది. గోపాల్రావు తన భార్య పుట్టింటికి గానీ వెళ్ళి ఉంటుందేమో అన్నప్పుడు రావుడి సమాధానం మార్చిన తీరు చూద్దాం.

**మొదటి రచన :-**

"అంతవారు కారనా? బాబూ కోపగించితే చెప్పలేను గాని ఆడారు చదువు నేరిస్తే యేటౌతది"[16]

**రెండవ రచన :-**

"అంతోరు కారనా, బాబూ? కోపగించితే సెప్పజాల్ను గానీ ఆడోరు సదువుకుంటే యేటౌతది బాబూ?"[17]

కథలో మాండలికాన్ని ప్రయోగించిన గురజాడ, గోపాల్రావు భార్య ఉత్తరాన్ని మాత్రం గ్రాంథికంలోనే ఉంచారు. అలాగే కథ చివర వాక్యాన్ని రెండో రచనలో సరిదిద్దిన గురజాడ ఆ వాక్యంలోని చివర క్రియను 'వినవయ్యెను' అని అలాగే ఉంచేసారు.

'మీ పేరేమిటి?' కథను లిఖితప్రతితో సరిపోల్చి అచ్చువేస్తేనే గురజాడ ప్రయోగించిన మాండలికాల విలువ తెలుస్తుంది. ఆ కథ అచ్చయిన పత్రిక నుంచీ తీసుకోవడం వలన ప్రయోజనం నెరవేరదు. విశాలాంధ్ర ప్రచురణాలయం వారు లిఖితప్రతిలోని పాఠాంతరాలు ఇచ్చి మేలు చేసారు. ఆ కథ ఉత్తమ పురుషలో సాగింది. అందులోని భాష పాత్రానుగుణంగా సాగింది.

'మెటిల్డా', 'సంస్కర్త హృదయం', కథలలోని పాత్రల స్వరూప స్వభావాలను బట్టి ఆ కథలలో వ్యావహారిక భాష మాత్రమే కనిపిస్తుంది.

'మతము-విమతము' కథలో కథనం గ్రాంథిక భాషలో సాగింది. గురుశిష్యులిద్దరి సంభాషణా మాండలికంలో పాత్రానుగుణంగా సాగింది.

శిష్యుడు :- ఏమి తీరుగా కట్టాడు స్వామీ, మసీదు!

నారాయణ భట్టు :-వాడి శ్రాద్ధం కట్టాడు[18]

'సౌదామిని' నవల స్థూలరూపమే కనిపిస్తున్నా అందులో కథ, పాత్రలను బట్టి మాండలికభాషకు అవకాశం ఉన్నట్టుగా కనిపించడం లేదు. ఈ విధంగా కథలలో మాండలికభాషని ప్రవేశపెట్టిన గురజాడ తరువాతి తరానికి మార్గనిర్దేశం చేసాడు.

గురజాడ కవితల విషయానికొస్తే మాండలిక భాషాప్రయోగంలో గిడుగు రామమూర్తిగారి అభిప్రాయాన్నే పాటించినట్టు కనిపిస్తోంది. కవిత్వంవిషయంలో వ్యావహారికభాషకు రామమూర్తిగారు మినహాయింపు ఇచ్చారు. అందువలననే గురజాడ కవితలలో అక్కడక్కడ మాత్రమే మాండలికాలు కనిపిస్తున్నాయి. 'మించిపోయెను', 'పెట్టి పొయ్యకపోతె పోనీ', 'కోసేది' 'దుక్కించె', 'కానండీ', 'కోవిల' వంటి పదాలు కొన్ని మాత్రమే గురజాడ కవితలలో కనిపిస్తున్నాయి.

'కన్యాశుల్కం' నాటకం ఉత్తరాంధ్ర మాండలికానికి విజయపతాక. 'కన్యాశుల్కా'నికి టీకా టిప్పణి అవసరం అయిందన్నది వాస్తవం. 'కన్యాశుల్కం'లోని భాష ఒక ప్రాంతానికి, కొన్ని వర్గాలకి చెందినది. అది కూడా నేడు కొంత కనుమరుగైన భాష. 'కన్యాశుల్కం'లోని మాండలికాలకు అర్థాలు రాసేవారు ఆ మాండలికం మీద మంచి పట్టున్నవారు కావాలి. లేకపోతే సవరణలు అవసరమవుతాయి. దీనికి ఒక ఉదాహరణ చూద్దాం. 'దంగైపోయినారు' అన్నమాటలకి కె.వి.ఆర్. ఒక అర్థం రాస్తే మరొకరు దానికి వేరే అర్థం చెప్పారు. కన్యాశుల్కం తొలికూర్పులో ఆ మాటకు బదులుగా 'టర్రు కొట్టేశారు'[19] అని ఉంది. ఇదీ మాండలిక పదమే. అర్థం తెలుసుకోవాల్సి ఉంది.

గిరీశం :-......... పూనా దక్కన్ కాలేజీలో నేను చదువుతున్నప్పుడు 'ది ఇలెవెన్ కాజస్ ఫర్ది డిజెనరేషన్ ఆఫ్ ఇండియా'ను గూర్చి మూడు గంటలు ఒక్కబిగిని లెక్చర్ యిచ్చేసరికి ప్రొఫెసర్లు <u>దంగైపోయినారు</u>[20]

"దంగైపోయినారు

నిరుత్తరులైపోయారు Dumb వుచ్చారణలో 'డమ్' ఈ మాటకు మూలమేమో[21]"

'దంగు' అనే మాటకు Dumb వుచ్చారణలో 'డమ్' ఈ మాటకు మూలమేమో అని కె.వి.ఆర్.గారు కన్యాశుల్కం టీకా టిప్పణిలో అన్నారు. కాని 'దంగు' అనే తెలుగు మాటకు 'శుభ్రముగా నలిగినది', 'తెల్లగా దంచబడినది' అనే అర్థం ఉంది. 'దంగుబ్రాలు' అంటే 'తెల్లగా దంచిన బియ్యం' అని అర్థం. ఈ గిరీశం మాటకు పూనాలో ప్రొఫెసర్లంతా తెల్లముఖాలు వేసేరని అర్థం. ఈ అర్థం ఇప్పటికీ శ్రీకాకుళం జిల్లాలో వాడుకలో ఉంది.[22]



X

X.

'కన్యాశుల్కం'లోని మాండలికాలకి ఉదాహరణలివ్వాల్సి వస్తే నాటకం అంతా ఇవ్వాలి. అందువలన మచ్చుకి కొన్ని ఉదాహరణ లిస్తున్నాను.

"మనవాళ్ళు వొట్టి వెధవాయలోయ్"
"ఈ కాలపు గుంటలని నమ్మడానికి వీల్లేదు"
"దెయ్యాని కెట్టింది తింతున్నావయ్యా"
"ఓలమ్మ! యెంత బలువుండోస్సి!"
"యీతూరి యీరేచ వుప్పుదేశం సేస్తన్నాడు"
"వీడి శ్రాద్ధం చెట్టుకింద బెట్టా!"
"నీ ఇంట కోడి కాల్చా!"
"అయితే దొబ్బేస్తావా యేమిటి?"
"యీ వూళ్ళో తాగడం లావుగా వున్నట్టు కనబడుతుంది."
"నీకు రూపాయి చాలదురా గుంటకక్కకట్టా?"

మాట్లాడినట్టే రాయగలమా అన్న సందేహాన్ని గురజాడ 'కన్యాశుల్కం' ద్వారా తీర్చి నూటపదిహేనేళ్ళు అవుతోంది. 2012 ఆయన నూట యేభయ్యో జయంతి సంవత్సరం.

1. *ఆధునిక గద్యవాఙ్మయ ప్రవర్తకుడు - మన గురజాడ - విరసం ప్రచురణ - 1988 - పుట 49*
2. *Preface to the First Edition - కన్యాశుల్కం(1909) - గురజాడ రచనలు - విశాలాంధ్ర ప్రచురణ - 1986 - పుటలు - xx*
3. *Preface to the Second Edition - కన్యాశుల్కం(1909) - గురజాడ రచనలు - విశాలాంధ్ర ప్రచురణ - 1986 - పుటలు - xii*
4. *తెలుగునాటక వికాసము డా॥ పోణంగి శ్రీరామ అప్పారావు - ప్రచుణ - 1967 - పుటలు 609, 610*
5. *నాటకాదులయందు గ్రామ్యభాష యుపయోగింపదగునా తగదా? - సారస్వత వ్యాసములు - రెండవ సంపుటము - ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ - ప్రచురణ - 1969 - పుటలు 39, 40*
6. *నాటకాదులయందు గ్రామ్యభాష యుపయోగింపదగునా తగదా? - సారస్వత వ్యాసములు - రెండవ సంపుటము - ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ - ప్రచురణ - 1969 - పుట 40*
7. *పైదే.... - పుట 42*
8. *బాలవ్యాకరణము - సంజ్ఞాపరిచ్ఛేదము - చిన్నయసూరి - విశాలాంధ్ర ప్రచుణ - ఆగస్టు 2007 - పుట 19*
9. *Preface to the Second Edition - కన్యాశుల్కము (1909) - విశాలాంధ్ర ప్రచురణ - 1986 - పుట xiii*
10. *గ్రామ్యభాష కాదు వ్యావహారిక భాష - సారస్వత వ్యాసములు - నాలుగవ సంపుటము - ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడమీ ప్రచురణ - 1972 - పుట 258*
11. *గ్రామ్యమా? వాడుకభాషా? - సారస్వత వ్యాసములు - నాలుగవ సంపుటము - ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ప్రచురణ - 1971 - పుట 361*
12. *దిద్దుబాటు - గురజాడ రచనలు కథానికలు - విశాలాంధ్ర ప్రచురణ - 1984 - పుట 20*
13. *పైదే... - పుట 24*
14. *పైదే... - పుట 22*
15. *పైదే... - పుట 27*
16. *దిద్దుబాటు[1] - గురజాడ రచనలు కథానికలు - విశాలాంధ్ర ప్రచురణ - 1984 - పుట 20*
17. *పైదే... - పుట 25*
18. *మతము - విమతము - గురజాడ రచనలు కథానికలు - విశాలాంధ్ర ప్రచురణ - 1984 - పుట 61*
19. *కన్యాశుల్కం (తొలికూర్పు 1897) - గురజాడ రచనలు - విశాలాంధ్ర ప్రచురణ - 1990 - పుట 2*
20. *కన్యాశుల్కం (1909) - గురజాడ రచనలు - విశాలాంధ్ర ప్రచురణ - 1986 - పుట 22*
21. *కన్యాశుల్కం టీకా టిప్పణి - కె.వి.ఆర్. - వెలుగు ప్రచురణ - 1991 - పుట 13*
22. *గురజాడ నాటకాలు-డా॥యం.ఏ.నరసింహమూర్తి-ప్రజాసాహితి - కన్యాశుల్కం శతజయంతిసంచిక-ఆగస్టు 1992-పుటలు 66, 67*

**(గురజాడ 150వ జయంతి సందర్భంగా ప్రజాసాహితి వెలువరించిన ప్రత్యేక సంచిక (351) కోసం మాకందిన రచనలను ఈనెల వరకూ ప్రచురిస్తూవచ్చాము. ఇంతటితో ఈ శీర్షిక పూర్తయింది)** ✤



## వచ్చే సంచికల్లో

**కథలు :**

సినిమా తీస్తా - తమ్మినేని అక్కిరాజు
చెట్టు - తుర్లపాటి రామమోహనరావు
స్వీకారం - ఎన్.వి.యస్ నాగభూషణ్

**వ్యాసాలు :**

కాళోజీపై - డా॥ దిలావర్
రాచపాళెం కవిత్వంపై - తవ్వా వెంకటయ్య
అంతర్జాతీయ బాలల చిత్రోత్సవంపై - భూపాల్
గుంటూరు కథలపై సమీక్ష - చెరుకూరి సత్యనారాయణ
వరేణ్యా రెడ్డి ఇంగ్లీషు పుస్తకాలపై సమీక్ష



# మత్తు

- సిహెచ్. మధు

యస్ఐ జ్యోత్స్న కేసు ఫైల్ చేసింది. తెల్లవారితే సోమవారం. లాకప్‌లో వున్న రఘును కోర్టుకు తీసుకెళ్ళాలి. తను తయారు చేసిన చిట్టా ప్రకారం, చట్టం ప్రకారం, చట్టం అంకెల ప్రకారం రఘుకు మరణశిక్ష పడవచ్చు. లేదా యావజ్జీవ కారాగారశిక్ష పడవచ్చు. అందుకు సమానమైన భయంకరశిక్ష పడవచ్చు - ఇప్పుడున్న పరిస్థితులలో, సామాజిక స్పందన వాతావరణం ప్రకారం అంతకు తక్కువ శిక్ష పడకపోవచ్చు. కేసు ఫైల్ చేస్తున్నపుడు, కఠినాతికఠిన శిక్షలు పడే అంకెలు వ్రాయాలా వద్దా అని రెండు మూడు రాత్రులుగా ఆలోచిస్తూ వుంది జ్యోత్స్న.

రెండు మూడు రోజులుగా ఆమె మనసేమీ బాగులేదు. పోలీసుశాఖలో వున్న వారికి మనసు వుండదని మనం భావిస్తాం కానీ మనసున్న వారుంటారు, వారిలో జాలి, దయ, కరుణ వుంటుంది. పోలీసులు శిక్షించే యంత్రాలుగా ఒక భావన వుందికానీ శిక్షించే బదులు వాళ్ళుపడే ఆరాటం కూడా వుంటుంది. ఉరిశిక్ష విధించే వాడికి బాధ వుంటుంది. వురి వేసే వాడికి బాధ వుంటుంది. ఊరితీసేవాడికి బాధ వుంటుంది. బాధ బాధే. అయితే కొందరు మొద్దుబారిపోతారు. వారి మనసు మొద్దుబారి పోతుంది. యంత్రాల్లా తయారవుతారు. సాడిస్టులుగా తయారౌతారు. అందుకే పోలీసులను అలా భావిస్తాం. మొరటుగా లాఠీతో కొడుతున్న పోలీసును చూచి మనమేమనుకుంటాం! దయా, కరుణ లేదు వీడికి అనుకుంటాం! ఎన్‌కౌంటర్‌లలో ప్రాణాలు తీసినవాడిని చూచి పోలీసులెంత దుర్మార్గులు అనుకుంటాం. ఎంత కర్కశులు అనుకుంటాం. పుట్టుకతోనే పోలీసులు కర్కశులుకాదు. ఈ వ్యవస్థే కర్కశత్వమైంది. ఈ వ్యవస్థే దుర్మార్గమైంది. ఈ వ్యవస్థే మానవత్వం లేనిది. వ్యవస్థను ఆయుధాలతో కాపాడేవారు పోలీసులు కనుక వ్యవస్థే కర్కశం కనుక వారు కర్కశంగానే కనిపిస్తారు. వ్యవస్థకు మానవత్వం లేనపుడు పోలీసులకుంటుందా?

అయితే పోలీసులలో మంచివారూ ఉంటారు. వ్యవస్థ లక్షణాలు పోలీసు వ్యవస్థలో వుంటాయి కానీ - కొంత మమత వుంటుంది. ప్రతివర్గంలో మంచి - చెడు వున్నట్లుగా వారిలోనూ వుంటాయి కానీ ప్రభుత్వ ఉద్యోగాలలో వ్యవస్థ లక్షణాలు చోటుచేసు కుంటాయి. ఈ లక్షణాలన్నీ దోపిడీలో భాగమే! పోలీసులు లాఠీ విసరటంలో కర్కశంగా వున్నట్లే న్యాయమూర్తులు శిక్షలు విధించటంలో కర్కశంగా వుంటారు. ప్రైవేట్ విద్యాలయాలు ఫీజు వసూళ్ళలో కర్కశంగా వుంటాయి. ప్రైవేట్ వైద్యులు రోగిని డబ్బులలో నిలువునా ముంచటంలో కర్కశంగా వుంటాయి. ఇది దుర్మార్గమైన కర్కశవ్యవస్థ ఒక్క పోలీసులనే కర్కశులు అనలేము.

ముప్పదిఐదు దాటని జ్యోత్స్న యస్ఐగా ప్రమోట్ అయి నాల్గు సంవత్సరాలు. చాలా చిన్న వయసులో యస్ఐ అయ్యింది. పోలీసు శాఖ అంటే లంచాల శాఖ అనే పేరుంది కానీ మరీ అంతాకాదు కొందరు నీతిమంతు లున్నారు. జ్యోత్స్న ఒక్కపైసా లంచం తీసుకోదు. 'చట్టం' గురించి ఒక ప్రాథమిక సూత్రం ఆమెకు తెల్సు. నేరస్తులను పట్టుకుని కోర్టులో హాజరుపర్చటమే తమ బాధ్యత. తీర్పు చెప్పే బాధ్యత తమది కాదు. పరిష్కారం తమది కాదు. శిక్షించే బాధ్యత తమది కాదు.

రఘు తప్పుచేసాడని ఆమెకు తెల్సు. ఘోరమైన తప్పని జ్యోత్స్నకు తెల్సు. తన తప్పును రఘు అంగీకరిస్తున్నాడు. ఆ తప్పు మామూలు తప్పుకాదు. ఒక కాలేజీ అమ్మాయిని రేప్ చేసాడు. రేప్ చేసిన రఘుమీద ఒక మహిళా యస్ఐ సానుభూతిగా వుండటమేమిటీ? - ఆశ్చర్యంగా వుందికదూ! - రేప్ చేసాడని రఘుపై ఫిర్యాదు వచ్చిన తర్వాత అగ్గిమీద గుగ్గిలమయ్యింది జ్యోత్స్న. అరెస్టు చేసిన రెండు రోజుల వరకు ఆమె కఠినంగానే వుంది. ఆ తర్వాతే రఘుపై కొంత సానుభూతి పెరిగింది.

ముప్పది ఐదు దాటని జ్యోత్స్న హుషారుగా వుంటుంది. లా (ఎల్ఎల్‌బి) చదివి యస్ఐగా వచ్చింది కనుక ఆమెకు చట్టాలు తెల్సు. మధ్యతరగతి కుటుంబం నుండి వచ్చింది. మధ్యతరగతి అబ్బాయినే పెండ్లి చేసుకుంది. ఆయన ఒక బ్యాంకులో అసిస్టెంట్ మేనేజర్. జ్యోత్స్నకు ఇద్దరు పిల్లలు కూడా!

రేప్ చేసిన ఒక మగవాడి మీద ఒక ఆడ యస్ఐకు జాలి గలుగటమేమిటీ? - విచిత్రంగా వుంది కదూ! - రేప్ చేయటం తప్పు ఇటువంటి వారిని కఠినాతి కఠినంగా శిక్షించాలనే ధోరణి ప్రజలలో విపరీతంగా ప్రబలిన ఈ రోజులలో ఒక మహిళా యస్ఐ లైంగిక నేరస్తుడిపై సానుభూతి చూపించటం మింగుడుపడని విషయమే. జ్యోత్స్న జాలి గూర్చి పక్కనుంచుదాం! రేపిస్టులను అందరూ శిక్షించమని అనేవారే! కఠినాతి కఠిన శిక్ష విధించాలని అనేవారే! మరణ దండన విధించాలని కోరుకుంటున్నవారే! అయితే ప్రతిదినం రేప్‌లు, మానభంగాలు ఎందుకు జరుగుతున్నాయి? - అందరూ నీతిబోధలు న్యాయసలహాలు ఇచ్చేవారే! అయినా రేప్‌లు మానభంగాలు ఎందుకు జరుగుతున్నాయి? అందరూ ధర్మరాజులే! చాటుమాటుగా దుర్యోధనులు, దుశ్శాసనులు ఎందుకు కనిపిస్తున్నారు. మల్లెతోటలో ముళ్ళెందుకు గుచ్చుకుంటున్నాయి?

యస్ఐ జ్యోత్స్నకు రఘు చుట్టంకాదు. స్నేహితుడు కాదు. కనీస గుర్తులేదు. అరెస్ట్ చేసేవరకు ఆమెకు అతను తెలియదు. సానుభూతి ఎందుకు?

నిజంగానే -

రఘులాంటి వారిని కఠినాతి కఠినంగా శిక్షించాల్సిందే! ఇటువంటి వారికి మరణ దండన ఒకటే శిక్షగా ఇపుడు చాలామంది భావిస్తున్నారు. జరుగుతున్న సంఘటనల మూలంగా ఇటువంటి అభిప్రాయం ప్రజలలో పెరిగింది. రేప్‌లు, మానభంగాలు పెరుగు తున్నాయి. వారిని శిక్షించాలనే అభిప్రాయం బాగా పెరిగింది. రేప్‌లు, మానభంగాలు గతంలో కూడా వుండేవి కాని బయటపడేవి తక్కువే! బయటకు రావటం ఇప్పటికీ తక్కువే! పదిశాతం కూడా బయటకు రావటంలేదు. రేప్ చేసిన వాన్ని 'చట్టం' శిక్షిస్తే శిక్షించవచ్చు. అదంతా కేసు మీద సాక్ష్యాల మీద ఆధారపడి వుంది. కానీ రేప్‌కు గురిఅయిన మహిళ 'సమాజం' చేతిలో శిక్షకు గురి అవుతుంది. ఆమెపట్ల తాత్కాలిక సానుభూతి ఇప్పుడు

పెరిగింది కానీ - తర్వాత ఆమెను కూడా గౌరవంగా చూసే సంస్కారం ఇంకా ఈ సమాజానికి అలవడలేదు. ఇంచుమించు 'వెలి'వేసినట్టుగా చూస్తారు. ఎవరికైనా పెళ్ళి చాలా ముఖ్యం. ముఖ్యంగా స్త్రీలు పెళ్ళి చేసుకోకుండా ఈ సమాజంలో బ్రతకటం కష్టమే! మానసిక భద్రత కరువవుతుంది. అదే మగవాడు ఏ తప్పులు చేసినా క్షమార్హుడే! - అవి 'తప్పు' క్రింద లెక్కకు రాదు. మగవాడు చేసే తప్పులు వాడి 'పెళ్ళికి' ఆటంకం కాదు. కానీ 'స్త్రీ' తాను తప్పుచేయకున్నా - మగవాడి దౌర్జన్యానికి 'బలి' అయినా - సమాజంలో ఆమె గౌరవహీనురాలుగా మారిపోతుంది.

ఇవన్నీ జ్యోత్స్నకు తెల్సు, ఎన్నో విషయాలు ఆమె గుండెల్లో వున్నాయి. దాక్కొని వున్నాయి. అవి బయటకు రావు. అయినా 'రేప్' చేసిన రఘును రెండు రోజులు విపరీతంగా కొట్టింది. పోలీసులు నేరస్తులను దండిస్తారు. కొట్టకూడదు కానీ - పోలీసుల సహజగుణం అది. నేరస్తులనే కాదు అనుమానితులను కూడా దండిస్తారు. ఆ దండన వారికి సహజమే. రఘు కాలేజీ అమ్మాయిని రేప్ చేసాడు కనుక యస్ఐ జ్యోత్స్న రెండు రోజులు లాకప్‌రూమ్‌లో లాఠీతో, చేతులతో విపరీతంగా కొట్టింది. పోలీసు కోపమే కాదు సహజకోపమది. ఆమె యస్ఐ కావచ్చు, స్త్రీకున్న కోపమది. అయితే రఘు నిజం ఒప్పుకోవటం, తప్పుచేసానని అంగీకరించటం, ఆ తప్పు ఏ పరిస్థితులలో చేసానో చెప్పటం యస్ఐ జ్యోత్స్నను ఆలోచనకు గురిచేసాయి.

అసలు జరిగిందేమిటీ?

రేప్‌కు గురి అయిన అమ్మాయి పేరు మౌనిక. మౌనిక, రఘు ఒకటే వూరు. నిజమేమిటంటే ఒకటే గల్లీవారు. చిన్నప్పటి నుండి కల్సి ఆడుకున్నవారు. కల్సి చదువు కున్నవారు. రఘు ధనికుని కొడుకు. మౌనిక పేదకుటుంబంలో పుట్టిన బిడ్డ. రఘు హైదరాబాద్‌లో చదువుకుంటున్నాడు. మౌనిక వాళ్ళవూరుకు రెండు కిలోమీటర్ల దూరంలో వున్న పోతారెడ్డి డిగ్రీకాలేజీలో చదువుతూ వుంది. రఘు కొన్ని రోజులుగా హైద్రాబాద్ వెళ్ళటం లేదు. వూరులోనే వున్నాడు. ధనవంతుల అలవాట్లన్నీ అతనికి వచ్చాయి. సుఖంగా గారాబంగా పెరిగిన కొడుకు. అతనికి చెడు అలవాట్లు వచ్చాయి.

రేప్ సంఘటన జరిగిననాడుసాయంకాలం ఐదుగంటల ప్రాంతంలో మౌనిక పోతారెడ్డి నుండి వాళ్ల వూరుకు నడుచుకుంటూ వస్తూ వుంది. కాలేజీ అయిపోయిన తర్వాత ప్రతిదినం వాళ్లవూరుకు బస్సు వుంటుంది. ఆ బస్సులో వస్తుంది కానీ ఆనాడు బస్సు దొరకలేదు. రెండు మైళ్లేకదా! సాయంకాలం నాల్గు ముప్పది మాత్రమే అయింది. జనం తిరిగే దారి. నడుచుకుంటూ వెళ్లవచ్చుని నడుస్తూ వుంది. సగం దూరంలోకి రాగానే రఘు హోండాపై వచ్చి ముందుకొచ్చి ఆపాడు. మౌనిక నడుస్తూ వస్తోందని రఘుకు తెలియదు. రఘు పోతారెడ్డికి ఓ డిన్నరుకు వెళ్ళి వస్తున్నాడు. మౌనికను చూచి ఆపాడు. మౌనికను "వస్తావా మౌనికా!" అన్నాడు. మాట వంకరపోతోంది. బాగా త్రాగి వున్నాడు.

"నేను రాను అంది"

"రావాఁ ?!"

"రాను" అంది కచ్చితంగా మౌనిక

ఎన్నోసార్లు రఘు బండిపై వచ్చింది. ఒకటే గల్లీలో కల్సి ఆడుకున్నారు. చదువుకున్నారు. ఆ స్వేచ్ఛ వుంది. చిన్న గ్రామం. సంపన్నుల కొడుకేగాని దుర్మార్గుడేమీ కాదు. ఎవరూ పట్టించుకోలేదు.

రఘు బాగా తెల్సిన వ్యక్తే. అయినా బాగా త్రాగి వున్నాడని రాను అనేసింది.

బాగా త్రాగి వున్న రఘు ఆ మాటకు రెచ్చిపోయాడు. త్రాగిన మైకంలో మౌనిక చాలా అందంగా కనిపిస్తూ వుంది. "చాలా అందంగా వున్నావు మౌనికా! ఎన్నోసార్లు నిన్ను చూచాను. ఇంత అందంగా ఎప్పుడూ కనిపించలేదు. ఈనాడు అందంగా వున్నావు." అంటూ త్రాగిన మైకంలో వున్న రఘు ఆమెను బలవంతాన పక్కనున్న పొదల్లోకి లాక్కెళ్లాడు. బలమైన చేతులు, గట్టిగా లాక్కెళ్ళాడు. ఏమీ చేయలేక పోయింది. అరిచింది. గోలచేసింది. అయినా విడువలేదు. పొదలచాటున ఐదు నిముషాలు... జరగాల్సిన ఘోరం జరిగిపోయింది.

మౌనిక అరుపులకు పొలాలలో వున్నవారు పరుగెత్తుకొచ్చారు. రోడ్డుప్రక్కన చుట్టూ పొద లున్నాయి. కొంచెం దూరంగా పొలాలున్నాయి. పొలాలలో పనిచేస్తున్న వారున్నారు. ఏదో అల్లరి అని పరుగెత్తుకొచ్చారు. వాళ్లు రాగానే రోడ్డుపైకి వచ్చాడు రఘు. పొదలచాటున మౌనిక దుఃఖిస్తూ వుంది. జరిగింది ప్రజలకు అర్థమై పోయింది. ప్రజలను చూచి రఘు పారిపోవాల నుకున్నాడు. పారిపోలేదు. అక్కడే నిల్చున్నాడు. తనతో తప్పు జరిగిందని అతనికి అర్థమై పోయింది. ప్రజలు రఘును నాల్గు తన్నారు. మౌనిక పొదల నుండి లేచి వచ్చింది. ప్రజలలో ఒకరు పోలీసు స్టేషన్‌కు ఫోన్‌చేశారు. ఐదు నిముషాలలో యస్ఐ జ్యోత్స్న వచ్చింది. ప్రజలముందే రఘును లాఠీతో నాల్గు వేసింది. అరెస్టుచేసి తీసుకెళ్ళింది. ఇదీ జరిగిన కథ.

* * *

యస్ఐ జ్యోత్స్న రఘుపై కొంత సానుభూతి చూపటానికి కారణముంది. అది సమర్థనీయమైన కారణం కాదు. కానీ ఆమె అనుభవం అలాంటిది. రఘు తాను చేసింది తప్పేనని ఒప్పుకుంటున్నాడు. ఆ తప్పును తాను త్రాగిన మత్తులో చేసానని అంటున్నాడు. త్రాగిన మత్తులో చేసాననటానికి సమర్థనీయమైన ఓ కారణం చెపుతున్నాడు. ఎన్నోసార్లు మౌనికను తాను తన బండిపై తీసుకెళ్లాను. ఎప్పుడు ఏమీ చేయలేదు. ఎన్నోసార్లు తనకు ఇటువంటి తప్పు చేయటానికి అవకాశం వచ్చింది. చేయలేదు. ఈనాడు చేయటానికి 'త్రాగుడే' కారణం. త్రాగిన మత్తులో ఈ తప్పు జరిగింది. రఘు మాటలో నిజం కూడా వుంది. ఆనాడు ఒక ఫంక్షన్‌లో విపరీతంగా త్రాగాడు.

యస్ఐ జ్యోత్స్న ముందు మౌనిక కూడా కొంతమేరకు అంగీకరించింది. "రఘు అలాంటివాడేమీ కాదు. త్రాగి అలా చేసి వుండవచ్చు". అంది

యస్ఐ జ్యోత్స్న రఘును ప్రశ్నించినపుడల్లా అదే మాట అన్నాడు. "త్రాగిన మత్తులో జరిగింది. తప్పే. నన్ను శిక్షించండి!" అంటూ ఏడ్చాడు.

యస్ఐ జ్యోత్స్నకు రఘుపైన వున్న కోపమంతా మద్యపానీయాలపై పడింది. గల్లికో వైన్‌షాప్. ఎక్కడ దొరికితే అక్కడ త్రాగటానికి పర్మిట్..... వాడకో కల్లు దుకాణం. త్రాగని మగోడు లేడు. త్రాగటం షోకు అయ్యింది. జరుగుతున్న నేరాలలో సగంపైగా నేరాలకు త్రాగటమే కారణం. త్రాగిన మైకంలో నేరాలు చేస్తున్నారు. త్రాగిన మైకంలో హత్యలు చేసినవారున్నారు. యాక్సిడెంట్‌లు చేసిన వారున్నారు. ఎందరి మృతికో కారకులైన వారున్నారు.

యస్ఐ జ్యోత్స్నకు కూడా అటువంటి అనుభవాలున్నాయి. త్రాగిన మైకంలో తన బావ, అక్క మొగుడు ఒకనాడు అసభ్యంగా ప్రవర్తించి తెల్లారి "సారీ నేను త్రాగివున్నాను" అన్నాడు. డియస్‌పి మంచివాడే. ఒకనాడు ఒక డిన్నర్‌లో బాగా త్రాగి తనపట్ల పిచ్చిపిచ్చిగా ప్రవర్తించాడు. "సారీ మందు ఎక్కువయ్యింది,"

అన్నాడు. 'మందు'-స్త్రీల అందాన్ని వంద శాతం ఎక్కువచేసి చూపిస్తుందా? లేక సెక్స్ పైత్యాన్ని పెంచుతుందా?-జ్యోత్స్నకు అర్థం కాలేదు.

తన భర్త విషయంలో కూడా జ్యోత్స్నకు ఇటువంటి అనుభవమే వుంది. ఒక బ్యాంకు అసిస్టెంటు మేనేజరుగా వున్న తన భర్త ఒకనాడు అర్ధరాత్రి త్రాగివచ్చాడు. "ఇదేమిటీ? - అని గట్టిగా ప్రశ్నిస్తే తాను మగవాన్ని తన యిష్టం నీవు అడిగేదేమిటీ? అంటూ" చెంప చెళ్ళు మనిపించాడు.

ఇటువంటి అనుభవాలు జ్యోత్స్నకున్నాయి. అందుకే మొదట్లో రఘుపై కలిగినంత అసహ్యం ఇప్పుడు ఆమెకు లేదు. అయినా బాధ్యత బాధ్యతే. బాధ్యతల పట్ల మానసిక స్పందనలు అవసరంలేదు. రఘుపై ఫైల్ తయారుచేసి (ఎఫ్ఐఆర్) కోర్టుకు తీసుకెళ్ళింది. కోర్టు రఘును జైలుకు పంపింది.

కథ ఇంతటితో అయిపోలేదు.

* * *

మూడు నెలల తర్వాత రఘుకు బెయిల్ దొరికింది. బెయిల్‌కు కారణాలు ఏమైనా కావచ్చు బెయిల్ దొరికింది. జైలు నుండి బయటకు రాగానే రఘు ఎదురుగా చౌరస్తాలో కనిపించిన వైన్‌షాప్‌పై దాడిచేసాడు. వైన్‌షాప్‌లో వున్న సీసాలు తీసి పగులగొట్టాడు. ఒక విస్కీసీసా తెరిచి అందులో వున్న విస్కీ పోసి అగ్గిపుల్ల గీసాడు. వైన్ షాప్ పూర్తిగా అంటుకుంది. అందరూ బయటకు వచ్చారు. తన తప్పుకు, తన జైలుకు వైన్‌షాపే కారణమని బీరులు, విస్కీలు కారణమని రఘు కోపం... ఆయన కోపం చల్లారింది కానీ..... షాప్ వారు పోలీసులను పిలిపించారు. యస్ఐ జ్యోత్స్న స్వయంగా వచ్చింది. లోలోపల నవ్వుకుంది. అరెస్ట్ చేయక తప్పదుగా... కేసు ఫైల్ చేయక తప్పదుగా...

మళ్లీ జైలు కెళ్లాడు రఘు. అయితే సంతృప్తిగా తప్పుచేయలేదనే భావనతో

జ్యోత్స్న మనసు కూడా రఘును నేరస్తుడిగా భావించటంలేదు. ✤

కవిత

# నేను! ముజఫర్ నగర్‌ను!

- భండారు విజయ

మేము ముజఫర్‌నగర్ అల్లర్ల
బాధితులం మాట్లాడుతున్నాం
ఎవరో! ఆకతాయిలు చేసిన
అఘాయిత్యాలను చూసి
శాడిస్టుల్లా మతి భ్రమించి
బరితెగించిన మానవమృగాళ్ళే
మమ్మల్ని హరించి
మా జీవితాలను శిథిలం చేసి
మా గమనాలను నిరోధించి
మమ్మల్ని భయభ్రాంతులను చేసే
హక్కు! మీ కెవరిచ్చారు?
దళితులమైనంత మాత్రాన
మైనారిటీలుగా ఉన్నంతమాత్రాన
తరతరాల మీ ఆధిపత్యాలకు
ఎన్నాళ్ళని ఊడిగం చేస్తాము?
మా ఇళ్ళను లూటీచేసి
మా పిల్లల్ని హింసించి
మా యువతుల్ని చెరిచేసి
బాలింతలని కూడా చూడకుండా
కర్రలతో, రాళ్ళతో మోదారు
మా భర్తలను సజీవదహనం చేసారు
ఎదురుతిరిగినందుకు
పోలీసుల లాఠీలు ఝళిపించారు
మా పిల్లల ఆచూకీ తెలియక
ఆడపడుచుల ఆనవాళ్ళు దొరకక
మోము రోదిస్తుంటే!
మదమెక్కిన ఆంబోతుల్లా
మా మానాలను కబళించారు
పారిపోతున్న వారిని ఒడిసిపట్టి
మూత్రాలను తాగించారు
ఒక కర్కోటకుడు
మా బిడ్డల పాలిండ్లను కోసేస్తే
మరో రాక్షసుడు
రంపంతో మా భర్తలను ముక్కలు చేసారు
ప్రాణభయంతో పరుగులు తీయించి
కాళ్ళు, చేతులు విరిచేసారు
పాలుగారే పసివాళ్ళను సైతం
చెక్కపెట్టెల్లోకుక్కి ప్రాణాలను హరించేసారు
మమ్ము దోచుకున్నది చాలక
మా ఇళ్ళకు అగ్గిని రగిలించి
మమ్మనాథలుగా మార్చేసారు
మా పిల్లల భవిష్యత్తును
కర్కశంగా కాలరాజేసారు
మళ్ళీ మళ్ళీ మతాలను అడ్డుబెట్టి
మారణహోమాలు ఎన్నని! సృష్టిస్తారు?
కట్టుబాట్లను సృష్టించి
సనాతన ధర్మాల పేర
ఎన్నని అధర్మ ప్రయోగాలు చేస్తారు?
ఎవరో తుంటరిచేసిన తప్పుకు
ఎవరో అనామకుని దుశ్చర్యకు
అగ్నికి ఆజ్యంపోస్తూ... ఎంతమంది
అమాయకులను బలితీస్తారు?
ఆకాశంలో సగమైన మేము
వేలకోట్ల తరాలుగా
ఉనికిని కోల్పోతున్న అభాగ్యులం...
ఒక ఉన్మాది రగిల్చిన
మారణహోమంలో
మేమెందుకు బలిపశువులుగా మారాలి?
కటకటాల్లోని ఉగ్రవాదులకు
వేలకోట్ల రూపాయలతో
రక్షణ కవచాలను సమర్పిస్తారే!
మానవబాంబులకు సైతం
రాచమర్యాదలుచేసి ఆదరిస్తారే!
ధన, మాన, ప్రాణాలను దోచేస్తే
బ్రతికున్న శవాలమై ఉన్న ఊళ్ళు వదిలేసి
పారిపోయి మేం వస్తే
ఆదరించవల్సిన ప్రభుత్వాలు
మొక్కుబడుల సాయాలతో
చేతులు దులిపేసుకుంటున్నారు.
దళారుల అండదండలతో
కోట్లరూపాయలను మింగేస్తున్నారు.
వాటాల పొత్తులో వాదులాడుతూ
రాజకీయ లబ్ధికై రాగాలాలపిస్తున్నారు.
చదువులు వదిలేసిన పిల్లలు
గాలివాటానికి తిరుగుతుంటే
జీవనం అగమ్యగోచరమౌతోంది
మొక్కుబడిగా విదిలించిన
వసతుల్లేని గుడారాల్లో
చలికి, వానకు ఒణుకుతూ
బ్రతికున్న శవాలమై
శ్మశాన వైరాగ్యాలతో
ప్రాణాలను అరచేతిలో పెట్టుకొని
మిగిలిన మానాలను రక్షించుకొంటున్నాము
గుజరాత్ ఐనా... ముజఫర్ నగర్ ఐనా...
కారంచేడు అయినా... చుండూరు అయినా...
ప్రతి యుద్ధంలో గాయాల గురి... మగువలే!!
ప్రతి శవము అత్యాచార బాధితురాలే!
పితృస్వామ్య దౌర్జన్యంలో...
పురుష అహంకార దౌష్ట్యంలో...
మతఛాందస విశ్వాసాల్లో
ఎన్నిసార్లని మరణిస్తాం?
ఎన్నేళ్ళని భరిస్తాం.
అందుకే! మెదడ్లకు పదునుపెట్టి
పిడికిలెత్తి నినదిస్తున్నాం!
ఆధిపత్య పునాదులను
మొదలంటా నరికేస్తాం!
మరణించిన శవాల సాక్షిగా...
మళ్ళీ ! మళ్ళీ ! జన్మిస్తూనే... ఉంటాం ! ✤



# సాధికారత - సవాళ్ళు - చైతన్యం

వి. ప్రతిమ

**నూతన** ఆర్థిక విధానాల అమలు మూలంగా మార్కెట్ మన జీవితాల్లోకి తోసుకొచ్చి ప్రాంతాల మధ్య, వ్యక్తుల మధ్య ఎట్లా అసమ సంబంధాలను ఏర్పరుస్తుందో... ఎట్లా మనుషుల్ని చైతన్యవంతమైన ఆలోచనల నుండీ, ఉద్యమ రూపాల నుండీ ప్రక్కకి జరిపేసిందో మనందరికీ తెలుసు... ఆ క్రమంలో ఈ మొత్తం సునామీ తాకిడిని, ప్రకంపనలను తట్టుకుని, ఆ ప్రలోభాలకు లొంగకుండా... అది సృష్టిస్తోన్న ప్రళయాన్ని ప్రేక్షకులుగా ఒడ్డున నిలబడి చూస్తూ, విశ్లేషిస్తూ ఆ ప్రమాదానికి దూరంగా వుండమని మనుషులను హెచ్చరిస్తున్న ద్వయం. జ్యోతిరాణి, కాత్యాయనీ విద్మహేలు.

ఆర్థికశాస్త్రవేత్త జ్యోతిరాణి, సాహిత్య జీవన విమర్శకురాలు కాత్యాయని విద్మహే... వారి అధ్యయన విషయాలు సామాజిక, సాహిత్యరంగాలు..అందునా ప్రధానంగా స్త్రీ జనాభ్యుదయపు అధ్యయనం, కార్యాచరణ వారి ముఖ్యోద్దేశం. మహిళా సమస్యల పరిష్కారం కోసం 1982లో వారు ఏర్పరచుకొన్న స్త్రీ – జనాభ్యుదయ అధ్యయన సంస్థ ద్వారా వారు ప్రచురిస్తూ వచ్చిన పుస్తకాలలో "మహిళా సాధికారత – సవాళ్ళు"... సమాజ సాహిత్య స్వభావాలు" అన్నది వారి పన్నెండవ పుస్తకం... ఇవన్నీ కూడా ప్రధానంగా మహిళా జీవితాల అధ్యయనానికి సంబంధించినవే కావడం విశేషం.

వీరిరువురూ కలసి లెక్కలకందని జీవితాలని సాహిత్య వైవిధ్యంతో ఎట్లా విశ్లేషించుకోవచ్చో ఋజువుచేస్తూండిన వ్యాసాలివి... ఇందులో మొత్తం తొమ్మిది వ్యాసాలున్నాయి....

ఇటీవల 'మహిళాసాధికారిత' అన్న పదాన్ని మనం తరచుగా వింటున్నాం...ఈ సమాజంలో సగభాగమైన స్త్రీలు అన్ని రకాల అవకాశాలతోనూ,' అన్ని రకాల అధికారాలతోనూ, అన్ని సౌకర్యాలతోనూ సగభాగం పంచుకోగలిగేటువంటి ఉన్నతమైన ప్రజాస్వామికమైన ఒక గొప్ప సమాజం కోసం కలకంటూ రూపొందించినటువంటి ఆలోచనే మహిళాసాధికారిత.

సాధికారిత అనగానే మనం మహిళలకి రాజ్యాధికారం వుండడం స్థానిక సంస్థల్లో మహిళలకి ప్రాతినిధ్యం, భాగస్వామ్యం కల్పించడం అన్న మామూలు అర్థంలో మాత్రమే వాడుతూ వుంటాం... నిజానికి స్త్రీలకు విద్య, ఆరోగ్యం, పౌష్టికాహారం, త్రాగునీరు, పారిశుధ్యం, వసతి, పర్యావరణం, శాస్త్ర సాంకేతికరంగాలలో అన్నిరకాల అవకాశాలు లభించడం, హింసలేనటువంటి సమాజాన్ని స్త్రీలకు కల్పించడం వీటిని మహిళా సాధికారితగా మహిళా జాతీయ విధానం పేర్కొన్నది...

'మహిళాసాధికారిత' అన్న పదం చాలా అసందర్భంగా, అయాచితంగా, అనవసరంగా, అవలీలగా ప్రస్తావించబడుతోంది. అయితే ఈ యిరువురు మహిళా అధ్యయనవేత్తలు ఏమంటారంటే

'మహిళాసాధికారిత అన్నది ఒక మంత్రం కాదు వూరికే జపిస్తూ కూర్చోడానికి – పితృస్వామిక వ్యవస్థలతో, భావజాలంతో, ప్రవృత్తులతో నిత్యం, నిరంతరం చేయవలసిన యుద్ధం గురించిన అవగాహన, చిత్తశుద్ధి ఎంతో కావాలి దీనిని ఆచరణలో వాస్తవం చేయడానికి... మహిళా సాధికారితను జీవన వాస్తవంగా పరివర్తింపచేసుకోడానికి ఎన్ని అవరోధాలను అధిగమించవలసి వుందో తెలుసుకోవటం అవసరం' అని

ఆ క్రమంలో మహిళా సాధికారితకు సంబంధించిన శాస్త్రీయ అవగాహనను కలగజేస్తుందీ పుస్తకం.

స్త్రీల మీద రోజురోజుకీ పెరుగుతున్న అత్యాచారాలు, ప్రేమ పేరుమీద జరుగుతోన్న హింసాత్మక దాడులు, స్త్రీలు ఆత్మగౌరవంతో తలెత్తుకుని జీవించే హక్కుని నిరాకరిస్తున్నపుడు మహిళా సాధికారిత సాధ్యమేనా?

స్త్రీలు ఏ రంగంలోనయినా కాస్త చురుగ్గా, చొరవగా కనిపిస్తే వారిని నిరుత్సాహపరిచే, వెనక్కి లాగేటువంటి ఒక దుష్ట సంప్రదాయం మనచుట్టూ వ్యాపించి వుంది... పనిచేసే చోట్ల స్త్రీలపై లైంగిక వేధింపులు ఆ సంస్కృతిలో భాగమే... ప్రతీ సంస్థా కూడా ఆ సంస్థలో పనిచేసేటటువంటి మహిళల కోసం మహిళా నాయకత్వంలో నిష్పాక్షికమైన విచారణ చేయగల ఒక కమిటీని వేయాలని సుప్రీంకోర్టు ఈ లైంగిక వేధింపులను విచారించే దిశలో మార్గదర్శక సూత్రాలను రూపొందించింది.

అయితే ఆ సూత్రాలను సంస్థలు ఎంతవరకూ పాటించాయి? దేశం మొత్తంమీద ఎన్ని కమిటీలు వున్నాయి? అవి ఏరకంగా పనిచేస్తున్నాయి? స్త్రీలకు ఎంతవరకూ నైతిక మద్దతునిస్తున్నాయి? వంటి అనేక ప్రశ్నల్ని మనముందుంచుతుందీ పుస్తకం. పనిచేసే చోట జెండర్ వివక్షను తొలగించటానికి గుణాత్మకమైన సమాన న్యాయాన్ని జీవిత విలువగా చేయడానికి ఏం చేయాలి అన్న ఆలోచనను రేకెత్తిస్తుంది... పితృస్వామిక సమాజ దృక్పథమే సమూలంగా మారాల్సిన అవసరాన్ని ఎత్తి చూపుతుంది. పురుష దృక్పథం నుండి, పురుష ప్రయోజనాల కోణం నుండి నిర్మింపబడిన వ్యవస్థలు, విలువలు అన్నీ కూడా మూలాల నుండి ప్రక్షాళన కావల్సిన అవసరాన్ని సూచిస్తుంది.

**– 2 –**

'మద్యం' మహిళాసాధికారితను ఎట్లా అవహేళన చేస్తోందో చర్చించే మరొక లోతయిన వ్యాసం వుందీ పుస్తకంలో.

ఇవాళ దేశ రాజకీయాలలో ఎన్నికలను ప్రభావితం చేసే బలమైన శక్తిగా ఎదిగిపోయిన మద్యం ఒక్క రాజకీయాలలోనే కాదు... ఒక డిసెంబరు ముప్పైయొకటి రాత్రి మాత్రమే కాదు అన్ని వ్యవస్థల్లో, అన్ని స్థాయిల్లో విధాన నిర్ణయాలన్నింటిలోనూ ప్రధానపాత్ర వహిస్తున్నది... అన్నిరకాల లాబీయింగులకూ మద్యమే వేదిక అవుతోంది... ఈవిధంగా పై స్థాయి నుండి కింది వర్గాల వరకూ అన్ని రకాల ప్రజా సమూహాలకూ మద్యాన్ని అందుబాటులోకి తెచ్చి, అలవాటు చేసిన ప్రభుత్వం ఏమీ ఎరుగని నంగనాచిలాగా మద్యం మూలంగా ఏర్పడే దుష్పరిణామాలను నియంత్రించడానికి మద్య విమోచన కమిటీని ఏర్పాటు చేసింది. ప్రభుత్వ వేలంపాటల ద్వారా లైసెన్సులు పొంది నిరాఘాటంగా మద్యం అమ్మకాన్ని సాగిస్తోన్న షాపుల గురించి కానీ వాటికి అనుబంధంగా వుండే బెల్టుషాపుల ద్వారా విచ్చలవిడిగా విక్రయించబడుతోన్న విషయాన్ని గురించి కానీ ఈ కమిటీ ప్రశ్నించదు. కేవలం గుడుంబా, కల్తీ సారా ఎంత హానికరమైనవో వాటికి వ్యతిరేకంగా ప్రజాచైతన్యం ఎలా బలపడాలో, మహిళలు ఎట్లా తిరగబడాలో, పోరాడాలో మాత్రమే ప్రధానంగా ప్రస్తావించడం కన్పిస్తుంది.

సమాజంలో 95శాతం గృహహింస మద్యం మూలంగానే జరుగుతోందని అధ్యయనాలు చెప్తున్నాయి... పితృస్వామిక కుటుంబ హింసను తీవ్రతరం చేయడంలో మద్యం ప్రధాన కారణమని గుర్తెరిగి 90వ దశకం ప్రారంభంలో స్త్రీలు ఈ మద్యానికి వ్యతిరేకంగా తీవ్రస్థాయిలో ఉద్యమించడం జరిగింది... ఈ ఉద్యమం సంధించిన ప్రశ్నలకు సరయిన సమాధానాలివ్వకుండా ప్రభుత్వం ఆదాయం పడిపోయిందనీ, ఉద్యోగులకి జీతాల్విడం కష్టమవుతుందనీ చౌకధరకు బియ్యం, సరుకులు యివ్వడం వంటి సంక్షేమ పథకాలను అమలు చేయడం సాధ్యం కాదనీ... యితరేతర సబ్సిడీలను ఉపసంహరించు కోవలసివస్తుందనీ, అన్నింటినీ మించి దొంగసారా అమ్మకాలను అదుపుచేయలేమని అనేక అభ్యంతరాలను లేవదీసింది... ఆ క్రమంలో జరిగిన అనేక అధ్యయనాలు ఎట్లా అసలు వాస్తవాలను బయటపెట్టాయో కూడా ఈ వ్యాసం మనకి తెలియచేస్తుంది. ఈ అధ్యయనాలు లేవదీసిన ప్రశ్నలు మనకు చెప్పలేనంత ఆశ్చర్యాన్ని, ఆసక్తినీ కలిగిస్తాయి.

అప్పుడు ప్రభుత్వం దిగివచ్చి తాత్కాలికంగా నిషేధం విధించి నప్పటికీ... అది అక్రమ మద్యాన్ని పెంచిందనీ... సమాచార, సాంకేతిక రంగాల అభివృద్ధికి వీలుగా విదేశీ పెట్టుబడులను ఆకర్షించాలంటే మద్యం రెవిన్యూ అవసరమనీ, నిషేధం ఎత్తివేయక తప్పదనీ అప్పటి ప్రభుత్వం ప్రకటించింది... నిషేధం ఎత్తివేసి ఒకవైపు రాష్ట్రంలో మద్యం అమ్మకాలు జరుగుతూండగా ఒకవైపు 2001ని కేంద్ర ప్రభుత్వం మహిళా సాధికారితా సంవత్సరంగా ప్రకటించింది... ఈ రెండింటికీ నడుమ గల వైరుధ్యాన్ని ఈ వ్యాసం ప్రశ్నిస్తుంది...

మద్యం మూలంగా స్త్రీ, పురుష సంబంధాలలో, కుటుంబాలలో వైరుధ్యాలు తీవ్రంగా పెరుగుతాయి... స్త్రీల మీద హింస, వావి వరుసలు లేని లైంగిక సంబంధాలు, దాడులు సమాజాన్ని అతలాకుతలం చేస్తున్నాయి. ఇది మహిళా సాధికారితా సాధనకు పెద్ద అవరోధం... కాబట్టి స్త్రీలపై హింసకు ప్రధాన కారణమైన మద్యం సమస్యను పరిష్కరించకుండా స్త్రీల సాధికారిత అసాధ్యమని ఈ వ్యాస రచయితల అభిప్రాయం... ఊరికే సాధికారితా మంత్రజపం చేసినంత మాత్రాన చింతకాయలు రాలవు. అందుకు అనుకూలమైన సామాజిక సంస్కృతిని నిర్మించడంలో ప్రభుత్వాలకు చిత్తశుద్ధితో కూడిన కృషి అవసరమని వీరి అభిప్రాయం.

**- 3 -**

ఇవాళ రాష్ట్ర విభజన ప్రస్తావన లేకుండా ఏ సంభాషణా కొనసాగడంలేదు... ఇది రాస్తున్నప్పటికి తెలంగాణా బిల్లు లోక్‌సభలో ఆమోదం పొంది రాజ్యసభలో ప్రవేశించి ఆమోదం కోసం ఎదురు చూస్తోంది. ప్రాంతీయ వెనుకబాటుతనం మహిళపై ఎటువంటి ప్రభావం చూపిస్తుంది? అన్న ఆలోచనతో ఒక పూర్తి విశ్లేషణ వుంది ఈ పుస్తకంలో.

“భౌగోళిక తెలంగాణా ఒక ఖచ్చితమైన అవసరమే... ఈ ఆకాంక్ష ప్రాంతీయ భాషకు, సంస్కృతికి, ఆచారాలకు, అలవాట్లకు ఆత్మగౌరవంతో కూడిన ఒక ప్రాముఖ్యతను సంతరించి పెడుతున్నది... కేవలం ఆర్థికాభివృద్ధి మహిళాభివృద్ధికి దారి తీస్తుందా? అటువంటి హామీ ఏదీ ప్రపంచ చరిత్రలో కన్పించడంలేదు. భారతదేశాన్నే తీసుకుంటే పంజాబ్ - హర్యానాలలోని ఆర్థికాభివృద్ధి మహిళాభివృద్ధికి వ్యతిరేకంగానే వున్నది... అదీ కేరళలో ఆర్థికాభివృద్ధి సాధారణ స్థాయిలో వున్నప్పటికీ మహిళాభివృద్ధి దృష్ట్యా దేశంలోనే ముందున్నది. దీన్నిబట్టి మహిళాభి వృద్ధి రాష్ట్ర ఆర్థికాభివృద్ధితో ముడివడి లేదు అని మనకర్థమవుతుంది...

మహిళాభివృద్ధి మహిళల పట్ల వుండవలసిన అభ్యుదయకర దృక్పథానికి సంబంధించింది కనుక అభివృద్ధి లక్ష్యంగా భౌగోళిక తెలంగాణాను కోరుతున్నప్పుడు ఆ అభివృద్ధిలో మహిళల స్థానానికి సంబంధించి స్పష్టమైన అవగాహన కలిగివుండాలని సూచిస్తూ ఈ విభజన రేఖల్లో మహిళాభివృద్ధికి సంబంధించిన, మహిళల సామాజిక హోదానుపెంచగలిగే అనేక రకాల అవగాహనతో కూడిన ప్రశ్నల్ని మన ముందుంచుతుందీ వ్యాసం... వీటిని దృష్టిలో పెట్టుకునే మహిళల ప్రగతికి ప్రత్యేక వ్యూహరచన చేయాల్సివుంది... అప్పుడే యిది సాధికారిత దిశగా మహిళల ప్రస్థానానికి దోహదపడడమే కాకుండా భౌగోళిక తెలంగాణాలో మహిళల హోదా కూడా పెరుగుతుందని వీరు సూత్రీకరించారు.

1969 ప్రత్యేక తెలంగాణా ఉద్యమాన్ని కోస్తాంధ్ర మధ్యతరగతి వర్గం ఎలా అర్థం చేసుకున్నదో చెప్తూ ‘ముసలం’ అన్న కథ రాశారు కొడవటిగంటి కుటుంబరావుగారు.. ప్రత్యేక తెలంగాణా సమస్యకు మరో కోణం వుందని చెప్పిన కథ యిది... వెనకబడిన ప్రాంతపు ఆర్థికాభివృద్ధి కోణం నుండీ, తెలంగాణా ప్రజల ప్రయోజనాల కోణం నుండీ తెలంగాణా ఉద్యమాన్ని చూడవలసిన అవసరాన్ని నొక్కి చెప్తుందీ కథ... నిజాం నిరంకుశ పాలనలో భూస్వామ్య వ్యతిరేకతతో వచ్చిన తెలంగాణ సాయుధ పోరాట నేపథ్యంలో కొ.కు. రాసిన మరో కథ “నీ కాల్ మొక్కత, నీ బాంచెని”... ఈ రెండు కథలనీ ఇప్పుడున్న రాజకీయ సందర్భంలో మరోసారి చదివి ప్రత్యేక తెలంగాణా అంశాన్ని లోతుగా అర్థం చేసుకోవలసిన అవసరముంది...

మనందరికీ తెలుసు కొ.కు. మరణించేంతవరకూ కూడా నిరంతరాయంగా అర్ధ శతాబ్ది కాలం విస్తారంగా సాహిత్య సృజన చేశారు. మధ్య తరగతి మనుషుల జీవితం ప్రధానంగా ఆయన కథావస్తువు...

ఆయన కథల్లో నుండి ఒక ముప్పయి కథలను ముఖ్యంగా మధ్య తరగతి కుటుంబసంబంధాలను వర్ణం, వర్గం, డబ్బు ఎట్లా ప్రభావితం చేస్తున్నాయో అన్న అంశంపై వెలుగులు ప్రసరించిన కథలను తీసుకుని అధ్యయనం చేసి వాటిలోని రాజకీయార్థిక సంబంధాలను సూక్ష్మంగా విశ్లేషించినటువంటి వ్యాసం కూడా ఈ పుస్తకంలో వుండడం విశేషం.

మత, వర్ణ, వర్గ, లైంగిక, ప్రాంతీయ వైరుధ్యాల మీద సకల మానవ సంబంధాలు అధికార, అధీన సంబంధాలుగా మారుతున్నవన్న అవగాహనకు సంబంధించిన మాటే ‘రాజకీయం’ కొ.కు. రాసిన ‘రాజకీయాలు’ కథని విశ్లేషిస్తూ ‘సామాజిక అవస్థాపనా సౌకర్యాలు రాజ్యం చేతుల నుండి ఎట్లా వ్యాపారవర్గాలకు బదిలీ అవుతూ సరుకుగా మారుతాయో, పన్నులకు తోడు యూజర్ ఛార్జెస్ వ్యవస్థ ప్రారంభమయ్యే ఒకానొక పరిణామాన్ని చరిత్ర గమనం నుండి 1934 నాటి కొ.కు. వూహ ఈనాడు ప్రైవేటీకరణలో భాగంగా వాస్తవం’ కావటాన్ని గురించి చెప్తారీ రచయితలు.

సమాజంలోని వ్యవస్థలకు, వ్యక్తులకు... మనిషికీ మనిషికీ మధ్య సమయాన్ని, సందర్భాన్ని, అవసరాన్ని ప్రయోజనాన్ని బట్టి ఏర్పడే వివిధరకాల సంబంధాలను సరియైన పద్ధతిలో విశ్లేషించే శాస్త్రీయ సాధనం రాజకీయార్థిక దృక్పథం. మొత్తంగా మానవ సంబంధాలను సమగ్రంగా అర్థం చేసుకోగలిగే ఒక మార్గం... ఒక తాత్విక చింతన యిది... ఈ కొలమానంలో కొ.కు. కథలను లోతుగా అధ్యయనంచేసి విశ్లేషించి, అంచనా కట్టారు. “కొ.కు. కథలు - రాజకీయార్థిక సంబంధాలు” అన్న ఈ వ్యాసం చదివితే కొత్తవాళ్ళు సరే పాత పాఠకులు కూడ వీళ్ళు అధ్యయనానికి ఎంచుకున్న ఆ ముప్పయి కథలనూ వెతికిపట్టుకుని మళ్ళీ ఒకసారి చదవాలన్న ఆసక్తికి గురవుతారు. అంత చక్కగా కొ.కు. కథలని పాఠకులకు అర్థం చేయిస్తుందీ వ్యాసం.

ఈ పుస్తకంలోని అన్ని వ్యాసాలనూ విపులంగా సమీక్షించుకోవడం సాధ్యంకాదు. కాబట్టి సాహిత్య నేపథ్యం వున్న మరో రెండు వ్యాసాలను ప్రస్తావించుకుందాం (నిజానికి ఏదీ వదలగలినవి కాదు...)

కెన్యా దేశస్థుడయిన గూగీవా థియాంగో రాసిన 'డెవిల్ ఆన్ ది క్రాస్' అన్న నవలకు తెలుగు అనువాదమే 'మట్టికాళ్ళ మహారాక్షసి' సామ్రాజ్యవాద ప్రపంచీకరణ దేశాల మధ్య, మనుషుల మధ్య అసమానతలను పెంచి సామాజిక జీవితాన్ని ప్రత్యేకించి స్త్రీల జీవితాలను, జీవన సంస్కృతిని విధ్వంసానికి గురిచేస్తోన్న నేటి సందర్భంలో 'మట్టికాళ్ళ మహారాక్షసి' అధ్యయనం ఒక తప్పనిసరి అవసరమని ఈ వ్యాసకర్తలు అభిప్రాయపడుతున్నారు.

ఈ నవలని యధాతథంగా పరిచయం చేయడానికి ముందు కెన్యా రాజకీయార్థిక నేపథ్యాన్ని చాలా సవివరంగా మనకి పరిచయం చేస్తారు వీళ్ళు... ఆ నేపథ్యంలో నుండి విశ్వవిద్యాలయ ప్రొఫెసర్‌గా వుంటూ, మార్క్సిస్టు భావజాల జాతీయవాద రచయితగా కెన్యా ప్రభుత్వ వైఖరిని వ్యతిరేకిస్తూ అక్షరాన్ని ఆయుధంగా మలుచుకున్న వారు గూగీ... ఆయన రాసిన అనేక నవలలూ, నాటకాలలో 'మట్టికాళ్ళ మహారాక్షసి' నవల 1970వ దశకపు కెన్యా రాజకీయార్థిక పరిణామాలపై ఒక విమర్శనాత్మక వ్యాఖ్యానం.......

"మొత్తం కార్మికవర్గంలో అత్యధికంగా అణచివేతకు గురయ్యేది స్త్రీలు కాబట్టి ఈ పరిస్థితికి వ్యతిరేకంగా ప్రతిఘటించే, పోరాడే సంకల్పం గల దృఢనిశ్చయమైన స్త్రీ పాత్రను నేను సృష్టిస్తాను" అని తాను జైలులో వుండగా సంకల్పం చెప్పుకున్న గూగీ, దానికి అనుగుణంగానే మౌమౌ వుద్యమకారుల వారసత్వాన్ని కొనసాగించేందుకు ఒక కల్పనా రూపంగా వరీంగాను సృష్టించాడని అంటారు...

తండ్రి, తల్లి జైలుపాలు కావడంతో బాల్యంలోనే చిన్నమ్మ పెంపకం లోకి వెళ్ళిపోయిన వరీంగా కొంత ఎదిగాక చిన్నాన్న డబ్బుకోసం ఆమెని ఒక వృద్ధుడికి అమ్మేయడంతో అతడు కల్పించిన సౌకర్యాలకు ప్రలోభపడి చదువును నిర్లక్ష్యం చేస్తుంది వరీంగా...

స్త్రీకి స్త్రీ కావడమే శాపం అయినటువంటి ఈ సమాజంలో స్త్రీలంటే ఆ ఒక్క అవయవం తప్ప మిగిలిన అవయవాలన్నీ పుట్టినప్పుడే పాతిపెట్టబడిన వాళ్ళని ఆమెకి అర్థమయిపోయింది.

ఇర్‌మొరోగ్ ప్రయాణ క్రమంలో ఆమె కలుసుకున్న వ్యక్తులు, వారితో సంభాషణలు... ఆమెకో కొత్త చూపునిస్తాయి... వ్యక్తిగత వ్యధలలో నుండి ఏర్పడిన చైతన్యాన్ని సామాజిక చైతన్యంగా పర్యవసింప చేసుకోవడానికి మార్గం ద్యోతక మవుతుంది... ఆ పరిణామమే ఆమె భవిష్యత్తు.

స్వదేశీ పెట్టుబడిదారులు విదేశీ పెట్టుబడులను ఆహ్వానిస్తూ ఏర్పాటుచేసిన సభను దెయ్యాల నిర్వహణలో జరిగే పిశాచాల విందుగా నిర్వచిస్తాడు. గూగీ... వరీంగా, వంగారీ యిద్దరు స్త్రీల చైతన్యాన్ని అభివృద్ధికరంగా మార్చిన ఇర్ మొరోగ్ సమావేశ ప్రక్రియ మొత్తం సామ్రాజ్యవాద దోపిడీ పీడనలను కీర్తించే ఒక విచ్ఛిన్నకర సంస్కృతీ దశను పరాకాష్టస్థితిలో ప్రదర్శించిన ఈ నవలను అనేక కోణాల్లో నుండి, అత్యంత లోతుగా మన కళ్ళముందు ఆవిష్కరిస్తారు ఈ పరిచయ కర్తలు...

దొంగల, బందిపోట్ల సమూహానికి నాయకుడుగా పోటీ చేయదలచుకున్న వారికి ఆ సభ యిచ్చిన నియమావళి.... సామ్రాజ్యవాద దోపిడీలోని నిస్సిగ్గుతనాన్ని బట్టబయలు చేయటానికి గూగీ అనుసరించిన వ్యంగ్య వ్యూహంలో భాగం నియమావళి... దొంగతనం, అనైతికత, వస్తు సమీకరణ కలిసి జీవన విధానాన్ని నిర్ణయించే రాజకీయార్థిక సంస్కృతిగా పర్యవసించడంపట్ల గూగీలో రగుల్కొన్న కసి యొక్క తీవ్రాభివ్యక్తి యిది...

స్త్రీలను ఉత్పత్తి రంగంనుండి దూరంచేసి పిల్లలను కనటానికో, పెంచటానికో లేక కుటుంబానికి అవతల పురుషుడి భోగలాలసతను తీర్చే కేంద్రంగానో పరిమితం చేయడం అణచివేత రాజకీయాలలో భాగమని అట్లాగే స్త్రీల జీవితాలను పాలించే, శాసించే దుష్టశక్తిగా 'సౌందర్యం' ఎట్లా రూపొంది స్త్రీలను శరీరాలుగా, సరుకులుగా మారుస్తోందో కూడా సూక్ష్మంగా వ్యంగ్యంగా ఎత్తిచూపిస్తోందీ నవలలో. టూరిస్టు హోటళ్ళు ఆధునిక వ్యభిచారానికి కర్మాగారాలని 1978లోనే గుర్తించాడు గూగీ...

వరీంగా సామ్రాజ్యవాద సౌందర్య ప్రమాణాలు సృష్టించిన భ్రమల నుండి బయటపడి తాను తానుగా వుండడమే సౌందర్యమన్న అవగాహనకు వస్తుంది... కార్మికులయినా, స్త్రీలయినా తమ శరీరాల దోపిడీకి గురికాకుండా ప్రతిఘటించాలన్న స్పృహను పొందింది. ప్రపంచమంతా దోచుకునేదీ, దోపిడీకి గురయ్యేవి అని రెండుగా విడిపోయిందని అర్థం చేసుకుంటుంది... దొంగల బందిపోట్ల వ్యవస్థను నిరసిస్తూ, నిరాకరిస్తూ సాగిన కార్మిక, కర్షక విద్యార్థి ఊరేగింపు ఆమెకు స్వస్వరూప జ్ఞానాన్ని అందిస్తుంది... ఆ విధంగా వరీంగా చైతన్యం పీడనకు గురైన స్థితినుండి పీడకుల మీద దండయాత్రా స్థాయికి ఎదుగుతుంది... ఆ విధంగా వరీంగాను పీడనపై ఎక్కుపెట్టిన ఆయుధంగా మలిచిన గూగీ సామర్థ్యాన్నీ, యింతకీ ఈ మహారాక్షసి కాళ్ళు మట్టివేననీ, వీటిని కూలదోయడానికి చిత్తశుద్ధితో ముందుకు నడవాలనీ... మొత్తంగా ఈ నవలనీ, కెన్యా దేశపు రాజకీయ చిత్రాన్ని ఈ సమీక్ష క్షుణ్ణంగా పరిచయం చేస్తుంది.

తృతీయ ప్రపంచ దేశాల మహిళా ఉద్యమాలకు పాఠ్యాంశం వంటి 'మా కథ' (దొమితల బారియోస్ జీవితం)ని గురించిన లోతయిన రాజకీయార్థిక విశ్లేషణ కూడా ఈ పుస్తకంలో వుంది. ఇది దొమితల జీవితమే అయినప్పటికీ దీనిని అక్షరరూపంలోకి తీసుకువచ్చింది మొయి మావీజర్.. 1975లో మెక్సికోలో జరిగిన అంతర్జాతీయ మహిళా సదస్సులో వీళ్ళిద్దరూ కలిశారు. దొమితిల ఉపన్యాసాలలో మాది కొంత, ఆమె స్వయంగా చెప్పినది మరికొంత, ఇతర చర్చల నుండి సేకరించినది మరికొంత కలిపి 'లెట్‌మి స్పీక్' అన్న శీర్షికలో ఈ జీవిత చరిత్రను 1976లో పూర్తిచేసినప్పటికీ 1978లో ప్రచురించారు.

లాటిన్ అమెరికా దేశమైన బొలీవియాలోని లాలాగువాలో జన్మించి పులికాయోలో తన బాల్యాన్ని గడిపి పెళ్ళితో 'సైగ్లో-20' (గని కార్మిక ఆవాసం) అన్న గ్రామం చేరుకుని గని కార్మిక వ్యవస్థతో, కార్మిక ఉద్యమాలతో ముడిపడి ఎదుగుతుంది దొమితల. పాలకులకు, ప్రజలకు మధ్య నుండే వైరుధ్యాలను రెచ్చగొట్టే పద్ధతిని గుర్తించి వ్యతిరేకించడం దొమితిలా అంతర్జాతీయ కార్మిక చైతన్యానికి గుర్తు...

సామాజికార్థిక రాజకీయ నిర్మాణాలు సంక్లిష్టంగా వుండి అసమ సంబంధాలు అస్తిత్వంలో వున్నపుడు వాటిని మార్చుకొనడానికి జరిగే రాజకీయ ఉద్యమంలో స్త్రీల భాగస్వామ్యం ఏ స్థాయిలో వుంటుందో... దాని వల్ల పెరిగే చైతన్యం స్వీయ సమస్యల అవగాహన స్త్రీలకు ఎంతవరకూ ఉపయోగపడుతుందో తెలుసుకోవడానికి ఈ స్వీయచరిత్ర తోడ్పడుతుంది.

వర్గ అసమానతలు, లింగవివక్ష పరిష్కరించబడే వరకూ సాగించ వలసిన దీర్ఘకాలిక పోరాటాలకు ఎత్తిన కాగడాగా 'మా కథ' యొక్క అవసరం యివ్వాల్టికీ వుందని వ్యాసకర్తల అభిప్రాయంతో ఏకీభవిద్దాం.

"స్త్రీలు స్వీయచరిత్రలు... లైంగిక రాజకీయాలు" అన్న వ్యాసం కూడా యిందులో వుంది... స్త్రీలు స్వీయచరిత్రలు రాయడం అవి ప్రచురించబడడం విశేషమే కదా... స్త్రీల జీవితాలలో వ్యక్తిగతమైనవిగా చెప్పబడుతూ నిర్లక్ష్యం చేయబడుతూ వున్న విషయాలకు పబ్లిక్ విషయాలుగా కొత్త గుర్తింపు గౌరవం లభించడం... ఇంట్లోగానీ, బయటగానీ, ప్రత్యక్షంగాగానీ, పరోక్షంగాగానీ స్త్రీలు చేసే పని ఉద్యమాల నిర్మాణానికి, సామాజిక అభివృద్ధికీ ఈ స్వీయచరిత్రల ద్వారా స్పష్టమయిందంటూ ఇరవయ్యో శతాబ్దపు పూర్వార్ధంలో ముగ్గురు స్త్రీలు రాసిన స్వీయచరిత్రలని పరిచయం చేశారు కాత్యాయని, జ్యోతిరాణి...

వారే చెప్పినట్లు విశ్వవిద్యాలయాలలో మహిళల సమస్యలపై, సామాజిక శాస్త్రాలలో, సాహిత్యంలో జరగవలసిన పరిశోధనలకు అవసరమైన జ్ఞాన దృక్పథాల అభివృద్ధికి ఈ పుస్తకం దోహదపడగలదు. మొత్తంగా ఈ మానవీయ, ప్రజాస్వామికమైన, మహిళాభివృద్ధి కలిగిన ఒక ఉన్నత సమాజ ఆవిష్కారానికి వారు కంటున్న 'రేపటి కల'. ఈ పుస్తకం మన చుట్టూ వున్న సమాజాన్ని లోపల నుండి అర్థం చేసుకోవడానికి రచయితలూ, కానివాళ్ళూ కూడా తప్పనిసరిగా అధ్యయనం చేయవలసినది.

**మహిళా సాధికారిత - సవాళ్ళు - సమాజ సాహిత్య స్వభావాలు**

**1/8డెమ్మీ 16+172 పుటలు. వెల : రూ. 120/- ప్రతులకు: నవోదయ బుక్‌హౌస్, ఆర్యసమాజ మందిరం ఎదురుగా, కాచిగూడ చౌరాస్తా; హైదరాబాదు.**

✤

# నిజమైన స్వాతంత్ర్యం

**- అయినాల కనకరత్నాచారి**

**గాంధీజీ** ఉవాచ
అర్ధరాత్రి ఆడపిల్ల
నడివీధిలో నిర్భయంగా సంచరించగలిగినపుడే
నిజమైన స్వాతంత్ర్యం వచ్చినట్లని
నేనంటానూ...మంత్రులు, మహామంత్రులూ పార్టీ నాయకులు
ప్రజాప్రతినిధులు ఎవరైతేనేం?
ప్రప్రముఖులంతా పట్టపగలు నడిరోడ్డులో
పోలీసు రక్షణ లేకుండా నిర్భయంగా తిరిగినపుడే
అసలు సిసలు స్వాతంత్ర్యం ✤

# మీరూ మనుషులన్పించుకోండి

**- డా॥తక్కోలు మాచిరెడ్డి**

**ఒక్క** దేవయానిని కాదు మీరు అవమానపరిచింది
భారతావని వనితలందర్నీ మీరు చేశారు నేరస్తుల్ని
యాంకీల్లారా! గుర్తుంచుకోండి
గట్టిగా చెబుతున్నా
వివస్త్రను చేసింది దేవయానిని కాదు
మీ వ్యవస్థనే నగ్నంగా ప్రదర్శించారు
దురహంకార దుర్నీతిని నిస్సిగ్గుగా బహిరంగపర్చుకున్నారు
సామ్రాజ్యవాద బ్రహ్మరాక్షసత్వాన్ని వేనోళ్ల చాటుకున్నారు
మీ స్వాతంత్ర్యానికోదండం
మీ ప్రజాస్వామ్యానికో నమస్కారం
వద్దు బాబూ వద్దు మీ పెత్తందారీతనం వద్దు
చాలించండి విలువల మాటల మూటలు
క్షమాపణ చెబితే సరిపోదు
విదేశీయుల్ని ప్రీతితో చూసే
సోవియత్ మనస్తత్వాన్ని అలవర్చుకోండి
మీరూ మనుషులని అన్పించుకోండి ✤

# నా రాయలసీమ

**- సద్దపల్లె చిదంబరరెడ్డి**

**కరువు** చితిమీద కట్టెలు చాలక
సగం కాలిన అనాథశవం నా రాయలసీమ
ఇక్కడ రైతుగా జన్మించడమంటే-
న్యాయశాస్త్రాన్ని వెక్కిరించే తీవ్రనేరం చేసి
శిక్షను తదనంతర తరానికీ బదిలీచేయడం
ఇక్కడ సేద్యం చేయడమంటే
కలల కనుపాపల్ని నిరాశల రెప్పల్తో కప్పేసి
వెర్రితనాన్ని పిచ్చిగా తలకెత్తుకొని
పీర్లగుండంలో అలావ్ అడుగేసే మూకలై
మరణాన్ని వెతుక్కొంటూ అంచులదాకా వెళ్లడం
గుడ్లన్నీ గుట్టుగా పాములు మింగేస్తే
అమాయకంగా ఆశగా ఖాళీగంపలో
పొదుగుతున్న కోడిపెట్టలవ్వడం
చిదిమేసిన దీపాలై చీకట్లో మగ్గుతూ
విటుల కసికాట్లు పడిన స్థనాలై
చీమూ నెత్తురూ కారుస్తూ
ఫ్యాక్షన్ బాంబులు తుంచేసిన వేళ్లయి
రక్తాన్ని ఓడ్చడం!!
గతమంతా తిరగేసినా-
ఆకలికి అక్కరకు రాని రతనాల మాటలేకాని
ధాన్యరాసుల ఊసులు ఏ ప్రబంధంలోనూ వినిపించవు
కష్టజీవుల బ్రతుకు చిత్రం ఏ పద్యపాదంలోనూ కనిపించదు
వంశవృక్షాల పడగలు, వటవృక్షాల ఊడలు
విజ్ఞానం ప్రమిదలార్పే కాషాయం కబుర్ల డొల్లలు
ఇప్పుడిక్కడ మట్టీ మానవ ప్రేమికుల్లేరు-ఉన్నది
విధిగా ఓట్ల భుజాల్తో నాయకుల్ని మోసే బోయీలే!
ఇక్కడెక్కడా పల్లెల మూలాలూ పచ్చదనాలూ కనిపించవు
ఉన్నవన్నీ మాటేసిన పార్టీలు నరికేసిన మొక్కల గంధం చెక్కలై
ఎక్కడికైనా వెళ్లడానికి సిద్ధపడే చితికిన ముక్కలు!!
అబ్బినట్లని. ✤



# ఢసాల్ ఝులక్‌లు

- మచ్చ ప్రభాకర్

**"సర్వసామాన్య** మనుషుల నుంచి సత్తా(అధికారం) సంపద, ప్రతిష్ఠలను, వంచింపచేసి అణిచివేసే దోపిడీ వ్యవస్థను డైనమైట్లతో పేల్చగలిగే సమస్త చిన్న, పెద్ద ఉద్యమాలకు, దృక్పథాలకు" నా ఈ **గోల్‌పీఠా** తొలి కవితా సంకలనం అంకితం అంటూ కలం ఆయుధంగా మలచి, సమగ్ర సామాజికన్యాయ ఉద్యమయోధుడిగా, మిలిటెంట్ నాయకుడిగా ఎదిగిన తొలి మరాఠీ రెబెల్ కవి, రచయిత నామ్‌దేవ్ ఢసాల్.

రక్తంలో మండే లెక్కలేని సూర్యుల్లారా! ఇంకెంతకాలం భరించేది ఈ ఘోర "నాకా బందీ", చచ్చేవరకు యుద్ధ ఖైదీనై గడపాలా? అని ధిక్కరిస్తూ

"చీకట్లో సూర్యుని చూసినవెంటనే
శబ్దాలు హుంకరించాయి!
మీ పాపాల చిట్టాను బయటపెట్టుటకు
శబ్దాలు గొంతెత్తుతున్నాయి
చీకట్లో సూర్యుని చూసామని"
రాబోయే వెలుతురు సూర్యుళ్ళను ఆహ్వానించిన కవి ఢసాల్
సూర్యుని దిక్కు వీపు తిప్పేసి (పరిస్థితుల ప్రభావం వలన)
"వారు వందల ప్రమాణాలు చేశారు
ఇప్పుడు! చీకటి యాత్రికులు కావడం మానేసి
సూర్యక్రాంతి పువ్వుల వలె
సూర్యోన్ముఖులు అయి తీరాల్సిందే"నని
హుకూం జారీచేసే సత్తావున్న కవి ఢసాల్.
"ఈ ప్రపంచం నీ శ్రమపై నడుస్తున్నది
ఎంత ఎంతెంత ధారపోసావురా నీ రక్తం నీళ్ళని
నేను నిన్నే సృజన నిర్మాతగా నమ్ముతాను

మిగిలిన వారి లెక్కలు ఇంకెందుకు?" అంటూ కార్మిక మిత్రుని సంబోధిస్తూ 'నా కవితకు ప్రాణం నీవే'నంటాడు. 1972లో మిలిటెంట్ దళిత పాంథర్స్ ఉద్యమం నిర్మించి నిజంగానే ఆయన సాహితీకలం ఉద్యమ నాయకుడిగా తీర్చిదిద్ది డైనమైట్లు పేల్చింది. అంతటి గొప్ప కవి 2014 జనవరి 15న ముంబైలో క్యాన్సర్ వ్యాధితో నిర్యాణం చెందడం సాహితీలోకానికి తీరని లోటు.

ఢసాల్ పూనే జిల్లాలో జన్మించినా, తన బాల్య, యవ్వన దశ మొత్తం ముంబైలోని "రెడ్‌లైట్ ఏరియా"లో గడపడం ఒళ్ళు జలదరించే అంశం, ప్రపంచ సాహిత్యంలో అలాంటి ప్రాంతాల నుంచి ఎదిగి ఆ ప్రాంత జీవన మనుగడలు లోతుగా తన స్వీయ అనుభవాలతో ప్రపంచానికి" 'గోల్‌పీఠా' పేరు పైన కవితా సంగ్రహం తేవడం ఊహకందని అంశం. చుట్టూ స్మగ్లర్లు, పిక్‌పాకెటర్లు, బ్రోకర్లు, జూదగాళ్ళు, జల్సారాయుళ్ళు, గూండాలు, పోలీసులు - వారి మధ్య నరకకూపాల్లో బ్రతికే వొళ్ళమ్ముకొనే స్త్రీల వాతావరణం. ఆ ప్రాంతం పేరే "గోల్‌పీఠా". ఆ పేరునే తన తొలి కవితాసంపుటికి నామకరణం చేసి ఒకేమారు మరాఠీ సాహితీపీఠంలో అత్యున్నత శిఖరాగ్రాలను చేరడం అనూహ్యం. అంతేకాకుండా అంతకు పూర్వమున్న సంప్రదాయ మరాఠీ సాహితీవేత్తలకు, సారస్వత శిఖామణులకు అర్థంకాలేని శబ్ద ప్రయోగం చేసి చివరికి ఢసాల్ వ్రాసిన కవితల శబ్దాలపై అర్థాలు తెలియలేక ప్రత్యేక "శబ్దకోశం" ఏర్పాటు చేయాల్సిన పరిస్థితి తలఎత్తిందంటే ఆయన ఎంతటి ప్రతిభావంత ప్రజాసాహితీపరుడో అర్థం చేసుకోవచ్చు.

తొలుత సామ్యవాద, కమ్యూనిస్టు భావజాల సహచరుల పరిచయంతోనే కలం చేతపట్టి ముందుకెళ్లడం వలన కమ్యూనిస్టు ఉద్యమాల్లో ప్రత్యేకించి మిల్లు కార్మికుల పోరాటాల్లో క్రియాశీల పాత్ర పోషించే ఉద్యమకారులతో పరిచయం వలన ఆ వర్గానికి చెందిన - ప్రముఖ ప్రజాకవి, వాగ్గేయకారుడు అమర్ షేక్, ముస్లిం. ఆయన భార్య బ్రాహ్మణ స్త్రీ. వీరికి పుట్టిన కూతురు - మల్లికతో ఢసాల్ వివాహం ఒక అపూర్వ ఘట్టంగా భావించవచ్చు. తన తొలి కవితా సంపుటితోనే పలు అవార్డులతో, జాతీయంగా గుర్తింపు రావడంతో పీడిత తాడిత ప్రజలకు ప్రత్యేకించి కార్మికులకు, అణచబడ్డ అట్టడుగునున్న కులవర్గాలవారికి అందులో సాహితీపరులకు, సామాజికంగా సమగ్ర మార్పుకోరే ఉద్యమకారులకు ఢసాల్ ఒక ఆశాకిరణంగా వెలిశారు. అప్పటికే డా॥ బాబాసాహెబ్ అంబేద్కర్ నిర్యాణం, రిపబ్లికన్ పార్టీల చీలికలు, నిరుద్యోగం, ఆర్థిక అసమానతలు, అధిక ధరలు, సంక్షోభాలు, నిరాశ నిస్పృహ, దళిత బహుజన, శ్రామికవర్గాలు పాలకవర్గాల పాలనపై అసంతృప్తితో రగిలి ఉన్నారు. సరిగ్గా అలాంటి పరిస్థితి రాజకీయ, ఆర్థిక, సామాజిక సంక్షోభ పరిస్థితిలో క్రింది, మధ్యతరగతి సాహితీ, సామాజిక ఉద్యమకారులు కొందరు ఈ వ్యవస్థను కూకటివేళ్ళతో పీకి సమగ్రంగ మార్పుచేయాలన్న లక్ష్యంతో, తమకు అందిన దృక్పథం, భావజాలాల ప్రకారం అమెరికాలో మొదలైన "బ్లాక్ పాంథర్స్" ఉద్యమాన్ని ప్రేరణగా భావించి వారి "మ్యానిఫెస్టోను ప్రమాణాలతో" దళిత పాంథర్స్ అను సంస్థను ఢసాల్, రాజా ధాలే, జె.వి.పవార్, అరుణ్ కాంబ్లే, అర్జున్ డాంగ్లే లాంటి సాహితీ ఉద్యమకారులతో తమ మ్యానిఫెస్టోను 1970 దశకంలో రూపొందించి ఉద్యమించారు. దాని ప్రభావం ముంబై వరకే పరిమితం కాకుండా అతి కొద్దికాలంలోనే మహారాష్ట్ర వ్యాప్తంగా పీడిత, తాడిత, యువకులను, విద్యార్థులను, కళాకారులను కదిలించి ఒక బలమైన ఉద్యమశక్తిగా ఎదిగింది. బ్రాహ్మణీయ భావజాలానికి, ప్రభుత్వ వ్యవస్థపట్ల వ్యతిరేకత మిలిటెంట్ రూపంలో ఉండడంతో సహించలేని హిందుత్వ శివసేన శక్తులు బాహాటంగా ఎదురుదాడులకు దిగడంతో హింసకు ప్రతిహింసగా ఆత్మరక్షణార్థం పాంథర్స్(చిరుతపులులు) సహితం 1972 ప్రాంతంలో ప్రతిదాడి చేయక తప్పలేదు. అమరుడు భాగవత్ జాదవ్ మృతితో ఆ ఇరువర్గాల మధ్యనున్న వైషమ్యం పరాకాష్టకు చేరడంతో బొంబాయి నగరంలోని వర్లీ, పరేల్ లాంటి అనేక ప్రాంతాల్లో కొన్ని నెలలపాటు ముఖాముఖి రాళ్ళతో, యాసిడ్ సీసాలతో యుద్ధం కొనసాగింది. పాంథర్స్‌కు మద్దతు విస్తృత స్థాయిలో పెరగడంతో అప్పటి ఇందిరాగాంధీ కేంద్ర ప్రభుత్వ ఆదేశానుసారం రాష్ట్ర ప్రభుత్వం "దళిత పాంథర్స్" ఉద్యమం పార్లమెంటరీ రాజ్యాంగ ప్రజాస్వామ్య పద్ధతులను వీడి అశాంతిని కల్పిస్తుందన్ననెపంతో తమ అసలు ఉనికిని కాపాడుకోడానికి అనేక రకాలుగా విభజించి పాలించే కుట్రలు కుతంత్రాలు పన్ని లొంగదీసుకోవాలని ప్రయత్నించాయి. అవేవీ ఫలించక చివరికి అరెస్టులు, నిర్బంధాలు, వందల కేసులుపెట్టి వేధించే

పరిస్థితికి తెచ్చాయి. దానితో ఉద్యమం అతి కొద్దికాలంలోనే వెనుకంజ వేసింది. అంతేకాదు ఉద్యమకీలక నేతలైన నామ్‌దేవ్ ధసాల్ మరియు రాజా ఢాలే మధ్య విభేదాలు సృష్టించడంలో సఫలీకృతులయ్యారు. భావజాలాల మధ్య విభేదాలు తోడై వారిరువురు వేరుకావడంతో ప్రభుత్వం, పాలకవర్గాలు, హిందూత్వశక్తులు సంతోషపడినా, వారి ఎత్తుగడలు ఫలించినా క్రింది కార్యకర్తల పోరాటశక్తి ఏమాత్రం దిగజారకుండా కొంతకాలం వరకు కొనసాగి క్రమంగా క్షీణించింది. ఆ తర్వాత ధసాల్ ప్రధానమంత్రి ఇందిరా గాంధీతో కలయిక, అటు పిదప శివసేన బాల్‌ఠాక్రేతో మైత్రీ బంధం ఇలా అనేక రకాలుగా మలుపుతిరిగి ధసాల్ ఉద్యమ ప్రయాణం కొనసాగినా ఆయన సాహితీప్రస్థానం మాత్రం ఆగలేదు.

ధసాల్ వ్రాసిన అమూల్య సాహిత్యంలో ముఖ్యమైనవి "వృద్ధ మూర్ఖుడు పర్వతాల తొలగింపు", ప్రియదర్శిని, "యా సత్తేవర్ మాజా జీవ్ రమత్ నాహీ" (ఈ అధికారంపై నా జీవనం ఇష్టపడలేదు), 'నీ బొటనవ్రేలు పట్టి నేను నడుస్తున్నాను', "నేను చంపాని సూర్యుడి ఏడుగుర్రాల రథసారధిని, 'బుద్ధధమ్మ', అంబేద్కర్ ఉద్యమం(1981) 'చీకటి గతశతాబ్ది', 'హడ్‌కి హడ్‌వాలే', 'గాండూ బగీచా' (ఉద్యానవనం...) 'సర్వఖాహీ సమస్‌లే' లాంటి కవితాసంపుటులతోబాటు వందల వ్యాసాలు వ్రాశారు. ఆయన కవితలను ఇంగ్లీషులోకి దిలీప్ చిత్రే అనువదించారు.

నామ్‌దేవ్ ధసాల్‌కు 1973లో మహారాష్ట్ర ప్రభుత్వ సాహిత్య అవార్డు, ఆ తర్వాత 1974లో "గోల్‌పీఠ"కు సోవియట్‌లాంట్ నెహ్రూ అవార్డ్ లభించింది. భారత ప్రభుత్వం పద్మశ్రీ బిరుదును అందించిన పిదప 2004లో జీవన సాఫల్య పురస్కారం అందుకున్నారు.

1949 ఫిబ్రవరి 15న జన్మించిన ధసాల్ టాక్సీ డ్రైవర్‌గా ఉండి, కవిగా ఎదిగి ఉద్యమకారునిగా మారడం సాహితీవేత్తలకు, సామాజిక ఉద్యమకారులెందరికో స్ఫూర్తిదాయకం. ధసాల్ రాజకీయ జీవన గమ్యంలోని లోటుపాట్లకన్న ఆయన సాహితీ సామాజిక రంగంలో నాటిన తిరుగుబాటు భావజాలం ఎంతో గుర్తింపదగ్గది, ప్రశంసనీయం. "దళిత" శబ్దాన్ని సంకుచిత అర్ధంలో ఏనాడూ వాడకుండా విశాల పరిధిలో వాడడం ఆయన సాహితీ విశిష్టత. అంతటి గొప్ప కవి జనవరి 15న 2014లో ముంబైలోని ఒక ప్రైవేట్ ఆసుపత్రిలో క్యాన్సర్ వ్యాధితో నిర్యాణం చెందడం సాహితీ లోకానికి తీరని లోటు. ✤

---

**(20వ పేజీనుండి - సింగమనేని కథలుపై సమీక్ష)**

చివరి కథ "ఒక గతి - ఒక శ్రుతి" మన దేశంలో ఎప్పుడైనా సహజన్యాయం జరిగితే అది అదృష్టంగా భావిస్తాయి. అందువల్ల ఈ కథ నమ్మశక్యంగా ఉండదు. అలా జరగాలని అందరూ అనుకుంటారు. అనుకోకుండా బాల్యస్నేహితుడింటికి వెళ్లి, వారి అమ్మాయిని చూసి తన కొడుక్కి సంబంధం చేసుకుంటాడు. మన రాజ్యాంగంలో రాసుకున్న సోషలిజం అనేది అమలయితే ఇటువంటి సంఘటనలు మనకు సాధారణమౌతాయి. ప్రజాతంత్ర విద్య, ప్రజాతంత్ర వ్యవస్థలు ప్రజల సంస్కార స్థాయిని పెంచుతాయి. అటువంటి సంస్కారలేమి వల్లే వరకట్నంలాంటి దురాచారాలు వీర విహారం చేస్తున్నాయి. ఇది వ్యవస్థ మార్పువల్లే జరుగుతుంది.

సింగమనేని వారు ఎంచుకున్న మాధ్యమం, పరిశీలించిన తీరు, భాష, శైలి అన్ని యువ రచయితలకు ఆదర్శప్రాయం. ఈ కథలు మనల్ని వదిలిపెట్టవు. జీవితాన్ని ఎలా చూడాలో నేర్పుతాయి. ఎలా వ్యాఖ్యానించాలి, ఎలా రాయాలి.....? తెలియచేస్తాయి. మనల్ని అవి వదలవు కదిలిస్తాయి. చదివిస్తాయి. మారుస్తాయి. ఈ వ్యాసానికి ముగింపు ఆయన మాటల్లోనే. 'నిషిద్ధం' కథలో మమత చేత ఇలా అనిపిస్తారు.

"జీవిత వాస్తవికతను ప్రదర్శించే సాహిత్యం నాకు ఇష్టం. మనం నివశిస్తున్న సమాజంలోని ఘర్షణను వాటి మూలాలను వ్యాఖ్యానించే సాహిత్యమే మన పాదాల్ని భూమికి ఆనేలా చేస్తుంది. వ్యక్తిగత సంస్కారాన్ని పెంపొందించడంతో పాటు సాంఘిక సమస్యలపట్ల మన కర్తవ్యాన్ని నిర్దేశించేదే మంచి సాహిత్యం." ✤

---

### ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘ శతజయంతి (1914-2014) సందర్భంగా

## రాష్ట్రంలో స్వచ్ఛంద గ్రంథాలయాలు - 9

## 11. శ్రీ చైతన్య గ్రంథాలయం - వేములవాడ, కరీంనగర్‌జిల్లా

ఈ గ్రంథాలయం 1988 జూన్ 1న ప్రారంభమైంది. దీనిని తమ తల్లిదండ్రులు వీరగోని హనుమమ్మ, బసవయ్య గౌడ్‌ల జ్ఞాపకార్థం వీరగోని సరస్వతీ - ఆంజనేయులు గౌడ్ (విశ్రాంత ఆంగ్లోపాధ్యాయులు) స్థాపించారు.

ఈ గ్రంథాలయంలో తెలుగు, ఇంగ్లీషు, హిందీ, సంస్కృత భాషలలో దాదాపు 22వేల పుస్తకాలున్నాయి. ప్రతి నెలా 53 పత్రికలు వస్తుంటాయి. తపాలా బిళ్ళలు, దేశ, విదేశీ నాణెములు సేకరించి ప్రదర్శిస్తున్నారు.

దీనిలో రామాయణం, మహాభారతం, భాగవతము, వేదాలు, ఉపనిషత్తులు, అంబేద్కర్ రచనలు, రామకృష్ణ మఠ సాహిత్యం, గీతా ప్రెస్ ప్రచురణలు, ఏర్పేడు వ్యాసాశ్రమ ప్రచురణలు, జీవిత చరిత్రలు, శాస్త్ర విజ్ఞన గ్రంథాలు, బాలసాహిత్యమేగాక 45 రకాల భగవద్గీతలు, 22 రకాల రామాయణాలు, 200 శతకాలు, అన్నమయ్య సంకీర్తనలు, ఖురాన్, బైబిల్, బౌద్ధ, జైన, శిఖ్ఖు, రాధాస్వామి మతగ్రంథాలు వున్నాయి.

పాఠకులు గ్రంథాలయంలోనే చదువుకోవాలి. ఇంటికి తీసుకెళ్ళడానికి పుస్తకాలు ఇవ్వరు. సభ్యత్వ రుసుము ఏమీలేదు.

చిరునామా : శ్రీ చైతన్య గ్రంథాలయము

రాధాస్వామి గురుకృప, 9-1-69 రాజీవ్‌నగర్, వేములవాడ. కరీంనగర్ - 505 302. సంచారవాణి : 94902 85367



# జాతర

**- డి.ఆర్. ఇంద్ర**

**"ఎక్కడికిరా** అబ్బాయ్ భుజాన సంచీతో పిల్లిలా జారుకుంటున్నావ్? ఎందాకా ప్రయాణం?"

"మీ కంటబడ్డాకా ఇంకా ప్రయాణం ఎక్కడిది? మహాఘనత వహించిన మన ఏలినవారు వందకోట్ల రూపాయలు ఖర్చుపెట్టి ఆసియా ఖండంలోనే అతిపెద్దదైన ఆదివాసీ జాతర భూనభోంతరాలు దద్దరిల్లేలా స్టేట్ ఫెస్టివల్‌గా ప్రకటించిమరీ అతి భారీగా అట్టహాసంగా నిర్వహిస్తోంది కదా. ఆ వింతలూ విడ్డూరాలూ ఓసారి చూసొస్తే ఓ పనైపోతుందిగదా అని బయల్దేరా. పిల్లిశకునంలా మీరెదురయ్యారు. ఇంకెక్కడ జాతర? నన్ను పాతరేసిగానీ వొదలరుగదా. విప్పండి మీ పురాణం!"

"ఓ మాట చెప్పరా అబ్బాయ్. నువ్వు ఆదివాసీవా? కావుగదా. వాళ్ళేదో వాళ్ళ జాతర చేసుకుంటోంటే నీకేవిటి సంబంధం? పిలవని పేరంటానికి బయల్దేరావ్. ఆ మధ్య నువ్వు ధర్మసంస్థాపన, లోక సంరక్షణార్థం అంటూ అతిరుద్రయాగం చేసావ్. నీ యాగంలో లోక సంరక్షణ ఎలా జరుగుతుందో చూద్దావని జనాలు బాగానే విరగబడ్డారు. నీ పెట్టుబడిపోనూ యాభైరెట్లు బాగానే గిట్టుబడి అయిందనుకుంటాను?"

"అంత సీన్ లేదు బాబాయ్. కాస్త వెనకదన్నుగా నిలబడినందుకు లోకల్ పెద్దలకీ, పోలీసు, రెవిన్యూ వాళ్ళకీ, ఏజంట్లకీ ఇవ్వాల్సిందిపోను పదిరెట్లేగా మిగిలింది. ఐనా ఇపుడాసంగతెందుకు బాబాయ్?"

"ఆదివాసీల జాతర నీ వ్యాపారయాగం లాంటిది కాదు. డబ్బు పోగేసుకోడానికి చేసేదికాదు. నాగరిక దుర్గంధానికి దూరంగా, వాళ్ళ అనాది సంస్కృతీ సంప్రదాయాలకి అనుగుణంగా మైమరచి ఆనందంగా జరుపుకునే వాళ్ళ జాతర సంబరాల్లో సమస్త నీచత్వాల్లో అంటకాగే మీకేం పనిరా అబ్బిగా అనడుగుతున్నా. స్త్రీలను వనదేవతలుగా పూజించి గౌరవించే ప్రాచీన మాతృదేవతారాధనకి సంబంధించిన సంస్కృతి వాళ్ళది. మీదో - స్త్రీని అంగడివస్తువుగా, వ్యాపారానికి మోడల్ వస్తువుగా, అత్యాచారానికి వినోద వస్తువుగా చూసే ఆధునిక అనాగరిక సమాజం. మీలాటివాళ్ళు స్వచ్ఛమైన అడవిబిడ్డల జాతరలో దూరి దాన్ని కంపుచేయడానికి మీకేం హక్కుందిరా?"

"ఇది చాలా దారుణమైన ఆరోపణ బాబాయ్! ఆదివాసీలు అన్ని విధాలుగా వెనకబడివున్నారు. వాళ్ళని మన ప్రధాన జీవన స్రవంతిలోకి తీసుకురావడానికే ప్రభుత్వం ఎన్నెన్ని కోట్లతో ఈ జాతర నిర్వహిస్తోంది."

"ఈ ప్రభుత్వాలు ఆదివాసీల పట్ల చూపించే ప్రేమ ధృతరాష్ట్ర కౌగిలిలాటిదిరా అబ్బాయ్. అంటే తెల్సుగా. పైకి ప్రేమనటిస్తూ ఆలింగనం చేసుకున్నట్టు నటిస్తూ నుగ్గుచేసి ప్రాణాలుతీయడమే ధృతరాష్ట్ర ప్రేమ. దేశ వనరుల్ని మదించిన ఏనుగుల్లాటి బహుళజాతి కంపెనీలకి చెరుగ్గడల్లా అందించడానికి, తద్వారా వాళ్ళు విదిలించే ఎంగిలి మెతుకులకోసం సహజవనరులకి పెట్టని కాపలాగా వుండే ఆదివాసీలపై విరుచుకుపడి, అడ్డొస్తే సంహరిస్తూ, అత్యాచారాలు చేస్తూ నిర్బంధిస్తూ, ఆదివాసీలు అసలీదేశపౌరులే కానట్టు, శత్రువులతో వ్యవహరిస్తున్నట్టు ఆదివాసీలపై దోపిడీకి పాల్పడని ప్రభుత్వాలీదేశంలో వున్నాయా? ఆ ప్రభుత్వాలే ఇపుడు కోట్లరూపాయలు వెచ్చించి ఆదివాసీల మీద ప్రేమకారిపోతున్నట్టు దగ్గరుండిమరీ జాతర్లు జరిపించడం వెనకదాగి వున్న కుట్ర ఏమిటంటావురా అబ్బిగా. ఆదివాసీల ప్రత్యేక జీవన విధానాల్నీ, సంస్కృతినీ, ఆచార వ్యవహారాల్నీ, వారి వ్యక్తిత్వాన్ని భ్రష్టు పట్టించి, వాళ్ళ పోరాట పటిమను నీరుగార్చి, వెన్నెముకలేనివాళ్ళుగా తయారుచేయడానికి, మొత్తం ఆదివాసీలను హిందూకరించడానికీ, వారిదైన సమష్టి సంస్కృతికి విరుద్ధమైన వికారమైన పరాయీకరణకు గురిచెయ్యడమే ఏలినవారి లక్ష్యం.

జాతర పేరుచెప్పి, ఏర్పాట్లు, రోడ్లు, సౌకర్యాల పేరు చెప్పి దళారీలు, కంట్రాక్టర్లు, అధికార్లు ఎలా కోట్లు పంచుకుతింటారో చూడు! కోటిమందికిపైగా జనాల్ని ఆకర్షించి రప్పించి పచ్చని పరిశుభ్రమైన అడవిని దుర్గంధంతో, వేల టన్నుల చెత్తతో, గాజులు, పెంకులు, వ్యర్థ పదార్థాల కుప్పల్తో ఎంత వినాశనం చేస్తారో చూడు! పర్యావరణానికెంత విపత్తు! ఆదివాసీలు గుట్టుగా వాళ్ళు మాత్రమే జరుపుకునే జాతరకి మంత్రులు, ప్రజాప్రతినిధులు, అధికారులు వారి వందలాది అనుచరుల్తో ఊరేగడం దేనికి? వాళ్ళ సెక్యూరిటీ కోసం అంటూ అసలైన ఆదివాసీలను పక్కకు లాగెయ్యడం ఏమిటిరా అబ్బాయ్? ఆదివాసీ భక్తులు గాయపడటం, సొమ్మసిల్లిపోవడం! వాళ్ళ జాతర వాళ్ళు ప్రశాంతంగా జరుపుకోనివ్వకుండా ఇలా హైజాక్ చేసే అధికారం ప్రభుత్వానికెవరిచ్చార్రా అబ్బాయ్?

కొన్నాళ్ళ క్రితం ఆదివాసీ స్త్రీలపై ఏ పోలీసులు, బెటాలియన్లూ కర్కశత్వంగా వారి గుడారాల్లో దూరి అత్యాచారాలు చేసి వాళ్ళ బతుకుల్ని బుగ్గిచేశారో ఆ పోలీసులే ఇపుడు ఆ ఆదివాసీ వనదేవతల గౌరవార్థం గాలిలోకి కాల్పులు జరిపి వందనం చేయడం... ఎంత వెటకారంరా అబ్బిగా!

నిన్న జాతర ఉత్సవాలు చూస్తూ పడుకుంటే తెల్లారకట్ట ఓ కలవొచ్చిందిరా అబ్బాయ్! అదేవిటో తెల్సా?

అమెరికా ఖండంలోని అమాయక ఆదివాసీల్ని ఐరోపీయ తెల్లతోలు గాళ్ళు తుపాకుల్తో కాల్చి చంపీ, సామూహిక హత్యలు, అత్యాచారాలు చేసి, వాళ్ళ ప్రాంతాల్ని హస్తగతం చేసుకున్న నవ నాగరీకులు - వాళ్ళూ, ఆస్ట్రేలియాలోనూ అదే చేసి ఆస్ట్రేలియా ఆదివాసీలను అంతమొందించిన గొప్ప సంస్కృతీపరులూ, నల్లతోలైనా తెల్లతోలువాళ్ళకి తీసిపోని క్రూరత్వంతో అడవిబిడ్డల్ని పొట్టన పెట్టుకుంటున్న మన ఏలినవారూ అందరూ కూడా మన ఆదివాసీ మహాజాతరకి వొచ్చారు-అంటే వాళ్ళ తలకాయలు మాత్రమే వచ్చాయ్. ఎలా గంటావా? జాతరకొచ్చే ఆదివాసీ స్త్రీలు మొక్కులు తీర్చుకోడానికి పెద్ద పెద్ద బెల్లం దిమ్మల్ని నెత్తిన పెట్టుకొస్తారే-అలా బెల్లం దిమ్మలకి బదులు ఖండించబడిన ఈ నాగరీక నాయకుల తలల్ని మోసుకొచ్చి తమ వనదేవతలకి నైవేద్యం పెడుతున్నట్టు కలొచ్చిందిరా అబ్బిగా!"

"తె... తె.... తె.....ల్లారగట్టొచ్చిన కలలు నిజమవుతాయంటారు... అంటే కొంపదీసి...?"

"అలా జరిగితే అంతకన్నా కావల్సిందేవుందిరా. పచ్చని భూదేవికి సరైన నైవేద్యం పెట్టినట్లవుతుంది..... వూ, వెళ్ళిరా. బయల్దేరేవాడ్ని ఆపడమెందుకు?"

"ఇంకేం జాతర! జాతర్లని ఉప్పుపాతరేస్తావ్! వస్తా, మరో అతిరుద్రయాగానికి ప్లాన్ చేస్కోవాలి." ✤

# సంస్కారాన్ని పెంచే సింగమనేని కథలు "నీకు నాకు మధ్య నిశీధి"

శ్రీశైలం మాకాన్నాం

**ప్రజలను** నిశితంగా పరిశీలించగలిగే శక్తి, వారిని అర్థం చేసుకుని, వారి ప్రవర్తనలోని భౌతిక వాస్తవికతను మనకు తెలియజేయ గలిగిన రచయిత సింగమనేని నారాయణ. వారి అపారమైన అనుభవానికి, పరిశీలనాశక్తికి మార్క్సిస్టు దృక్పథం తోడవడంతో వారి కలం నుండి జారిన ముత్యాలు ఈ కథలు. ఈ కథలు చదివిన తర్వాత మనం ప్రశాంతంగా ఉండలేం. సమాజంలో కదలిక లేకుండా నిలువ నీటి గుంటల్లా జీవితాన్ని గడిపేస్తున్న వారికి కూడా కుదుపునిస్తాయి. మార్క్సిస్టు దృక్పథంతో కథలు రాసే వారికి వర్గస్పృహ ఉంటుంది. అందుకే ఈ కథల్లో ఎవ్వరూ ప్రతినాయకులుగా ఉండరు. పరిస్థితులు అందుకు కారణమైన సమాజము వుంటాయి. చాలా చిత్తశుద్ధితో సంపూర్ణ అవగాహనతో రాసిన కథలు ఇవి.

ఈయన కథల్లో స్త్రీలు చాలా హుందాగా, ఆత్మవిశ్వాసంతో సంస్కారవంతంగా ఉంటారు. ఈయన కథల్లో సంఘటనలు మనకు ఎదురుపడ్డవే లేదా మనం అనుభవించినవో, విన్నవో అయి ఉంటాయి. కాని పాత్రలు మనకు దొరకటం కష్టం.

ఇందులోని మొదటి కథ "నీకు నాకు మధ్య నిశీధి." ఇది మొత్తం అన్ని కథల్లోకి ఎక్కువ పేజీలున్న కథ. కాని కథనంలో ఎక్కడా ఆ స్పృహ మనకు రాదు. యువతీ, యువకుల మధ్య ఎదిగిన ప్రేమ ఎంత సహజంగా ఉంటుందో, అందువల్ల ఉద్భవించిన సమస్యల్ని అంతే పరిణతితో వారు ఆలోచించుకుని, విడిపోదామని ఆమె సూచన చేస్తుంది. అప్పటిదాకా ఆదర్శాల వేడితో కాలిపోతున్న యువకుడు వాస్తవం తెలుసుకుంటాడు. నిజానికి అతనికి చిన్నపాటి తెగింపు ఉంటే అతని అన్ని సమస్యలు సులభంగా పరిష్కారమవుతాయి. ఆ అమ్మాయికి ఆ తెగువ ఉంది. అతనికి లేదని తెల్సి అతన్ని ప్రోత్సహించకుండా ఉంటుంది. ఈ సమాజంలో ప్రేమికులుగా ఉండి విజయవంతమైన జీవితం గడపాలంటే ఎలా ఆలోచించాలో చెప్పే కథ. ప్రేమించకపోతే యాసిడ్ పొయ్యడం, ఆడవాళ్ళని శారీరక వాంఛలు తీర్చే భోగవస్తువుగా చూసి గ్యాంగ్ రేపులకు పాల్పడే యువతకు, పరిణితి చెందిన ప్రేమ అంటే ఏమిటో చెప్పిన కథ, మన చుట్టూ ఉండే పరిస్థితులు మనల్ని ఎలా ప్రభావితం చేస్తాయో కార్యకారణ సంబంధంతోసహా వివరిస్తుందీ కథ. తరువాతి కథ "వాసంత తుషారం" కొంత భిన్నమైనప్పటికీ అసహజమైన కథ మాత్రం కాదు. ఆడపిల్లలు అబ్బాయింటికి పెళ్ళి చూపులకని వెళ్లడం లోకభిన్నమే అయితే మన సమాజంలో ఆడపిల్ల పెళ్లయితే అత్తారింటికి వెళ్ళడం సహజమే అయితే, భవిష్యత్‌లో తనుండబోయే ఇంటిని, ఇంటివాళ్లను చూడాలనుకోవడం అంతే సహజం. కాని ఆడపిల్లలు పెళ్ళి చూపులకెళ్ళడం అసహజంగా చూస్తుందీ సమాజం. కానీ ఈ సమాజం రచయిత దృష్టికోణానికి అనుగుణంగా మారితే భవిష్యత్ దంపతులు అత్తిల్లు, కన్నవారిల్లు అని కాకుండా తమ ఇంటిని (హోమ్) ప్రేమాభిమానాలతో రూపుదిద్దుకునే అవకాశం వుంటుంది. అభివృద్ధికరంగా ఇందులో యువతీ, యువకులు ఆలోచించడం గొప్పకాదు. కారణం వారే చెప్పినట్లు వారు చదివిన సాహిత్యం వారికి ఆ చూపునిచ్చింది కాని పిల్లాడి తల్లిదండ్రులు అంత సంస్కారంగా పెళ్ళిచూపులకని వచ్చిన అమ్మాయిని ఆదరించడం గొప్ప. సమాజంలో ప్రస్తుతం మైనారిటీగా ఉన్న ఇటువంటి వ్యక్తులు భవిష్యత్తులో మెజారిటీగా మారగలుగుతారు.

"జవాబు" కథ మన సమాజంలో (పితృస్వామ్యం) స్త్రీల పట్ల తన దృష్టికోణాన్ని తెలియచేస్తోంది. చాలా కుటుంబాలలో తప్పొప్పులు ఎంపికలో ఆడ, మగ తేడా ఉంటుంది. కథలో ఒక్కగానొక్క కొడుకు అదీ ఇద్దరాడపిల్లల తర్వాత. అది చాలు వాడి ఆగడాల గురించి తెలుసుకోవడానికి భార్యా భర్తల మధ్య ఉండాల్సిన మానసిక బంధం పెళ్ళినాడు ముడేసింది. అలానే ఉండిపోయి రోజు రోజుకి చివికిపోయి తెగుతుంది. ఒకరి ఆధిపత్యానికి మరొకరు జంతువులా తలూపాల్సిన పరిస్థితిలో ఎవరేం చేసినా భార్యదే తప్పనే మహానుభావులు చాలామంది ఉన్నారీలోకంలో. జంతువుల బాధలు పట్టించుకోవడానికి స్వచ్ఛంద సంస్థలున్నాయి. ఇళ్ళలో నిరంతరం స్త్రీల మనసుల్ని చిదిమేసే సైకోల నుండి వారిని ఎవరు రక్షించగలరు? తన అహంకారంతో, పురుష బలంతో, ఉద్యోగం చేస్తూ పోషిస్తున్నానన్న హక్కుతో, రాబోయే తరాల్ని కూడా ఎలా నాశనం చేస్తున్నారనేది ఈ కథ.

"నిషిద్ధం" కథలో భార్యాభర్తల సంస్కారం ఒకరికి ఎక్కువ మరొకరికి తక్కువ ఉంటే అది పెళ్ళికి ముందే తెలిస్తే సంస్కారం గలిగిన వ్యక్తి ఏం చేస్తుందో చెప్పిన కథ. గొప్ప ప్రజాస్వామిక సిద్ధాంత దృక్పథం గల వ్యక్తి కథ. ఆధునికానంతరవాద ధోరణితో వస్తున్న భావజాలం గల సాహిత్యం చదవడం వల్ల కలిగే ఆలోచనలు, ఎవరి బ్రతుకు ఎలా పోతే మనకేం మన బ్రతుకు మనం బ్రతికితే చాలు అనే వ్యక్తిని, ఏ అమ్మాయి అయినా ఎలా పెళ్ళి చేసుకుంటుంది. బలవంతంగా మనపై రుద్దుతున్న వస్తువ్యామోహ వినియోగ సంస్కృతి మనల్ని ఎలా దిగజారుస్తుందో, సాటివాళ్ళను మనుషుల్లా చూడలేనితనం మనలో ఎలా పెంచుతుందో వివరిస్తుందీ కథ. డబ్బును సంపాదించే యంత్రంగా తప్ప తనని మనిషిగా చూడలేని, తన అభిరుచుల్ని దిగజారుడు సంస్కృతి కళ్ళద్దాలతో చూసే అతని సంస్కారాన్ని ఆమె నిర్ద్వంద్వంగా తిరస్కరిస్తుంది. "ఒక అసందర్భం" కథలో పెళ్ళిళ్ళు, సంప్రదాయాల రూపంలో తల్లిదండ్రులే పిల్లలపై భయంకరమైన అత్యాచారాలు జరుపుతున్న దృశ్యం చూస్తాం. భయంకరమైన సామాజిక చట్రంలోకి దిగబడినవాళ్ళు, అందులోకి రానివాళ్ళను దానిలోనికి లాగడానికి ప్రయత్నించడం అనే అంశాన్ని మార్క్సిస్ట్ దృక్పథంతో విశ్లేషించిన కథ ఇది. మనం చేసిన తప్పులే ఎదుటివాళ్లు చేస్తే సహించలేము. ఇది మానవ నైజం. తన కొడుక్కి ముక్కుపిండి కట్నం వసూలు చేసిన వ్యక్తి, కూతురి పెళ్ళిలో అవతలి వాళ్లు అలాగే ప్రవర్తిస్తే సహజం అని బాధపడతారు తప్పితే తప్పని తెలుసుకోడు. పెళ్ళంటే డబ్బు మూటల మార్పిడి తప్ప ఇద్దరి మనసులు, ఆలోచనలు కలవడంగా ఎవరూ భావించక పోవడం విడ్డూరమే. ఆడవాళ్ళని భర్తలు కదిలే వస్తువుల్లా, ఆలోచనలు లేని బండల్లా భావించడంలో కని, పెంచిన, విద్యా బుద్ధులు చెప్పించిన తల్లిదండ్రులు కూడా వుండటం పితృస్వామిక సంస్కృతికి ధనస్వామ్యం జత అవటంగా మనం అర్థం చేసుకోవచ్చు.

తరువాతి కథ "శ్రమైక జీవన..." పెట్టుబడిదారీ శ్రమని శ్రామికుల శ్రమని సున్నితంగా చర్చించింది. తిండి ఎక్కువై జీరోసైజులు, సిక్సు

ప్యాక్ బాడీలు, రన్నింగులు, రోగాలు రాకుండా యోగాలు అనేవి 90ల తరువాత ఎగువ మధ్యతరగతి, మధ్యతరగతిలో ప్రవేశించిన అంటురోగాలు, సంప్రదాయబద్ధంగా పల్లెల్లో, పట్టణాలలో యువతీ యువకులు పండగలకు పబ్బాలకు ఆటలుఆడే సంస్కృతికి కాలం చెల్లి క్రికెట్ భూతం పట్టింది. దీని వల్ల దేశవాళీ ఆటలకు కాలం చెల్లింది. 80ల తర్వాత నుండి వినిమయ సంస్కృతి దిగుమతి పెరిగి భారత దేశానికి మిస్ వరల్డ్, యూనివర్స్‌లు రావడం వల్ల కృత్రిమ సౌందర్య కాంక్ష పెరిగింది. నిజమైన సౌందర్యం శ్రమలోనే ఉందన్న విషయాన్ని దాచి ఎగువతరగతి ఫ్యాషన్లను దిగువ తరగతులకు విషంలా ప్రాకిస్తున్నారు. దాని ఫలితమే పిజ్జాలు, బర్గర్‌లు తినడం, కూల్‌డ్రింక్‌లు, మత్తుపదార్థాల సేవనం, మార్నింగ్ వాక్‌లు, జాగింగ్‌లు, జిమ్‌లు, సౌందర్యలేపనాలు. శ్రామిక సంస్కృతిలో శారీరక, మానసిక శ్రమ, కలుపుగోలుదనం, ఇచ్చిపుచ్చుకునే తత్వం ఉంటాయి. అది క్రమంగా కనుమరుగయ్యి మానవజీవితాలు ఎలా మారుతున్నాయో వివరించే కథ ఇది. ఇక "ఇంటింటి కథ". శరత్‌బాబు ఎప్పుడో "ఆడ బ్రతుకు" అని ఒక పుస్తకం రాశాడు. ఆడవాళ్ళ శ్రమకు విలువకడితే భర్తే భార్యకు తిరిగి ఇవ్వాల్సి ఉంటుందని లెక్కలతోసహా చూపుతారు. భూస్వామ్య సంస్కృతి కుటుంబంలో పురుషాహంకారంగా మారుతుంది. వంటే కదా?! ఇంటిపనే కదా?! ఇంట్లో మీరు మాత్రం చేసే పనేమిటి?! ఇలాంటి మాటలు సాధారణంగా వినిపిస్తుంటాయి. అయినా ఎవరికి చేస్తుంది? పిల్లలకు, భర్తకే కదా? మరి ఇవే ప్రశ్నలు వాళ్ళని వేస్తే అది అమ్మపని, తినడం అందరి పని. వండటం అమ్మపని, కడగటం అమ్మపని. దీనివల్ల స్త్రీలు పడే యాతన, టెన్షన్, వారికి వచ్చే జబ్బులు వారికి నరకం చూపెట్టడం ఒక అంశంకాగా ఇదే కథలో మరో కోణాన్ని చూపారు సింగమనేని. కలిసి మనుష్యులు పనిచేస్తే వచ్చే ఆనందం. మనుష్యులు గౌరవించుకునే పద్ధతి సమాజంలో ఎలా ఉన్నాయి ఎలా ఉండాలో చర్చిస్తారీ కథలో. ఇలాంటి నలుగురి కోసం ఒకరు ఆ ఒక్కరి కోసం నలుగురుగా కలవాలని దానికోసం చర్చించుకోవాలని అవసరమైతే పీడితులు తిరగబడాలని చెబుతారు.

సింగమనేని నారాయణ గారు మంచి ఉపాధ్యాయులు. ఆయన కథల నిండా ఆ సంస్కారం కనిపిస్తుంది. మార్పు బడి నుండే బయలుదేరాలని అందుకు ఉపాధ్యాయులే సాధనమని నిరూపిస్తారు. "తరగతి గదిలో తల్లి" కథలో తల్లి మొదటి గురువు ఎలా అయ్యింది అన్న దగ్గర నుండి అమ్మ భాష మాతృభాషగా ఎలా మారింది అమ్మ చేసే సేవలు నాన్న పనులు, తల్లి కుటుంబాన్ని ఆలింగనం చేసుకునే పద్ధతి తల్లిదండ్రుల పని పంపకాల మధ్య తేడా పిల్లలు ఎలా గమనిస్తారో ఈ కథలో చెప్పారు. చిన్నతనం నుండి శ్రమను గౌరవించి ఆడపని, మగపని అనే తేడా లేకుండా పనులు నేర్చుకోవాలనీ, అదే సమయంలో తమని పట్టించుకునే ఉపాధ్యాయులకు పిల్లలు ఇచ్చే గౌరవం గురించీ ఎంతో విశ్లేషణాత్మకంగా రాసిన కథ. ఇటువంటి కథలు పిల్లలకు అందుబాటులో ఉంటే వారి సంస్కారపు స్థాయి మెరుగవుతుంది. ఈ ప్రపంచపు తల్లకిందులుతనాన్ని అర్థం చేసుకోగలుగుతారు. ఇటువంటి కథలు నాటికలుగా మలచాలి.

మన సంస్కృతిలో తల్లికి, భార్యకు ప్రత్యేక స్థానం ఉంది. అయితే తల్లిని పూజించే వ్యక్తే భార్యను బాధిస్తాడు. ఒకటి ఆర్థికం. రెండు చిన్నచూపు. ఆమెను బాధించే కొద్దీ ఆమె పుట్టింటివాళ్ళు డబ్బు ఇస్తారు. ఇది వ్యవస్థీకృతం కాబడింది. ఈ అర్ధఫ్యూడల్, అర్ధవలస వ్యవస్థలో పెట్టుబడిదారీ వినియోగ మనస్తత్వం ఓవైపు, మరోవైపు మరింత కూడేసుకుని దాన్ని ముందుతరాలకు దాచి అందించాలని ఫ్యూడల్ మనస్థత్వం ఉండడం వల్ల మనుష్యుల్లో మానవత్వం అడుగంటుతుంది. చదువుకోని స్త్రీల వేదన ఒక రకమయితే, చదువుకున్న స్త్రీల నరకం వేరు. అంతో ఇంతో ఆత్మాభిమానం గలవాళ్ళు తమపై జరుగుతున్న అన్యాయాన్ని ఎదిరించే ఆర్థిక స్వాతంత్ర్యం లేక, సమాజము, చట్టాలు, కోర్టులు కూడా ఈ వ్యవస్థలో పురుషులవైపు ఉన్న కారణంగా ప్రతిరోజు చస్తూ సర్దుకుంటూ సినికల్‌గా మారి రాబోయేతరం అత్తలుగా మారి తాము అనుభవించిన కష్టాలు తమ కోడళ్లకి ఆరళ్ళుగా మారుస్తారు. దీనికి కారణం వారికి అర్థంకాదు. ఈ వ్యవస్థలో మార్పుకు ప్రతి ఒక్కరూ తమవంతు కృషి చెయ్యాలి. "గక్కున విడవంగ వలయు..." కథలో సుశీల చేసే పని అదే. అన్న కన్నా ఎక్కువ మార్కులు తెచ్చుకున్నా ఆడపిల్లకు పెళ్ళే పరమార్థం కావడంతో ఆమెను చదువు మాన్పించి పెళ్ళిచేస్తారు. ఇక నిరంతరం డబ్బు తెమ్మని అత్తవారి తరపునవారు గొడవచేసి పుట్టింటికి పంపేస్తారు.

తరువాతి కథ "జ్ఞాతమూ - అజ్ఞాతమూ" కూతురి పెళ్ళి వత్తిడిలో కుటుంబ యజమాని చనిపోయిన కథ. కుటుంబ యజమాని చనిపోయినా పెళ్ళాగితే జరిగే నష్టం... అయినా కన్నీళ్ళ మధ్య పెళ్ళి జరుగుతుంది. మధ్యతరగతి మనుష్యులు ఎగువకి ఎగబాగలేక తెగించి తమ స్థాయి నుంచి దిగువకు వెళ్ళలేక (నలుగురికి భయపడి) నిరంతరం పడే సంఘర్షణ అనేక రూపాలుగా వుంటుంది. టీ.వీ.సీరియల్స్ సినిమాల ప్రభావం కూడా వీళ్ళపై చాలా ఉంటుంది. ఇదంతా పైన పటారం లోన లొటారం లాంటిది. ఒకరు ఇంత ఇచ్చారని మరొకరు ఆస్తులు తాకట్టుపెట్టి, లేదా అమ్ముకుని కట్నాలను ఎన్నోరెట్లుగా పెంచుకుపోవడం, ఎవరైనా కాదంటే మిగిలినవారు దానిని లోకరీతిగా మార్చడం ఈనాడు కొనసాగుతోంది. వినియోగదారుల సంస్కృతిలో మనుష్యుల అవసరాలు నిరంతరం పెరుగుతాయి. ఇక్కడ ఉత్పత్తులు మనుష్యుల అవసరాలకు తగినవిగా కాక వ్యాపారులు తయారుచేసిన వస్తువులే ఉపయోగించే సమాజంగా మనం దీన్ని గుర్తించుకోవాలి. మరి ఈ వ్యవస్థలో పెళ్ళిళ్ళు వ్యాపారంగానే జరుగుతాయి. పెళ్ళి జరపడం అంటే వందల కోట్ల రూపాయలు నీళ్ళలా ఖర్చుచేసే బడా బాబులను అనుసరించడం. కుటుంబాలు ఆర్థికంగా దిగజారిపోవడం. తీవ్రమైన ఆర్థిక వత్తిడికి గురికావడం, చనిపోవడం.

"దృశ్యము-అదృశ్యము" సమాజంలో పెరుగుతున్న డబ్బు కాంక్ష కథావస్తువు. మరింత సంపాదించాలనే పరుగులో కొందరు సరిగ్గా నిలబడకుండా తల్లకిందులుగా ఈ సమాజాన్ని చూస్తే ఈ తల్లకిందులు సమాజం సరిగ్గా కనపడుతుందనే స్నేహితుడు చెబితే సంస్కారం గల వ్యక్తి పడే మధనం ఈ కథ. 90ల తర్వాత కొంతమంది మామూలు మనుష్యులు డబ్బు చెయ్యడం మొదలెట్టారు. ఎలా సంపాదిస్తారో తెలియదు. చట్టప్రకారం అది సమ్మతమే అవుతుంది. వీళ్ళే చాలామందికి ఆదర్శం. ఈ ప్రపంచాన్ని సరైన దృష్టితో చూసేవాళ్ళకి అది తప్పుగాను, వంచనగాను కనబడుతున్నా అలా చూసేవాళ్ళు అసమర్థులుగాను, సంపన్నులుగా ఎదిగేవాళ్ళే ఈ సమాజ ప్రతినిధులుగాను కనబడు తున్నారు. వ్యక్తిత్వ వికాసాలు సమాజ శ్రేయస్సు పక్కనపెట్టి పక్కదార్లు తొక్కైనా నువ్వు ఎదగాలని చెబుతాయి. దానికోసం మనం తల్లకిందులైతే ఈ సమాజం సరిగ్గా కనబడుతుందని చెబుతాయి.

**(తరువాయి 17వ పేజీలో)**

రోణంకి అప్పలస్వామి 27వ వర్ధంతి సందర్భంగా

# ఆచార్య రోణంకి వారి అభిప్రాయాలు... కొన్ని జ్ఞాపకాలు

- డా॥ బి.వి.ఎ. రామారావునాయుడు

**శ్రీకాకుళంజిల్లా,** "టెక్కలి పట్టణానికి దగ్గర్లో ఉన్న ఇజ్జవరం గ్రామంలో రోణంకి నారాయణ, చిట్టెమ్మ దంపతులకు 1909 సెప్టెంబరు 15వ తేదీన అప్పలస్వామి జన్మించారు. ప్రాథమిక విద్య ఇజ్జవరంలోనూ, హైస్కూలు విద్య టెక్కలిలోను, ఉన్నతవిద్యను విజయనగరం మహారాజ కళాశాలలో, కాశీ విశ్వవిద్యాలయాలలో పూర్తిచేసి, 1929 నుండి విజయనగరం మహారాజ కళాశాలలో ఆంగ్లభాషోపన్యాసకునిగా పనిచేశారు. పదవీ విరమణానంతరం ఐదేళ్ళపాటు ఆంధ్రవిశ్వ విద్యాలయంలో యు.జి.సి.ఫెలోగా పనిచేశారు. తరువాత టెక్కలిని ఆనుకొని ఉన్న గోపీనాథపురంలో నిర్మించుకున్న ఇంటిలో 29-03- 1987న తుదిశ్వాస విడిచేవరకూ నివసించారు.

విజయనగరం మహారాజ కళాశాలలో 1964 నుండి 1968 వరకూ నేను ఆయనకు ప్రత్యక్ష విద్యార్థిని. ఆయన బహుభాషా పాండిత్యానికీ, విజ్ఞాన సముపార్జనాధ్యయనానికీ ఆకర్షితులై ఆయన్ని ఆ రోజుల్లో ఆరాధించే పెక్కుమందిలో నేనొకణ్ణి. ఆయన కేంద్రమైతే వెలుపలి కక్ష్యలో అయస్కాంత విద్యుదాకర్షణకులోనై పరిభ్రమించే ఎలక్ట్రాన్ల వంటి కొద్దిమంది శిష్యులలో నేనొకణ్ణి. ఆయన సాన్నిహిత్యాన్ని పొందిన అతి కొద్దిమందిలో నేనొకడినన్న ధైర్యంతో ఆయన సాహితీ వ్యక్తిత్వ ఉన్నతిని ఆవిష్కరించే అనేకానేక సందర్భాలలో ఆయన వ్యక్తీకరించిన అభిప్రాయాలనూ, ఆయన రాతలో ప్రకటించిన కొన్ని నిర్దిష్టమైన ఆలోచనలనూ, నా యెరుకలోని కొన్ని జ్ఞాపకాలనూ సహపాఠక మిత్రులతో పంచుకొని. ఆ మహనీయుణ్ణి స్మరించుకొని, నివాళులర్పించే ఉద్దేశంతో ఈ వ్యాసం.

రోణంకి అప్పలస్వామిగారికి ముప్ఫైయేళ్ళు వచ్చేసరికే లాటిన్. గ్రీకు, ఇటాలియన్, స్పానిష్, ఫ్రెంచ్, ఇంగ్లీషుతోసహా సంస్కృత భాషలను స్వశక్తితో పాండిత్య స్థాయిలో అధ్యయనం చేసారు. ఆయా భాషా సాహిత్యాలను ఆయా భాషల్లోనే ఆస్వాదించి, అనుభవించే స్థాయికి చేరుకున్నారు. మొదటిదశలో పాశ్చాత్యుల మెప్పును పొందిన అత్యద్భుతమైన కవితల్ని అనేకమైన ఆంగ్లపత్రికలలో ప్రచురించారు. వీటిని "సాంగ్స్ అండ్ లిరిక్స్" పేరున 1935లో ప్రకటించారు. కేంద్రసాహిత్య, అకాడమీ కోరికపై మెకియవెల్లి రాసిన "ది ప్రిన్స్" అనే గ్రంథాన్ని "రాజనీతి" అనే పేరుతో ఆంధ్రీకరించారు. చాలా రేడియో ప్రసంగాలు చేసారు. ఎన్నో విమర్శనాత్మక వ్యాసాలు రాసారు. అటు పిమ్మట ఆయన రాసిన మిగిలిన కవితలు "The Knoll & other Poems" పేరున 1985లో ప్రచురితమయ్యాయి. ఆయన తన జీవిత కాలంలో సింహభాగాన్ని భాషాధ్యయనానికీ, సాహిత్యాస్వాదనకూ వెచ్చించారు.

టెన్నిసన్ మహాశయుని "యులిసిస్" అనే పద్యంలో నాయకుడు జ్ఞానపిపాసకు ప్రతీక. అతడు తన గూర్చి చెబుతూ "టు ఫాలో నాలెడ్జ్ లైక్ ఎ సింకింగ్ స్టార్" అంటాడు. జ్ఞానసముపార్జనకే తన జీవితాన్ని అంకితం చేస్తానంటాడు. ఆచార్య రోణంకి సరిగ్గా అటువంటి వ్యక్తి. జ్ఞాన సముపార్జనే అతనికి ఆనందం. అదే అతని జీవిత పరమావధి. సాహిత్యంలోని అన్ని ప్రక్రియలూ ఆయనకు ఇష్టమైనవే. అందులో కవిత్వం మరీ ప్రాణప్రదమైనది. సుమారు డెబ్భైయేళ్ల తన జీవితకాలంలో ఆయన కవిత్వాన్ని చదవలేదు... రాయలేదు.... జీవించారు. "Poetry is the religion of life" అనేవారాయన, Living Poetry అనే పదం ఆయనకు అత్యంత ప్రీతిపాత్రమైనది. ఆయన అవిశ్రాంత కవిత్వాన్వేషకుడు. రసలుబ్ధుడు. "సుకవితా యద్యస్తి రాజ్యనకిం" అనే భర్తృహరి సూక్తికి లక్ష్యంగా తన జీవితాన్ని మలుచుకున్న మహానుభావుడాయన.

తరతరాల తెలుగు కవిత్వాన్ని ఔపోసన పట్టిన రోణంకి దాన్ని ఆంగ్లం ద్వారా ప్రపంచ పాఠకులకు పరిచయం చేసారు. తంబిముత్తు, అనే ఆయన బెంగాలీ, హిందీ మొదలైన భారతీయ భాషలలో భావకవిత్వానికి దగ్గరగా వుండే శృంగార రసప్రధానమైన కవితలతో పాటు, తెలుగు కవితల్ని కూడా తీసుకొని ఆంగ్లంలోనికి అనువదించేసి "Indian Love Poems" పేరున 1950లో న్యూయార్క్ నుంచి ఒక కవితా సంకలనం వెలువరించాడు. ప్రపంచంలోని అనేక దేశాల సాహితీవేత్తల మెప్పు గడించిన ఆ పుస్తకంలోని 40 పద్యాలలో రోణంకి వారివి 15కిపైగా ఉన్నాయి. అందులో ఆయన అల్లసాని పెద్దన, నంది తిమ్మన, రామరాజ భూషణుడు వంటి ప్రబంధ కవుల ప్రసిద్ధ పద్యాల్ని కూడా ఇంగ్లీషులోకి కవితాంతరీకరించి పరిమళాలు వెదజల్లాడు.

ఇక ఇరవయ్యో శతాబ్దపు తెలుగు కవిత్వానికి వస్తే దాదాపు ప్రధాన కవులైన గురజాడ, రాయప్రోలు, విశ్వనాథ సత్యనారాయణ, అబ్బూరి రామక్రిష్ణారావు, నాయని సుబ్బారావు, దేవులపల్లి కృష్ణశాస్త్రి, శ్రీరంగం నారాయణబాబు వంటి కవుల ఉత్తమ కవితల్ని అనువదించారు. 1956లో అబ్బూరి ఛాయాదేవి సంకలించిన "Modern Telugu Poetry" అనే పుస్తకంలో అరడజనుకి పైగా రోణంకివారి అనువాదాలున్నాయి. వేగుంట మోహన్ ప్రసాద్ సంకలించిన "This Tense Times"లో ఇరవై వరకూ రోణంకివారి కవితానువాదాలు ఉన్నాయి. ఈవిధంగా తెలుగులోని ఉత్తమ కవితను అంతర్జాతీయ కవితాపటంపై ముద్రించిన రోణంకి వారిని తెలుగుజాతి కృతజ్ఞతతో స్మరించుకోవాల్సి ఉంటుంది.

ఆంగ్లోపన్యాసకునిగా ఆయన తరగతులు నిర్వహించిన తీరులో ఒక ప్రత్యేకత ఉండేది. ప్రతిపదార్థం తాత్పర్యం చెప్పడం కాదు కవితా వైభవాన్ని ఆవిష్కరించాలి, విద్యార్థుల్లో భాషాభిమానం అంకురించాలన్నదే ఆయన ధ్యేయంగా ఉండేది. ఆయన కవిత్వాన్ని గానం చేసేవారు. అభినయం చేసేవారు. సాహిత్యం, సంగీతం, నృత్యం ఒక్కమూర్తిగా సాక్షాత్కరించేవి. విద్యార్థుల హృదయాలు విరిగిన బల్లల మరకల గోడల పరిధులు దాటి ఒక ఉజ్వల జగత్తును అందుకునేవి. ఆ అనుభవం అపూర్వం... "ఈనాడు కవితా వ్యాసంగానికి పూనుకోవాలంటే పూర్వ కవులందర్నీ దీక్షతో చదివితీరాలి. ఉన్మీలనా శక్తిని ఇనుమడింపచేసే విధంగా ప్రాచీనాతి ప్రాచీన మానసికాన్ని ఆధునిక శాస్త్రీయ చైతన్యంతో జోడించవలసి ఉంటుంది. లేకపోతే భవిష్యద్దర్శన భాగ్యం లభించదు" అనేవారు.

అభ్యుదయ సాహిత్యానికి ఆహ్వానం పలికిన ప్రముఖుల్లో ఆచార్య రోణంకి ఒకరు. ఆయన తెలుగు సాహిత్యంలో శ్రీశ్రీ, నారాయణబాబు, ఆరుద్ర వంటి ప్రముఖ కవుల గురించీ ఐరోపా దేశాల్లో ప్రాచుర్యం పొందిన నూతన కవితారీతుల గురించీ తెలుసుకునేవారు.

ప్రభావితమయ్యేవారు. అభ్యుదయ కవితాఉద్యమం వారి చేతుల్లో రూపుదిద్దుకుంది. ఆచార్య రోణంకి అర్ధశతాబ్దంపైగా తెలుగు భాషా వికాసానికి ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ తన వంతు సేవలందించారు. చారిత్రక సత్యాన్ని ప్రకటించడానికి ఆయనెప్పుడూ వెనుకాడేవారుకాదు. "శ్రీశ్రీ తరువాత అంతా శూన్యం" అని అజంతా అన్నప్పుడూ, శ్రీశ్రీని "ఫాదర్ ఆఫ్ మోడర్న్ పొయిట్రీ" అని వేగుంట మోహనప్రసాద్ అన్నప్పుడూ రోణంకి తీవ్రంగా వ్యతిరేకించారు. ఆధునిక సాహిత్యానికి గురజాడ అద్యుడుకాని శ్రీశ్రీ కాదు పొమ్మన్నారు. అయితే శ్రీశ్రీ కవిత్వంపట్ల రోణంకికి అపారమైన గౌరవం. శ్రీశ్రీ, నారాయణబాబుల కవిత్వ పోకడలు గుర్చి చెబుతూ "శ్రీశ్రీ నోటికి పట్టే ఛందస్సులతో పరుగులు తీస్తాడు. తన లక్ష్యాన్ని ప్రత్యక్ష పద్ధతిలో వ్యక్తం చేస్తాడు. నారాయణబాబు పరుగులో శ్రీశ్రీకి గల ఉద్వేగంలేదు. అతనిది పరోక్ష పద్ధతి" అనేవారు రోణంకి.

"శ్రీశ్రీ తాను రచించిన కవితలని కొన్నింటిని అనువాదాలుగా పేర్కొన్నాడు. మరికొన్నింటిని అనుకరణలని నామకరణం చేసాడు. వీటన్నింటినీ నేను కవితాంతరీకరణలంటాను. ఆంగ్ల, ఫ్రెంచి మాతృకలను ప్రశంసాపాత్రమైన ఉత్తమోత్తమ ప్రతీకలను, తెలుగు నుడికారాన్నేమాత్రం బలికానీయకుండా తెలుగు కవి సాధించాడు. ఇతర భాషలలోని కవితాసృష్టికి సమమైన ప్రతిదృష్టి ఈతని అనువాదసరళి" అనేవారు. "శ్రీశ్రీ తెలుగు సాహిత్యరంగంలో ప్రవేశించడంతో వ్యావహారిక భాష తిరుగులేకుండా సాహిత్యభాషగా స్థిరపడిపోయింది. ఈతని కవిత్వంలో భాషావిప్లవం పరాకాష్టనందుకోవడమే కాకుండా భావ విప్లవం జయంగావించిందని చరిత్రలో సువర్ణాక్షర లిఖితమై తీరుతుంది" అన్నారు.

గురజాడ "దేశభక్తి"పై రోణంకి హృదయోద్వేగ స్పందనను ఆయన రాతలోనే చూద్దాం.

"I have never, in all my reading, in several European languages, both ancient and modern come across a song which expresses the sentiment of patriotism like this Andhra poet's love of country. It gives no quarter to aggressiveness, makes no boastful gestures, recognises the quality of all men and women and envisions a world of collective effort of peace. plenty and prosperity"

**మతములన్నియు మాసిపోవును**
**జ్ఞానమొక్కటి నిలిచి వెలుగును**
**అంత స్వర్గ సుఖంబులన్నవి**
**యవని విలసిల్లున్**

అను పద్యపాదాలను ఆయన ఎంతో అలౌకికానందంతో మెచ్చుకుంటూ...

"What a limpid compendium they compose of the new humanism" అనేవారు రోణంకి. పురాణాలపైనా, దిగంబర కవులపైనా, భాషపైనా ఆయన వెలిబుచ్చిన అభిప్రాయాలు, ఎదిగిన ఆయన శాస్త్రీయ విశ్లేషణాధిక్యతకు నిదర్శనాలుగా నిలుస్తాయి.

రామాయణం నాకు పడదు. భారతమే నాకు ఇష్టం. రామాయణంలోని కేరక్టర్స్ అన్నీ కృత్రిమంగా ఉంటాయి. మనుషులకి మార్గదర్శకంగా ఉండడం కోసం రాముడిపాత్ర సృష్టించారు. అందుకే విష్ణువు నరజన్మ ఎత్తేడని, మానవుల్లాగే కష్టాలుపడ్డారని కూడా చెబుతారు. కానీ రాముడెక్కడా మనిషిలాగా కనిపించడు. చేసిన పనులన్నీ హ్యూమన్ నేచర్‌కి విరుద్ధంగా వుంటాయి. భారతంలో అలాకాదు. ఏ పాత్రకాపాత్ర ఆ పరిస్థితుల్లో ఎలా ప్రవర్తించాలో అలాగే ప్రవర్తిస్తుంది. అసలు మనుషుల్లాగే అన్ని పాత్రలు ఉంటాయి. తమాషా ఏమిటంటే రామాయణం కన్నా భారతమే ముందు రాయబడ్డది. రామాయణ రచనా కాలానికి సాహిత్యం కృత్రిమరూపాన్ని పొందిందనే నేననుకుంటాను."

"దిగంబర కవిత్వం నాకు నచ్చదు. ఆకులందున అణిగి మణిగీ కవిత కోకిల పలకాలనీ, అట్లాంటి కవిత్వం వల్ల దేశంలో అభిమానాలు మొలకెత్తాలనీ నిర్దేశించాడు గురజాడ. ఆచ్ఛాదన ఉంటేనే కవిత్వానికి అందం వస్తుంది. బరితెగించి ఆవేశకావేషాల్ని కక్కేరాతలు మంచి కవితలు కాలేవు. ఈ కాలం చాలా మందికి ఈ మాటలు రుచించవు"

నాకు తెలుగే ఇష్టం. మిగతా భాషలు కొన్ని ఇష్టపడి, కష్టపడీ నేర్చుకున్నాను. అవీ ఆ భాషల్లోనే సాహిత్యాన్ని చదవటం కోసం మాత్రమే. అయితే అన్ని భాషలకంటే తెలుగు గొప్పదంటే మాత్రం ఒప్పుకోను. ఎవరిభాష వాళ్లకి ఇంపుగా ఉంటుంది. అందులోని నుడికారం వాళ్లకే సరిగ్గా బోధపడుతుంది. మనవాళ్లు రవీంద్రనాథ్ ఠాగూర్‌ని విపరీతంగా పొగుడుతుంటారు. దేశభాషలందు తెలుగు లెస్స అంటూ ఉంటారు. ఆ ఠాగూర్ మన తెలుగు భాషని దయ్యాలభాష అన్నాడు. ఆ సంగతి వీళ్లకి తెలియదు. బెంగాలీ వింటుంటే నాకు అది దయ్యాలభాష అనిపిస్తుంది. మరొకరి భాషను అలా అనడం తప్పు."

నా మస్తిష్కంలోకి ఇంకిపోయి ఇంకా పచ్చగా ఆకుపచ్చగా మిగిలిన రెండు సంఘటనల్ని జ్ఞాపకాలుగా వినిపిస్తాను.

1966, మా మొదటి సంవత్సరం డిగ్రీ సుమారు వంద మందిమి క్లాసులో ఉన్నాం. రోణంకివారు క్లాసుకి వచ్చారు. వస్తూనే "ఈరోజు మన పట్టణానికి ముగ్గురు రాష్ట్రమంత్రులు వస్తున్నారు. ఒకరేమో ముఖ్యమంత్రి కాసు బ్రహ్మానందరెడ్డి, మరొకరు పి. తిమ్మారెడ్డి, వేరొకరు ఎ.సి.సుబ్బారెడ్డి, అనబడే ఇద్దరు కేబినెట్ మంత్రులు. ముగ్గురూ ఒకే కులానికి చెందినవారు. మనది ప్రజాస్వామ్య దేశమేనా? "Come on, Get up" Answer - No" అంటూ బిగ్గరగా అరుస్తూ వందమందిచేత విడివిడిగా "No" అని చెప్పించారు. ఆధిపత్య కులాల ధనబలం ప్రజాస్వామ్య రూపంలో పరిపాలనాధికారాన్ని చేజిక్కించుకునే దుర్మార్గంపై ఆయన వ్యక్తంచేసిన తీవ్రమైన కోపానికి ఇది నిదర్శనం.

ఒకసారి రోణంకి వారి క్లాసు జరుగుతుండగా మధ్యలో ఒక విద్యార్థి లేచి "మాస్టారూ" దేవుడిపై మీ అభిప్రాయమేమిటో చెప్పండి" అన్నాడు. దానితో ఆయన కోపంతో కంపించుతూ స్టేజి దిగి గబగబా నడుచుకుంటూ ఆ అబ్బాయి దగ్గరకు వెళ్ళారు. కొడతారేమోనని మేం భయపడ్డాం. కాని అలా జరగలేదు. వాడి షర్టుపట్టుకొని "దీనిపై అభిప్రాయం అడుగు చెప్తాను" అంటూ వాడి పెన్ను తీసి "దీనిపై అభిప్రాయం అడుగు చెప్తాను", "దేవుడేమైనా పదార్థమా, నువ్వెప్పుడైనా చూసావా? నువ్వు నేను చూడనిదానిపై అభిప్రాయమెట్లా చెప్తాం", అని బిగ్గరగా అంటూ తరువాత చల్లబడి పాఠం కొనసాగించారు. ఈ ఉదంతం ఆయన అజ్ఞేయవాదని, భౌతికవాదని మనకు స్పష్టంగా తెలియచేస్తుంది.

చదువూ, నిత్య అభ్యాసం, భాషోల్లాసం అతని వ్యక్తిత్వంలో భాగాలు. సాహితీ తత్వం ఆయన మనస్తత్వం. రసాస్వాదన ఆయనలో ఉన్నత స్థాయిలో ఉండేది. కవిత్వం చదివేటప్పుడు నృత్యంచేసేవారు. మనుచరిత్ర అయినా ఒడిసీ అయినా, పెద్దనయినా... టెన్నిసన్ అయినా, అటు ఇలియెట్ అయినా ఇటు నన్నయ అయినా, కట్టలుతెగి ప్రవహించే కవితాభిమానం, డబ్బు, హోదా, దోపిడీ, స్వార్థం అంటే మంట. నూటికి నూరుపాళ్లూ అక్షర ప్రపంచం తప్ప అన్యం ఎరుగని రోణంకి ఆధునిక తెలుగు ప్రపంచంలో అద్భుతమైన వ్యక్తి. తన జీవితమే ఒక గొప్ప కావ్యంగా మనకు మిగిల్చిపోయాడు. ఆయన్ని మనం అనుసరించగలగడం కంటే వేరొక నివాళి ఉండదనుకుంటాను. ✤



# బాల సాహితి

## సమాజం సిగ్గుపడదే !?!

– కె. భవాని, 8వ తరగతి

**దేశానికి** స్వతంత్ర్యం వచ్చింది.
లంచగొండితనం తెచ్చింది
ఆడపిల్లపై అన్యాయాల్నీ రెచ్చింది
మగాళ్ళ స్వర్గం ఇది
ఆడవాళ్ళ నరకం ఈ కాలం
పట్టించుకోని సమాజం తలవంచుకుని సిగ్గుపడదే?!

ఆడపిల్ల పుట్టిందంటే
అంత భయమెందుకు – అసహ్యమెందుకు?
ఆడపిల్ల ఇంట్లో పనిలో
అమ్మకు తోడై ఉంది
అణిగి – మణిగి బ్రతుకు ఈడ్చే
ఆడపిల్ల జీవితంలో
ఆపదలూ! వేధింపులూ!

ఆడపిల్ల కట్నం ఎందుకు ఇవ్వాలి?
పెళ్ళి, ఇద్దరి అవసరం కాదా?
ఆడ, మగ తేడాలను అంతం చేయాలి
సమానతను సాధించే పంతం పట్టాలి.

## తెలుసుకో

– సూరపు రూపావతి, 9వ తరగతి

**ఆడదంటే** అమ్మ
అమ్మంటే కాదు బొమ్మ
అమ్మంటే ఎందుకింత అలుసు
అమ్మ ప్రపంచం మనకేం తెలుసు
అమ్మే రేపటి గెలుపు
రాబోయే సమాజానికి సక్రమ మలుపు
ఇంటిపని బయటపని చేస్తున్న అమ్మే
తాగుబోతు నాన్న బారినపడుతుంటే
అందరిని ఆదరించే అమ్మను
చెప్పలేని స్థితిలో తిప్పలు పెడుతుంటే
అమ్మ బాధ ఎవరికి తెలుసు?

## వరకట్నం – లంచం

– రెడ్డి సీతమ్మ, 10వ తరగతి

**ఆడవారే** లేకుంటే
తల్లులే లేనట్లు!
అది మరచిపోయి నడుస్తోంది
ఈ ప్రపంచం
ఆడపిల్ల కన్నీరు సునామీ
ఆడపిల్ల గాయాలు అగ్నిపర్వతాలు
ఆడపిల్లలు బలహీనమైతే
దేశమే బలహీనమౌతుంది
ఇది ఇలాగే వుంటుందా?
లేదు !

## ఇంకానా...!

– డి. వెంకట ప్రసాద్, 8వ తరగతి

'**స్త్రీలు** అందంగా ఉండాలి
తెలివిగా ఉండాలి
తనదిగా ఉండాలి
అదుపులో ఉండాలి'
– ఇదీ మగ ప్రపంచం పద్ధతి

## ఆడపిల్ల

– లింగభేరి మౌనిక, 8వ తరగతి,

**మగవాడి** దృష్టిలో ఆడపిల్ల ఆటబొమ్మ
మగవాడి దౌర్జన్యానికి ఆడపిల్ల బలికావాలా?

ఆడపిల్ల అంటే ఎందుకింత చిన్నతనం
పసిమొగ్గలో చిదిమేస్తే ఎక్కడుంది అమ్మతనం

ఆడపిల్ల పుడితే ఆడవాళ్ళదా తప్పు?
మగపిల్లాడు పుడితే మగవాళ్ళకి ఎందుకు గొప్పా?

ఆడపిల్ల లేకపోతే మగజన్మ ఉంటుందా?
మగ ఆడా అనే ఎక్కువ తక్కువ
ఈ మనుషులలో తొలగించాలి.

# ఎక్కడకెళ్తోంది సమాజం

- పి. హరీష్, 8వ తరగతి

**సమాజం** ఏమౌతోంది?
ప్రగతికి మారుతోందా? నాశనం అవుతోందా?
ఆడవాళ్ళు అందంగా ఉండటం తప్పా?
ఉన్మాదం ప్రేమై ఒప్పుకోకపోతే దానికి యాసిడేనా?
ఆడవాళ్ళపై అత్యాచారాలు
వార్తపత్రికలనిండా గాయాలు
ఆడదంటే అమ్మ
ఆ అమ్మే మనల్ని కని పెంచుతుంది.
ఎక్కడికెళ్తోంది సమాజం?
ఆడపిల్లంటే ఎందుకంత చిన్న చూపు
చిగురులోనే చిదిమేస్తే ఎక్కడుంది అమ్మతనం
అణిచేటి వికృతం ప్రకృతిలో ఎక్కడుంది
మగవాళ్ళలో ఎందుకు ఈ అవగుణం దాగుంది?
ఆడ మగ తేడాలు నశించాలి.
స్త్రీ జాతిని గౌరవించాలి
స్త్రీకి అండగా ఉండాలి
లోకంలో సగభాగం స్త్రీ
మగవాళ్ళకు అమ్మతనం స్త్రీ

# అందరికీ అర్థమవ్వాలి

- కె. నీలిమ, 8వ తరగతి

**ఆడపిల్లంటే** అంత అలుసా?!
ఆడపిల్లమీద ఇన్ని అరాచకాలా?!
ప్రేమను అంగీకరించకపోతే యాసిడ్
చదువును ప్రేమిస్తే - వేటకత్తి
మగవాళ్ళనీ కన్నది ఒక ఆడదే
దేశానికి స్వతంత్రం - మహిళలకు అందదు
ఆడవాళ్ళకు వంటిళ్ళు - వంటిళ్ళకు కటకటాలు
ప్రభుత్వం అవినీతి పాలయ్యింది
ప్రభుత్వం ప్రజలకు చేదయ్యింది
అనూహ్య, సునందల్నీ కాపాడిందా?
రక్షణ వలయం విషవలయమయ్యింది
నేరస్తులు కులాసాగా తిరుగుతున్నారు
ప్రతిచోటా లంచం
అడుగు పెడితే చాలు మద్యం
మన సమాజాన్నీ మనమే మార్చుకుందాం
ప్రజలందరినీ మేల్కొల్పుదాం
పదండి ముందుకు
చీకటికి ఎదురు నిలుద్దాం
తీసుకువద్దాం వెలుగుల్ని
మేలుకోవాలి
మనమంటే ఏమిటో అందరికీ అర్థమవ్వాలి!

# స్వాతంత్ర్యం ఎవరికొచ్చింది?

- చిట్టి లలిత, 8వ తరగతి

**ఆడపిల్ల** అంటే ఎందుకు చులకన?
అనూహ్య జీవితమంతా నాశనమేకదా!
పట్టించుకోని పోలీసులు
పనిచేయని సి.సి.కెమేరాలు
ఎందుకు కుప్పల చట్టాలు?
ఆడపిల్ల అందంగా ఉండడం దోషం!
ఆడపిల్లగా పుట్టడం నేరం!
ప్రేమ అన్న పదం భ్రష్టు పట్టింది.
శీలానికి కూడా వెలకడుతున్నారు.
అత్యాచారం శిక్షగా తీర్పు ఇస్తున్నారు,
మద్యం మత్తెక్కి
పాలన మదమెక్కి
కులమతాలు కిర్రెక్కి
మగాడి అవసరం ఆడది
కలిసి బ్రతకడానికి మనిషి కాదు
స్వాతంత్ర్యం ఎవరికి వచ్చింది?
సమాజాన్ని మార్చడానికి పదండి...!

# ఆడపిల్ల స్థానం ఎక్కడ?

- అనూష, 8వ తరగతి

సృష్టికి మూలం స్త్రీ
స్త్రీకి మూలం అమ్మ
అంతులేని వివక్షలో నేడు!

మసిపట్టిన చిమ్నీలా?
ఆరిపోయే దీపంలా?
కరిగిపోయే మేఘంలా?
ఆడపిల్ల స్థానం ఎక్కడ?
స్థావరం ఎక్కడ?

ఆడదంటే అంత అలుసయిపోయిందా?
అవసరాలు తీర్చే యంత్రంగా మారిందా?
స్పందించే మనసే కాదు తల ఎత్తే తెగువుంది.
ఈ సమాజాన్ని ఎదిరించే సాహసం మాకుంది!
నేర్పుగ మనముంటేనే మార్పన్నది వస్తుంది.
ఇన్నేళ్ళ అసమానత తోకముడుచుకుంది.
కన్నీళ్ళను కత్తులుగా తిప్పాలనుకుంటుంది.
కళ్ళుతెరిస్తే మహిళాలోకం
మరో లోకం సృష్టిస్తుంది

**(పై కవితలు రాసినవారందరూ ప్రభుత్వ ఉన్నత పాఠశాల, శ్రీకాకుళంజిల్లా నరసన్నపేటలో విద్యార్థులు)**

# పసిడిమొగ్గ

## (బడిపిల్లల సాహిత్య మాసపత్రిక)

ప్రధానోపాధ్యాయులు ఎల్.అంజనీదేవి ప్రధాన సంపాదకులుగా ప్రభుత్వ ఉన్నతపాఠశాల, **ఆమదాలవలస** వారు 1/8డెమ్మీలో 8 పుటలతో ప్రచురించిన మాసపత్రిక రెండవ సంచిక (ఫిబ్రవరి, 2014) ఇది.

50, 60 ఏళ్ళ క్రితం అన్ని పాఠశాలల్లో గ్రంథాలయాలు వుండేవి. పిల్లలు చదువుకోవడానికి ఇంటికి పుస్తకాలు ఇచ్చేవారు. నీతి బోధనకు కేటాయించిన సమయంలో కథలు, పాటలు పరిచయం చేసేవారు. వ్రాత పత్రికలుండేవి. ప్రభుత్వ విధానాలు క్రమంగా విద్యారంగం యాంత్రికంగా మారిపోయేట్లు చేసాయి. కేవలం బట్టీపట్టడమే తెలివితేటలకు గీటురాయిగా మారింది. ఈ సంచిక సంపాదకీయంలో పేర్కొన్నట్లు "పిరికితనం, బిడియం పోగొట్టి పిల్లల్లోని భావోద్వేగాలను రచనావ్యాసంగంలోకి మళ్ళించాలి. భాషపై అధికారం రావాలంటే వీరిలోని రచనాశక్తికి పదునుపెట్టాలి."

ఈ సంచికలో గంగు జీవిత 'స్నేహం కోసం' కథ, కె. వెంకట లక్ష్మి(టీచర్) రాసిన 'ఇంటర్నేషనల్ అమ్మ', కె. ఉమాదేవి(టీచర్) రాసిన 'ఆదర్శ మహిళ – సరోజినీ దేవి', ఛాయరాజ్, మాతృభాషపై రాసిన కవితలోని కొన్ని పాదాలు, మడ్డు కళ్యాణ్, యిర్ర ఉపేంద్ర రూపొందించిన పదకేళీ, వ్యాయామ ఉపాధ్యాయుడు బి. అప్పన్న ఖోఖో పై రాసిన వ్యాసం, రెడ్డి ఢిల్లీశ్వరరావు, కొత్తపల్లి సాయికుమార్‌లు చిత్రించిన చిత్రాలు, బి. సరళ రాసిన 'సైన్సు విజ్ఞానం', కె. జోగారావు (టీచర్) రాసిన రసాయన శాస్త్రం ప్రశ్నలు మొదలైనవి వున్నాయి. ఒక పుటలో ఏడుగురు పాఠకులు జనవరి సంచికపై రాసిన అభిప్రాయాలున్నాయి. వావిలాల గోపాలకృష్ణయ్య, గాంధీజీ, గిజూభాయి, వేమన, సమతారావుల ఉల్లేఖనలున్నాయి.

అచ్చువేసుకోడానికి ఇబ్బందైతే, ప్రతి పాఠశాల వ్రాత పత్రికనైనా నిర్వహించుకుంటేనే, పిల్లలలో సర్వతోముఖ వికాసానికి అవకాశం వుంటుంది. 'పసిడిమొగ్గ' నిర్వాహకులకు అభినందనలు.

# కొంటె బాతుపిల్ల

– భూపాల్

**చెరువు** అంచుకు ఊరు ఉంది. ఆ ఊరు కొనకు ఒక ఇంట్లో బాతులున్నాయి. బాతు ఒకటి పదిపిల్లలు చేసింది. ఆ పది పిల్లలను తోల్కొని చెరువుకు పోయి 'ఈత' కొట్టేది ఎట్లనో నేర్పించవలెనని అనుకుంది బాతు.

తెల్లారగట్ల పిల్లలను తోల్కొని చెరువుదిక్కు నడిచింది. ఆ బాతు పిల్లలన్నింట్ల 'బేక్ బేక్' అనే పేరున్న పిల్ల... మహా అల్లరి చేస్తుంటది. ఒక్కతాన ఉండదు. కొంటెచేష్టలెక్కువ... అన్ని పిల్లలు ఒకతాన చేరి తల్లి ముంగటనే ఈత కొడుతుంటే... ఈ 'బేక్ బేక్' తల్లిని కాదని మెల్లగా పక్కకు జారుకుంది. చెరువు నడుమకు పోయింది.

చెరువుల అక్కడక్కడ గడ్డిపొదలున్నాయి. తుంగ పెరిగివుంది. బేక్ బేక్‌కు ఉషారు ఎక్కువైంది. నీల్లల్ల ఈదుకుంట, ఎగురుకుంట గడ్డిపొదల దిక్కు పోయింది. అనుకోకుండా పొదల చిక్కుకుంది. దాన్ని గడ్డిచుట్టేసింది. బయటకు వెల్దామంటే కష్టమైంది. ఇగ ఏం జెయ్యాలెనో తోచక అది ఏడువ సాగింది. ఆ ఏడుపు చప్పుడు అక్కడికి కొంచెం దూరమున్న చెరువు గట్టుకు వినపడుతుంది. ఆ గట్టు అంచున తొర్రలో ఉన్న ఎండ్రకాయ బయటకొచ్చి చూసింది. బేక్ బేక్ బాధ దానికి తెలిసింది. మెల్లగా ఈదుకుంట దాని దెగ్గరికిపోయి, తన కత్తెర చేతులతో గడ్డిని కత్తిరించింది. బేక్ బేక్ బయటకొచ్చింది. నవ్వుతూ కృతజ్ఞతలు చెప్పింది. ఇక్కడ ఇట్లావుంటే...

అక్కడ తల్లిబాతు, మిగతా పిల్లలు బేక్ బేక్ కోసం దేవులాట మొదలుపెట్టినయి. తల్లిబాతు ఆ పిల్లలను ఒక తాన్నే ఉండమని చెప్పి, దేవులాడుకుంట గడ్డిపొదల దిక్కు వస్తుంది. అప్పుడే తనూ బయలుదేరిన బేక్ బేక్ తల్లిని చూసి ఎంతో మురిసిపోయింది.

తల్లి తిడుతుందేమోనని ముందే తన 'పొరపాటు' ఒప్పుకుంది. క్షమించమంది. ఎండ్రకాయ చేసిన సహాయం గురించి చెప్పింది. ప్రమాదం తప్పింది అన్నది. ఇప్పటినుంచి భద్రంగా వుంటాననీ, పిచ్చి పిచ్చి లొల్లి మానుకుంటానన్నది. ప్రపంచం చూడాలంటే పసితనంలో ఒక్కరే వెళ్ళవద్దు, తోడుఎవరైనా ఉండాలని అది తెలుసుకుంది. ✤

# గోండుల భాష గోండీ గురించి ఇటీవల పరిశోధనలు

**గత** ఐదారు సంవత్సరాలుగా న్యూఢిల్లీకి చెందిన వ్రాతప్రతుల జాతీయ సంస్థా, హైదరాబాదుకు చెందిన ప్రాచ్య వ్రాతప్రతుల గ్రంథాలయం, పరిశోధనా కేంద్రం ప్రొఫెసర్ జయధీర్ తిరుమలరావు సమన్వయకర్తగా చేసిన సర్వేక్షణలో గోండి లిపికి సంబంధించిన సమాచారం లభించింది.

జయధీర్ నాయకత్వాన గోండిపై పరిశోధిస్తున్న బృందంలో ఆత్రం భీమారావు, పూని, అర్క మాణిక్యరావు, డా॥ ఎ.కె. ప్రభాకర్, డా॥ జి. మనోజ సభ్యులుగా వున్నారు. ఈ బృందానికి అదిలాబాద్ జిల్లాలోని నార్నే మండలంలోని గుంజాల గ్రామంలో గోండీ భాషలోని వ్రాత ప్రతులు లభించాయి. వాటిని చదవగల్గినవారు ఆ గ్రామంలో నలుగురే వున్నారు. ఇక్కడ లభ్యమైన వ్రాత ప్రతులలో కేవలం అక్షరమాలేగాక, వారి సాహిత్యం, వారి చరిత్ర కూడా లభ్యమైనాయి. ఒక అభివృద్ధి చెందిన భాషకుండే లక్షణాలన్నీ దానికున్నాయి.

గుంజాలా గ్రామంలో లభ్యమైన గోండి లిపి సమగ్రమై, నిర్దుష్టమైన లిపి. ఇది భారతీయ భాషాప్రపంచానికి తెలంగాణ ప్రాంతం ఇచ్చిన బహుమతిగా పరిగణించవచ్చు.

ఇప్పటికే హైదరాబాదులో చదువుకొంటున్న 15మంది గోండు విద్యార్థులు తమ గోండి లిపిని నేర్చుకోవడానికి ముందుకు వచ్చారు. 19 ఫిబ్రవరి 2014న 'ఆంధ్రజ్యోతి'లో గుంజాల గోండీ లిపి, భాషా అధ్యయన వేదికవారు అంతర్జాతీయ తల్లి భాషా దినోత్సవం సందర్భంగా గోండి లిపిని ప్రోత్సహించడానికి గుంజాల(గోండీ) భాషలో పదో తరగతి పిల్లలకు విద్యాపరమైన, భాషాపరమైన సమస్యలపై వ్యాసాల పోటీ ప్రకటించారు. ✤

# మానవ సమాజ పరిణామం

## ప్రాచీన చరిత్ర 15

డా॥ ఆర్కే

## బానిస సమాజంలో ఉత్పత్తి సంబంధాలు

టైగ్రిస్, యుఫ్రేట్స్, నైలు నదీ పరివాహక ప్రాంతాలలో బార్లీ, గోధుమ పొలాలు. ఆ పొలాల మధ్య నాగరికత ఉట్టిపడే నగరాలు. నాగరికతకు తొలి అడుగులు మెసపొటేమియాలోనే పడినాయి. వ్యవసాయం-నీటిపారుదల అందించిన అదనపు ఆహారోత్పత్తి నగరాలకు పునాదుల్ని వేసింది. ఆ పునాదులపైనే విద్యా కుసుమం వికసించింది. శాస్త్ర, సాంకేతికరంగాలు పురోగమించాయి. మేధోశ్రమ అందల మెక్కింది. నగర నాగరికత అందంగా, ఆకర్షణీయంగా కనపడింది. ఇది ఒక పార్శ్వం మాత్రమే.

మరోవైపు నాగరికత వికృత రూపాన్ని చూడగలం. మానవ సమాజంలో మొదటి 'దోపిడీ రూపం' బానిసత్వం, నాగరిక యుగంలోనే ప్రారంభమైంది. బానిసత్వంతోనే సమాజం వర్గాలుగా చీలిపోయింది. బానిస యజమానులు - బానిసలుగా, దోపిడీగాండ్రు - దోపిడీకి గురయ్యేవారుగా మానవ సంబంధాల మధ్య విభజనరేఖ స్పష్టంగా గీయబడింది. ఈ గీతకు ప్రాతిపదిక శ్రమదోపిడి. ఒకరి శ్రమను మరొకరు దోచుకునే బానిసత్వం పునాదులపైనే నాగరికత నిర్మించబడింది.

మెసపొటేమియాలో మొదలైన బానిస వ్యవస్థ క్రమంగా ప్రాచ్య, పశ్చిమదేశాల్లో వేళ్ళూనింది.

### బానిస అంటే ఎవరు?

బానిస ఆస్తిలో ఒక భాగం. ఆస్తి ఎవరో ఒకరికి చెందివుండాలి, గనుక బానిస చట్టరీత్యా మరో మనిషి ఆస్తి. ఉదాహరణకి భూమి, ఆ భూమిలో పనిచేసే బానిస కూడా భూ యజమాని సొంత ఆస్తి క్రిందికి వస్తాడు. ఉత్పత్తిసాధనాలు, ఉత్పత్తిలో పాల్గొనే బానిసలు కూడా ప్రైవేటు యాజమాన్యం క్రింద వుండటం ఒక్క బానిస సమాజంలోనే చూడగలం.

### బానిసత్వం అంటే ఏమిటి?

బానిసత్వం ఒక మనిషి మరొక మనిషిచేత బలవంతంగా పనిచేయించుకొనే చట్టబద్ధమైన దోపిడీ వ్యవస్థ. ఇది బానిస సమాజానికి మాత్రమే గల ప్రత్యేక లక్షణం.

### బానిసత్వం రెండు రకాలు :

**1. వ్యక్తిగత బానిసత్వం :** మెసపొటేమియా రాతి పలకలపై బానిస అంటే 'విదేశీ పురుషుడు' అని రాయబడింది. యుద్ధాలలో ఓడిపోయిన విదేశీయులు ఈ రకానికి చెందుతారు. ఇంటిచాకిరీ, సముద్రయానం, గనుల త్రవ్వకం మొదలైన పనులలో పాల్గొంటారు. ఎలాంటి హక్కులు లేవు. జీవితకాలం బానిస.

**2. ఋణ బానిసత్వం :** పన్నులు, వడ్డీలు కట్టలేక భూముల్ని, పెళ్ళాం బిడ్డల్ని తాకట్టుబెట్టి బానిసలైనవాళ్ళు. రైతులు, చేతివృత్తులవారు ఈ రకానికి చెందుతారు. అప్పు తీరే వరకు యజమానికి పనిచేయాల్సిందే. అధికవడ్డీ వల్ల అప్పు తీరదు.

బానిసల సంఖ్య నిరంతరం పెరగటానికి యుద్ధాలే గాదు, యింకా ఎన్నో మార్గాలలో తలుపులు తెరుచుకున్నాయి.

బానిస వ్యాపారం పెద్దఎత్తున సాగింది. సంతలలో వేలం వేసి అమ్మేవారు. యుద్ధవీరులకు, దేవాలయాలకు బహుమతిగా పంప బడేవారు. వంశపారంపర్యంగా బానిసలైనవాళ్ళు, పోషించలేక అమ్మబడిన వారు, జీవితఖైదీలు, యిలా ఎందరో బానిసత్వంలోకి నెట్టబడ్డారు.

బానిసత్వం మెసపొటేమియా, ఈజిప్టులలో నిలదొక్కుకొని రోమ్‌లో తన విశ్వరూపాన్ని అత్యంత వికృతంగా ప్రదర్శించింది. ఆనాటి ఆర్థిక, సామాజిక జీవన స్రవంతిలో సమ్మిళితమైంది. బానిసత్వాన్ని సహజంగా భావించిన కాలమది. ఏ మేధావి దానిని ప్రశ్నించలేదు. ఏ ప్రభుత్వమూ దానిని నిషేధించలేదు. ఏ మతమూ దానిని వ్యతిరేకించలేదు. అంతేకాదు, బానిస విధానాన్ని చట్టబద్ధం చేసి కఠినంగా అమలుజరిపారు.

## వర్గ విశ్లేషణ

### ప్రధాన వర్గాలు - బానిస యజమానులు, బానిసలు

**బానిస యజమానులు :** భూమి, పశుమందలు, గనులు, లోహాలు, ఇతర ఉత్పత్తి సాధనాలకు యజమానులు. బానిసలు కూడా సొంత ఆస్తిలో ఒక భాగమే. బానిసలు రైతులు, శ్రమించి సృష్టించిన అదనపు ఉత్పత్తే బానిస యజమానుల సంపదలకు మూలం. రైతుల నుంచి కౌళ్ళు, వడ్డీరూపంలో కూడా ఆదాయం వస్తుంది. పితృస్వామిక వ్యవస్థ కనుక తండ్రి ఆస్తి మగ సంతానానికి వారసత్వ హక్కుగా బదిలీ అవుతుంది. బానిస యజమానులే పాలకవర్గం, దోపిడీవర్గం.

**బానిసలు :** ఉత్పత్తి సాధనాలకు దూరం చేయబడినవారు. వారికి శ్రమే జీవనాధారం. కనీస మానవహక్కులు లేవు. 'సామాజికంగా చనిపోయిన వ్యక్తులు'. జీవితకాలం యజమాని కోసం పనిచేయాలి. పారిపోవటం నేరం. భార్య, పుట్టిన పిల్లలు కూడ బానిసలే. పనిచేసినంత కాలం ఎద్దును, గుర్రాన్ని మేపుతాం. అది మేతకు మినహా పనికిరాదు అనుకొంటే చంపేస్తాం. ముసలి బానిస బ్రతుకు కూడా అంతే. పశువులో పశువు. అమ్మకానికో సరుకు. వారసత్వపు ఆస్తి. సామాన్యులు - పాత గణవ్యవస్థనుండి వచ్చిన రైతులు, పశుపోషకులు, చేతివృత్తులవారు. ఉత్పత్తి పనులలో ప్రధానంగా పాల్గొంటారు. రైతులు కొద్దిపాటి భూమి, పశువులు కల్గివుండి తాము తినగా మిగిలింది మారకం చేసుకుంటారు. చేతివృత్తులవారు మారకం కోసమే ఉత్పత్తిచేస్తారు. ముడిసరుకులు, పనిముట్లు, విత్తనాల కోసం బానిస యజమానులపై ఆధారపడి వుంటారు. కొన్ని దేశాలలో భూమి పూర్తిగా దేవుడు లేదా రాజవంశీయులదే. రైతులు జీవితకాలం కౌలుదార్లుగా వుంటారు. చాలీచాలని బ్రతుకుతో అప్పులపాలై పన్నులు, వడ్డీలు, కౌళ్లు చెల్లించలేక బానిససంఖ్యని నిరంతరం పెంచే బడుగుజీవులు.

**పూజారులు :** ఉత్పత్తితో ఎలాంటి సంబంధమూలేని పరాన్నజీవులు. పాలకవర్గంలో భాగంగా వుంటారు. దేవాలయాలలో ప్రధానపాత్ర వీరిదే. బానిస యజమానుల దోపిడీకి ఆధ్యాత్మిక రంగు పులిమి ప్రజల్ని మానసికంగా బానిసల్ని చేయటమే వీరి ప్రధాన వృత్తి.

**వ్యాపారులు :** ఉత్పత్తిదారులకు, కొనుగోలుదారులకు మధ్య దళారీలుగా వుండి ఇద్దర్నీ దోపిడీ చేస్తారు. పాలకవర్గాలతో స్నేహంగా వుంటారు.

ఉద్యోగులు, శిల్పులు, రాతపనివాళ్లు, నావికులు మొదలైనవారు క్రింది తరగతికే చెందినవారు. కాని బానిస యజమానుల, పూజారుల ఆజ్ఞలకు లోబడి వుంటారు.

వర్గాలుగా విడిపోయిన బానిస వ్యవస్థలో ఉత్పత్తి సాధనాలు బానిస యజమానుల ప్రైవేటు యాజమాన్యంలో వున్నాయి. మెజార్టీ ప్రజలు వారికి దూరం చేయబడినారు. శ్రమ ఒకరిది. సంపద మరొకరిది. కష్టం ఒకరిది. సౌఖ్యం మరొకరిది. ప్రధాన వర్గాలయిన బానిస యజమానులు - బానిసల మధ్య ఐక్యత - ఘర్షణ వుంది. ఒకరు లేకుండా మరొకరు లేరు. పరస్పర విరుద్ధ ప్రయోజనాలున్న ఈ వర్గాల మధ్య ఐక్యత తాత్కాలికం. ఘర్షణ శాశ్వతం. ఈ శత్రుత్వ వైరుధ్యాన్ని పరిష్కరించటానికి ఓ యంత్రాంగం కావాలి. అదే రాజ్యాంగ యంత్రం.

## రాజ్యాంగ యంత్రం

'చెరువు నిండా నీళ్ళున్నాయి. చుట్టూ గట్టుంది. గట్టే లేకపోతే..... ప్రభుత్వం కూడా గట్టులాంటిదే'

'చేనుకు కంచె ఎంతో, ప్రజలకు పోలీసులు అంతే'.

'చట్టం ముందు అందరూ సమానులే'.

'చట్టం తన పని తాను చేసుకుపోతుంది'.

'రాజ్యాంగం పరమ పవిత్రమైనది. అది దైవమిచ్చిన ప్రసాదం. అనాదిగా మానవసమాజం పుట్టిన నాటి నుండి వుంది'.

'రాజు దైవాంశ సంభూతుడు. దేవుడి ప్రతినిధి'.

'ప్రజల యొక్క ప్రజల చేత, ప్రజల కోసం ప్రభుత్వం'.

తెలిసో తెలియకో కొందరు, బుద్ధిపూర్వకంగానే మరికొందరు రాజ్యాంగ యంత్రంపై సృష్టించిన గందరగోళం, వక్రీకరణ మరే సమస్యపైన సృష్టించలేదని చెప్పవచ్చు. శరీరానికి గుండె ఎంత ముఖ్యమో, వర్గ సమాజానికి రాజ్యాంగ యంత్రం అంతే ముఖ్యం. పాలకవర్గాల మనుగడకు రాజ్యాధికారమే మూలం. అందుకే సొంత ఆస్తిని, వర్గ వ్యవస్థని సమర్థించే ఏ మేధావీ రాజ్యాంగ యంత్రం గురించి నిజం చెప్పడు. చెప్పబోడు. **'కుటుంబం, వ్యక్తిగత ఆస్తి, రాజ్యాంగ యంత్రాల పుట్టుక'** అనే మహత్తర గ్రంథంలో ఫ్రెడరిక్ ఏంగెల్స్ రాజ్యాంగ యంత్రాల పుట్టు పూర్వోత్తరాల గుట్టు విప్పి, సామాజిక, ఆర్థిక, చారిత్రక నేపథ్యాన్ని మన ముందుంచాడు.

### 'రాజ్యాంగ యంత్రం' అంటే ఏమిటి?

ఒక నిర్దిష్ట భూభాగంలోని ప్రజలను పాలించే ప్రభుత్వం, దాని నిర్వహణలోని నిరంకుశ ఉద్యోగవర్గం, పోలీసు, సైన్యం, కోర్టులు, జైళ్ళు, అన్నిటిని కలిపి రాజ్యాంగయంత్రం అంటారు. ఏ ఒక్కటీ విడివిడిగా రాజ్యాంగ యంత్రం కాజాలదు.

ఒక క్రమ పద్ధతి ప్రకారం బలాన్ని ప్రయోగించి ప్రజల్ని అణచివుంచే ఒక ప్రత్యేక యంత్రాంగమే రాజ్యాంగ యంత్రం.

### రాజ్యాంగ యంత్రం ఆది నుండీ వుందా?

రాజ్యాంగ యంత్రం లేని కాలం ఒకటి వుండేది. అది రాతియుగంలో గణతంత్ర వ్యవస్థ వర్ధిల్లిన కాలం. సొంత ఆస్తి, శ్రమదోపిడీ, వర్గాలు లేని కాలం. ఆ కాలంలో ప్రభుత్వం, సైన్యం, పోలీసులు, కోర్టులు, జైళ్లు ఏవీలేవు. రక్తసంబంధీకులైన గణమే సర్వస్వం. ప్రజాస్వామ్య పద్ధతిలో గణసమితికి నాయకుల్ని ఎన్నుకొనేవారు లేదా తొలగించేవారు. నాయకుల అధికారం నైతికమైనది, సహజమైనది. ఆచారాలు, సంప్రదాయాలు, ఏకాభిప్రాయంతో సంక్రమించినది. ఆజ్ఞలకు, ఆధిపత్యానికి చోటులేదు. అందరికీ ఆయుధాలుండేవి. అంతరంగిక తగాదాలను గణసమితి ద్వారా పరిష్కరించుకొనేవారు.

### వర్గాలు, దోపిడీ లేని గణవ్యవస్థలో రాజ్యాంగ యంత్రం ఎందుకు లేకపోయింది?

ఆదిమ గణవ్యవస్థలో ఉత్పత్తి అతి హీనస్థాయిలో వుండేది. అదనపు ఉత్పత్తి లేదు. దానిని దోపిడీచేసే ప్రత్యేక వర్గమూ లేదు. అందరూ కలిసి కష్టపడేవారు. సమంగా పంచుకొనేవారు. స్వతంత్రులు. సమాన హక్కులు కలిగివుండేవారు. అలాంటి వ్యవస్థలో రాజ్యాంగయంత్రం అవసరంలేదు కదా, ఊహించనూలేము.

### రాజ్యాంగ యంత్రం ఎందుకు పుట్టింది?

పితృస్వామ్యం, సొంత ఆస్తి, బానిసత్వంతో శ్రమదోపిడీ ప్రారంభమై మానవసమాజంలో తొలివర్గ విభజన వచ్చింది. ఉత్పత్తి సాధనాలపై ప్రైవేటు యాజమాన్యం ఏర్పడింది. బానిస వ్యవస్థకు, రాజరికానికి పునాది పడింది. ఈ పునాదిని బలపరచటానికి ఉపరి నిర్మాణంలో పెనుమార్పులు సంభవించాయి. కొత్త భావాలు, కొత్త ఆలోచనలు, కొత్త జీవన విధానంతో సామాజిక దృక్పథమే మారింది. ఈ మార్పును శాశ్వతంగా కొనసాగించేందుకు రాజ్యాంగ యంత్రం పుట్టిందని ఏంగెల్స్ చెప్పాడు.

"సంగ్రహంగా చెప్పాలంటే సంపదలకు మెప్పు లభించింది. ధనం సర్వసామాన్యం అయింది. సంపదలను బలాత్కారంగా దోచుకొనేందుకు వెనుకటి గణసంఘ అంగాలనే వుపయోగించుకొన్నారు. అప్పటికున్న లోపం ఒక్కటే. గణ సంఘంలోని సామూహిక పద్ధతులకు వ్యతిరేకంగా వ్యక్తులు పోగుచేసుకున్న ఈ కొత్త సంపదలను కాపాడే వ్యవస్థ కావాలి. గతంలో ఎంతో చులకనగా చూసే వ్యక్తిగత ఆస్తిని పవిత్రమైనదిగా స్థిరపరచాలి. ఆ పవిత్రతను కాపాడటమే మానవసమాజం యొక్క ప్రధాన గమ్యంగా ప్రకటించాలి. అంతే కాదు కూడ. ఆస్తులు సంపాదించేటందుకు అనుసరిస్తున్న నవీన పద్ధతులకు, సంపదల నిరంతరాభివృద్ధికి సమాజం యొక్క ఆమోదం లభించాలి. సమాజంలో కొత్తగా తలయెత్తుతున్న వర్గవిభజనే కాకుండా, ఆస్తిపరుల వర్గం, ఆస్తిలేని వర్గాలను దోచుకొని పాలించే హక్కును కూడా శాశ్వతంగా సాగనిచ్చే సంస్థ కావాలి. ఆ మాదిరి సంస్థ ఏర్పడింది. రాజ్యాంగం సృష్టించబడింది" (ఏంగెల్స్)

రాజ్యాంగ యంత్రం ఎందుకు పుట్టిందో లెనిన్ స్పష్టంగా వివరించి చెప్పాడు.

"ఎప్పుడైతే సమాజంలో మొట్టమొదటి సారిగా వర్గవిభజన ఏర్పడిందో, ఎప్పుడైతే బానిసత్వం తలయెత్తిందో, ఎప్పుడైతే వ్యావసాయిక శ్రమ యొక్క అతి మోటైన రూపాలను కేంద్రీకరించడం వల్ల ఒక ప్రత్యేకవర్గానికి చెందినవారు కొంత అదనపు ఉత్పత్తి చేయగలిగారో, ఎప్పుడైతే బానిస యొక్క నికృష్ట జీవనానికి ఆ అదనపు ఉత్పత్తి తప్పనిసరిగా అవసరం లేకపోయిన కారణంగా బానిస యజమానికి హస్తగతం అయేదో, అప్పుడు బానిస యజమానుల వర్గం యేర్పడి వేళ్ళూని దృఢంగా పాతుకుపోయింది. ఆ విధంగా ఆ వర్గం వేళ్ళూని దృఢంగా పాతుకుపోవటానికే రాజ్యాంగ యంత్రం ఆవిర్భవించి తీరవలసిన అవసరం కలిగింది".

వ్యవసాయం, శాస్త్రీయ, సాంకేతికరంగాలలో అభివృద్ధి అదనపు ఉత్పత్తిని సృష్టించింది. బానిసలు, బానిస యజమానులుగా చీలిన వర్గసమాజంలో ఈ అదనపు ఉత్పత్తి పంపకం కీలక సమస్య అయింది. ఉత్పత్తి సాధనాలు బానిస యజమానులవి. శ్రమ బానిసలది, రైతులది. పరస్పర విరుద్ధ ప్రయోజనాలున్న ప్రధానవర్గాల మధ్య శత్రుత్వ వైరుధ్యం

అనివార్యం. శ్రమ సృష్టించిన అదనపు ఉత్పత్తిని దోపిడీ వర్గాలకు చేరవేయాలి. ఇది ఐచ్ఛికంగా జరగదు. బలవంతంగా అమలుపరిచే యంత్రాంగం కావాలి. అందుకే రాజ్యాంగ యంత్రం పుట్టింది.

అందువల్ల రాజ్యాంగ యంత్రం దేవుడు ప్రసాదించిన పరమ పవిత్ర పత్రం గాదు. సమాజానికి రక్షణ యిచ్చే కాపలాదారు కాదు. మానవసమాజ పరిణామంలో గణవ్యవస్థ పతనమై, వర్గాలు ఏర్పడిన ఒక ప్రత్యేకదశలో రాజ్యాంగ యంత్రం పుట్టింది. ఒక వర్గం మరొక వర్గాన్ని అణచివుంచే ప్రత్యేకసాధనమే రాజ్యాంగ యంత్రం. రాజీలేని వర్గపోరాటాల పరిష్కార ఫలితమే రాజ్యాంగ యంత్రం.

రాజ్యాంగ యంత్రానికి ఉత్పత్తితో ఎలాంటి సంబంధమూలేదు. ఉత్పత్తి సంబంధాల పునాదిని రక్షించటానికి బలపరచటానికి ఉపరి నిర్మాణంలో ఏర్పడిన ఒక అంగం. పాలకవర్గాలకు ప్రాతినిధ్యంవహించే ప్రత్యేక వ్యక్తుల బృందమే ప్రభుత్వం. పరిపాలన కోసమే పుట్టిన ప్రత్యేక యంత్రాంగం.

గణ వ్యవస్థ అంగాలు క్రమంగా తొలగింపబడ్డాయి. రాజ్యాంగ యంత్రం ఇనుప కోరలు ఒక్కొక్కటీ వచ్చి చేరాయి. ఈ యంత్రంలో అత్యంత కీలకమైనది ఆయుధాలు. గణవ్యవస్థని, రాజ్య వ్యవస్థని వేరుపరిచే ప్రధాన అంశం యిదే.

గణ వ్యవస్థలో అందరూ సమానులే, సాయుధులే. గణం కోసం, తెగ కోసం యువతీ, యువకులంతా సమష్టిగా పోరాడుతారు. ప్రజలకు దూరంగా ప్రత్యేక సాయుధ బలగాలుండవు. రాజ్యవ్యవస్థలో పాలకులు, పాలితులుగా వర్గవిభజన వచ్చింది. శ్రమదోపిడీపై ఆధారపడిన వర్గ వ్యవస్థలో పాలితుల నుంచి పాలకులకు రక్షణ కావాలి. కనుక ఆయుధాలు పాలకవర్గం చేతిలోనే వుండాలి.వర్గవ్యవస్థలో ప్రభుత్వమంటే వర్గ ప్రభుత్వమే, అంతిమ పరిశీలనలో సాయుధ బలగమే.

సాయుధ బలగాలలో అతి ముఖ్యమైనది సైన్యం. సైన్యంలేని రాజ్యం వుండదు. అది అధికార కేంద్రం అదుపాజ్ఞలలో వుంటుంది. సరిహద్దుల రక్షణ, విదేశీ దండయాత్రలు, అంతరంగిక విప్లవాల అణచివేతలో ప్రధానపాత్ర పోషిస్తుంది. పాలకవర్గం తన మనుగడ కోసం సైన్యాన్ని నిరంతరం ఆధునీకరణ చేస్తుంది. సాయుధ బలగాలలో రెండవది రక్షకభటులు. రోజువారీ శాంతి భద్రతలను కాపాడుతుంటారు. ప్రజల అసంతృప్తిని, తిరుగుబాట్లను అదుపులో వుంచుతారు.

రాజ్యాంగ యంత్రంలో మరో కీలకాంశం 'న్యాయం'. న్యాయం ఆకాశం నుండి వూడిపడిన బ్రహ్మపదార్థం కాదు. కాలానికి, సమాజానికి అతీతమైనది కాదు. సొంత ఆస్తి లేని గణవ్యవస్థలో సామాజిక న్యాయానికి భిన్నంగా సొంత న్యాయం వుండదు. ప్రతి గణ సభ్యుడి ప్రయోజనమూ సామాజిక ప్రయోజనంలో భాగంగానే వుంటుంది. సొంత ఆస్తి రావటంతో న్యాయానికి అర్థం మారింది. ఆస్తి గలవాడి వైపే త్రాసు మొగ్గింది. వర్గన్యాయం అమలులోకి వచ్చింది. అందరికీ న్యాయం ఎండమావి అయింది. పులికి, మేకకు సమన్యాయం వుండదు.

రాజ్యాంగ యంత్రంలో భాగంగా వుండే 'న్యాయం' కూడ ఉపరి నిర్మాణంలో ఒక అంగమే. ఆర్థిక పునాదికనుగుణంగానే వుంటుంది. పునాది మారినపుడు న్యాయానికి అర్థం కూడా మారుతుంది.

గణవ్యవస్థలో సొంత ఆస్తి నేరం. బానిస వ్యవస్థలో అది న్యాయం. గణ సమితి గణ సభ్యులందరి ప్రాణాలకు పూచీ పడుతుంది. బానిస సమాజంలో బానిసను చంపినా నేరంకాదు. 'న్యాయం' వ్యవస్థతో ముడిపడి వుంటుంది.

రాత నేర్చుకున్నాకే రాజ్యాంగ శాసనాలు అక్షరరూపం ధరించాయి. వర్గసమాజంలోనే శాసనాలు రాయబడినాయి. రాజ్యాంగ చట్టమనేది ప్రశ్నించగూడని పరమ పవిత్ర పత్రంగాదు. పాలకవర్గాలు తమ ప్రయోజనాలు కాపాడుకోవటానికి రాసుకున్న దస్తావేజు. ఒక వర్గం మరొక వర్గాన్ని అణచివుంచే అధికార ముద్ర. రాజ్యాంగాన్ని ఉల్లంఘించగూడదని పాఠాలు చెప్పే పాలకవర్గాలే, ప్రతికూల పరిస్థితులలో దానికి తూట్లు పొడవటం, మార్పులు, చేర్పులు చేయటం అసాధారణం కాదు.

చట్టాలకు భాష్యాలు చెప్పటానికే న్యాయస్థానాలు, అమలు చేయటానికే చెరసాలలు, ఉరికొయ్యలు, ఇతర నిర్బంధ విధానాలు.

పాలకవర్గాలు సాయుధ బలగాల్ని పోషించాలి. కొత్త కొత్త ఆయుధాలను సమకూర్చుకోవాలి. దోపిడీ వర్గాల అవసరాల కోసం రక్షణ, రవాణా, ఇరిగేషన్ తదితర మౌలిక వసతులను కలుగచేయాలి. పాలకులెవరూ ప్రభుత్వ ఖర్చును భరించరు. ప్రజల నుంచి పన్నులు వసూలు చేస్తారు. ప్రభుత్వ ఖొక్కసాలన్నీ ప్రజల సొమ్ములే. పన్నులు వసూలు చేయటానికి ప్రత్యేక యంత్రాంగము వుంటుంది. నిరంకుశ అధికారవర్గం అన్ని పనులను పర్యవేక్షిస్తుంది. ప్రజల కష్టార్జితమైన అదనపు ఉత్పత్తిపైనే రాజ్యాంగయంత్రం నిర్మింపబడుతుంది.

రాజ్యాంగ యంత్రం ఆయా దేశ, కాల పరిస్థితుల కనుగుణంగా రకరకాల రూపాల్ని సంతరించుకుంది. రాచరికంగా, రిపబ్లిక్‌గా అవతరించింది. ప్రభుత్వవర్గ పాలనగా, ప్రజాస్వామ్య పాలనగా కొనసాగింది. ఈ రూపాలన్నీ బానిసవ్యవస్థలోనే ప్రారంభమైనాయి.

రాచరికం అంటే వంశపారంపర్యంగా సాగే ఏక వ్యక్తి పాలన. రిపబ్లిక్ అంటే ఏదోవిధంగా ఎన్నిక పద్ధతిలో అధికారంలోకి రావటం. ప్రభువర్గపాలన అంటే కొద్దిమంది గ్రూపుగా అధికారం చలాయించడం. ప్రజాస్వామ్యమంటే ప్రజలందరికి అధికారం. అందరూ, అంటే బానిస యజమానులందరూ. వారు మాత్రమే ఎన్నికలలో పాల్గొంటారు.

బానిససమాజంలో ఏ రాజ్యాంగ యంత్రమూ బానిసల్ని మనుషులుగా గుర్తించదు. బానిసను చంపినా, ఏ చట్టమూ నేరంగా ఒప్పుకోదు. బానిస యజమానులు మాత్రం పూర్తి పౌరహక్కుల్ని అనుభవించుతారు. రాచరికమైనా, రిపబ్లిక్ అయినా సారంలో ఒక్కటే. ఏ పాత్రవేసినా, ఏ వేషం ధరించినా అన్నీ బానిస రాజ్యాంగయంత్రానికి ముసుగులే.

బానిసత్వం మొదటి దోపిడీ రూపం. బానిసల ప్రతిఘటనని అణచివేసేందుకే బానిస రాజ్యాంగ యంత్రం పుట్టింది. ఫ్యూడల్ సమాజంలో దాసత్వం మరో దోపిడీ రూపం. రైతుల్ని, అర్ధబానిసల్ని భూమికి దాసుల్ని చేశారు. కౌలు, కూలీ రూపంలో దోపిడీ చేశారు. రైతాంగ తిరుగుబాట్లను అణచివేసేందుకే ఫ్యూడల్ రాజ్యాంగ యంత్రం పుట్టింది పెట్టుబడిదారీసమాజంలో కార్మికుల్ని యంత్రాలకు బానిసల్ని చేశారు. శ్రమదోపిడీని కాలానికి ముడిపెట్టారు. అంతులేని అదనపు ఉత్పత్తిని సృష్టించారు. కార్మికుల సమ్మెల్ని, విప్లవాల్ని అణచివేసేందుకు పెట్టుబడిదారీ రాజ్యాంగ యంత్రం పుట్టింది. అందువల్ల రాజ్యాంగ యంత్రానికి కూడ చారిత్రక నేపథ్యం వుంది.

పెట్టుబడిదారీ విధానంలోని ప్రజాస్వామ్య రిపబ్లిక్ రాజ్యాంగ యంత్రం యొక్క అత్యున్నత రూపం. సార్వజనీన ఓటింగ్ పేరుతో పెట్టుబడిదారీ దోపిడీని, నియంతృత్వాన్ని కప్పిపుచ్చే అందమైన అబద్ధం, 'ప్రజల యొక్క ప్రజల చేత, ప్రజల కొరకు, ఎన్నుకోబడిన ప్రభుత్వం

అని చెప్పే ప్రజాస్వామ్య సిద్ధాంతవేత్తలు ప్రజలంటే ఎవరనే ప్రశ్నకు జవాబు చెప్పరు. ప్రజలలో ఆస్తి గల వర్గాలు, ఆస్తిలేని వర్గాలున్నాయని, ఎన్నికలలో ధనం, కులం ప్రధాన పాత్ర వహిస్తాయని ఒప్పుకోరు, ఒకవేళ ఆస్తిలేని వర్గాలు అధికారంలోకి వచ్చినా, పాత చట్టాల పరిధిలోనే పనిచేయాల్సి వుంటుందనేది నిగూఢసత్యం. చట్టాల కనుగుణంగానే కొన్ని సంస్కరణలు చేపట్టినా, ఆస్తిగల వర్గాల ఆగ్రహానికి, ఉచకోతకు గురికావాల్సి వస్తుందనేది చరిత్ర నేర్పిన పాఠం.

పెట్టుబడిదారీ దేశాలలోని ఎన్నికలపై ఎంగెల్స్ "సార్వజనిక వోటు హక్కు శ్రామికవర్గం యొక్క పరిణితిని కొలిచే సాధనం అవుతుంది. ఆధునిక రాజ్యాంగంలో అది చెయ్యగలదంతే. అంతకంటే చెయ్యలేదు, చెయ్యదు. అయితే అదే చాలు ధర్మామీటరు లాగ సార్వజనిక వోటు హక్కు కార్మికులలో పొంగులు వారే దశను" చూపిస్తుంది.

ఏ రాజ్యాంగ యంత్రంలో ఉత్పత్తి సాధనాలు ప్రైవేటు యాజమాన్యంలో వుంటాయో, ఆ రాజ్యాంగ యంత్రం ఎంత ప్రజాస్వామికంగా కనపడినప్పటికీ, అది కార్మికవర్గాన్ని, పేద రైతాంగాన్ని అణచివుంచే పెట్టుబడిదారీ రాజ్యాంగ యంత్రమే అవుతుంది. అది ఎంత ప్రజాస్వామికంగా వుండే, పెట్టుబడిదారీ విధానం యొక్క పాలన అంత మొరటుగాను, అంత నిర్దాక్షిణ్యంగానూ వుంటుంది.

రాజ్యాంగం అందరిదీ అనేది బూటకం. దోపిడీ వున్నంతకాలం సమానత్వం వుండదు. బానిస యజమాని - బానిస, భూస్వామ్య - రైతు, పెట్టుబడిదారుడు - కార్మికుడు ఎన్నటికి సమానం కాజాలరు. పులి - మేక సహజీవనం చేయలేవు.

వర్గవిభజనతో పుట్టిన రాజ్యాంగ యంత్రం వర్గాలున్నంతకాలం వుండి తీరుతుంది. ఒక వర్గం మరో వర్గాన్ని నిర్బంధంగా అణచివుంచే సాయుధ పనిముట్టే రాజ్యాంగ యంత్రం. ఒక మైనారిటీ వర్గం మెజారిటీ ప్రజల శ్రమను దోపిడీ చేయటానికే రాజ్యాంగ యంత్రం, ప్రతిఘటించిన పీడిత ప్రజల్ని అణచివేసే ఉక్కుపాదమే రాజ్యాంగ యంత్రం. ✤

కవిత

## నువ్వూ నేనూ...వాడు... - ఓవివియస్ రామకృష్ణ

**నువ్వూ** నేనూ వృక్ష ప్రేమికులం
శాఖోపశాఖలుగా చీలినా చీలకున్నా
తెలుసు మనకు...వృక్షాలన్నీ ఏకకాండ వృక్షాలేనని
ఏకకాండ సత్తువతోనే కదా...చెట్టు
కొమ్మలు కొమ్మలుగా వ్యాపిస్తుంది
తూరుపు గాలికి కొమ్మలు పరవశిస్తే
మనమూ తలలూపుతాం
పడమటిగాలికి పక్కలు వేసే
కొమ్మలను తెగనరుకుతాం
వెర్రితలల్ని నరికి చెట్టుని కాపాడడంకాక
కాండం చీల్చడమే ఆదర్శమంటూ...
అరణ్యాలను త్రుంచి
బాల్కనీలలో బోన్సాయ్ వృక్షాలను పెంచాలనే
వాడి వృక్షశాస్త్రాలను చదవలేము మనం
మట్టి చేతులు దాపి
విత్తులలో వృక్షాలను కాపాడుతాం
వృక్ష సమూహాలలో
కొమ్మల రెమ్మల బ్రతుకుల పాటలమౌతాం

నువ్వూ నేనూ నదిని ఆరాధిస్తాం
ఒకానొక బిందువు వద్ద ఊటెత్తిన నీటిజాలు కాదు...నది
తూగుల వాగులై, జలసవ్వడుల సెలయేళ్ళై కలిసి...
మురిసి ఒరిసి పెరిగిన ప్రవాహగానమే నది
ఎన్ని చాపాలనైనా గీయనీ...
ఎన్ని పాయలైనా పారనీ...
పుడమి దాహార్తిని తీర్చేందుకు
పచ్చగా పంటలు అల్లుకుపోయేందుకు
నీటిని ఎక్కడా విడిపోయి, విచ్చిపోవద్దని ఎందుకు కోరతాం?!...
దాహంతో అంగలార్చే నోళ్ళకు నీటిమీటర్ల తాళాలు పెట్టే
కొక్కోకోలాల, బాక్సైట్ రిఫైనరీల...
బందెల దొడ్లో మదుగులు పేర్చే
నయా భగీరధుల నగిషీ కళలు
పగటికలలో...పీడకలలో కాదు మొర్రో...
ఇది రక్తకన్నీటి చేదునిజమని మొత్తుకుంటాం
తానే రేకెత్తించిన జన తరంగిణులనాస్వాదిస్తూ
పడక గదుల్లో తడిగుడ్డలు సిద్ధం చేసుకుంటున్న
వాడి గొంతు పట్టుకుంటాం

నువ్వూ నేనూ నేలను వలచాం
నెర్రెలు నెర్రెలుగా నేల విచ్చిపోరాదని
నెర్రెలలో మొలిచే గోడలు ఎన్నటికీ కవచాలు కాలేవని
ధరణితల్లి సాక్షిగా పెనుగులాడుతూనే వుంటాం
మీ పెనుగులాటలు ఔట్‌డేటెడ్ అని
మీ ఆదర్శం మట్టి పాలని
శకలాల చిత్రపటాలతో గోడమీది మూడోవాడు
ఖండాలలో అఖండం చూడమంటూ
పవర్‌పాయింట్ ప్రజంటేషన్లనిస్తూ
ప్రపంచ కుగ్రామాన్ని గురించి ప్రబోధాలనిస్తాడు
వాడి ప్రయోజనాల కరచాలనాలకు
మనం తహతహలాడుతూ లొంగిపోవాలనుకుంటాడు

నిజమే మనమిద్దరం పరస్పర ప్రేమికులం
ఏ కొమ్మపై ఎవరమున్నా
మాతృమూలం దుల్లిపోతున్న
ఒకానొక చెట్టుపైననే మనమంతా
వాడు పిండేసుకుంటూ ఎండగడుతున్న నదులలో
వాడే మొలిపిస్తున్న గోడలకు
ఇవతల నేను...అవతల నువ్వు
వాడి పిడికిట్లో సమాధిఔతున్నది...మనమట్టే...

*(2013 డిసెంబరు సంచికలోని పాపినేని శివశంకర్ కవితకు ప్రతిస్పందిస్తూ...)* ✤

# సింక్లైర్ (1878-1968)

ముగింపు : ముక్తవరం పార్థసారథి

**అప్టన్** సింక్లేర్ జీవితాన్ని గ్రంథస్థం చెయ్యటానికుపక్రమించిన లియోన్ హారిన్ తనెంచుకున్న గురుతరమైన బాధ్యతను యిలా వివరించాడు.

"ఒక ఇండియానా యూనివర్శిటీలోని లిలీ లైబ్రరీలోనే సింక్లెయిర్‌కు సంబంధించి తొమ్మిది టన్నుల సమాచారం ఉన్నది. ఆయన రాసిన వేలాది వ్యాసాలు, పుస్తక సమీక్షలు, సంపాదకులకు లేఖలు, తొంభై పుస్తకాలు (ఆర్థిక శాస్త్రం నుండి ఆధ్యాత్మిక విషయాలదాకా, మద్యసేవనం నుండి మత విషయాలదాకా రాయని సబ్జెక్టులేదు) కాక కృప్స్కయా (లెనిన్ భార్య) కెన్నెడీ, మెంకెన్, థామస్ మాన్, మాక్సింగోర్కీ గాంధీ, ట్రాట్స్కీ, బెర్నార్డ్‌షా, యిద్దరు రూజ్‌వెల్టులు (ఫ్రాంక్లిన్, థియోడోర్) మొదలైన వాళ్ళతో జరిపిన ఉత్తర ప్రత్యుత్తరాల సంఖ్య 2,50,000. గంటకు అరవై పుస్తకాల చొప్పున రోజుకు ఎనిమిది గంటలు చదివినా, కేవలం ఉత్తరాలకే అయిదు వందల రోజులు పడుతుంది.

గత శతాబ్ది ప్రారంభంలో సోషలిస్టు భావాలను ప్రచారం చేసిన వాళ్ళలో సింక్లెయిర్ ముఖ్యుడు.

1905దాకా, అంటే సింక్లెయిర్‌కు 27 ఏళ్ళు వచ్చిందాకా అతడి పేరు పాఠకులకు తెలియదు. ఆ తరువాత నలభైఏళ్ళు అమెరికన్ రాజకీయ, సాంస్కృతిక, సాహిత్య జీవితాన్ని శాసించాడు. 1968లో మరణించే నాటికి అతడి పేరు పాఠకులు మరచిపోయారు.

అప్టన్ సింక్లెయిర్ 1905లో న్యూయార్కులో ఇంటర్ కాలేజియేట్ సోషలిస్టు సొసైటీ స్థాపించాడు. జాక్ లండన్ అధ్యక్షుడూ, తను ఉపాధ్యక్షుడూ, అదే సంవత్సరం బీఫ్ ప్యాకింగ్ పరిశ్రమలోని అనారోగ్య పరిస్థితుల్ని ఎండగడుతూ రాసిన ప్రముఖ నవల (విమర్శకుల దృష్టిలో అతడి రచనల్లో కల్లా బెస్ట్) 'ది జంగిల్' ప్రచురించాడు. దీన్ని గురించి బెర్నార్డ్‌షా "తమ స్వార్థ ప్రయోజనాల కోసం పెట్టుబడిదార్లు ఎంతటి దారుణాలకైనా వెనుదీయరని నిరూపించిన పుస్తకం" అన్నాడు.

వాల్‌స్ట్రీట్‌లోని స్టాక్ మార్కెట్ కుంభకోణాల్ని వెలికి తీసిన నవల 'ది మనీ చేంజర్స్' 1908లో వెలుగు చూసింది. ఆనాటి ధనిక పారిశ్రామికవేత్తలు ప్రజల్ని మోసం చేసిన పద్ధతుల్ని బహిర్గతం చేసినందుకు సింక్లెయిర్‌ను మక్ రేకర్ (దుమ్మురేపేవాడో, బురద చల్లేవాడో అని అర్థం) అన్నారు. బిచ్ గాడెస్ ఆఫ్ సక్సెస్‌ని ఆరాధించే అమెరికన్ జీవన సరళి మారాలని సింక్లెయిర్ ఆకాంక్ష, సామాజిక న్యాయం అతడి ఉద్యమానికి స్ఫూర్తి.

సింక్లెయిర్ రచనల్లో 'అభిప్రాయాలెక్కువ. పాత్రోచిత చిత్రణ తక్కువ' అని ఒక ఆరోపణ ఉంది. బహుశా ఈ లక్షణమే సాహితీ విలువలు తగ్గినా, ప్రచార గుణం పెరిగి సామాజిక పరిస్థితుల మార్పుకు సహాయం చేసింది.

ఆది నించీ, ప్రపంచంలో సామాజిక దురన్యాయాలకు వ్యతిరేకంగా పలికిన నిరసనల సంకలనమే "ది క్రై ఫర్ జస్టిస్" (1915). ఈ పుస్తకానికి జాక్ లండన్ ఉపోద్ఘాతం రాశాడు. అనేక సిద్ధాంత గ్రంథాలకన్నా, యువకులు సోషలిస్టులు కావటానికి ఈ పుస్తకం ఎక్కువ సహాయపడింది" అంటూ వ్యాఖ్యానించాడు జాన్ రీడ్.

మొదటి ప్రపంచ యుద్ధం తర్వాత అమెరికాలో సోషలిస్టు ఉద్యమ ప్రభావం క్షీణించింది. రష్యన్ విప్లవం సింక్లెయిర్‌లో సందేహాలు లేవనెత్తినప్పుడు, అవును విప్లవం మేధావుల కోసం కాదు. పీడిత, శ్రామిక, కర్షక వర్గం కోసం అంటూ జాన్ రీడ్ మార్గనిర్దేశం చేశాడు. (ఆ తర్వాత కొద్ది రోజులకే ముప్ఫై మూడేళ్ళు నిండని జాన్‌రీడ్ క్రెమ్లిన్‌లో మరణించాడు. అక్కడే అతణ్ణి సమాధి చేశారు)

అప్టన్ సింక్లెయిర్ మరో ముఖ్యరచన 'ది బ్రాస్ చెక్' (1919). అది డబ్బుకూ, ప్రలోభాలకూ అమ్ముడుపోయిన అమెరికన్ పత్రికల గురించి.

"సింక్లెయిర్ ఎంత విమర్శించినా పత్రికా ప్రపంచం బాగుపడటం కల్ల. ఎందుకంటే పత్రికలన్నీ ఊసరవెల్లులే. రంగులు మార్చటం వాటి సహజ లక్షణం" అన్నాడు హెచ్.ఎల్.మెంకెన్.

ప్రెస్సు తర్వాత, అమ్ముడుపోయిన రచయితల, కళాకారుల గురించి తపన మొదలైంది సింక్లెయిర్‌లో. 'మామనార్ట్' (Mammon Art డబ్బు కళ లేదా డబ్బుకు దాసోహమన్న కళ) 1925లో వెలువడింది. "ఆది నుండి తన తరందాక పాశ్చాత్య సాహిత్య, కళా పరిశీలన ఇది. "ఇంత సాహిత్యాన్ని, ఇందరు రచయితలను, కళాకారులను అధ్యయనం చెయ్యటం ఒక్క సింక్లెయిర్‌కే సాధ్యం" అన్నారు విమర్శకులు. 'Mammon Art' ఇప్పటికీ సాహిత్యకులకు అవశ్యపఠనీయమైన గ్రంథాలలో ఒకటి. అయితే పుస్తకం సైజు పెరిగిపోయింది. ఆధునిక అమెరికన్ సాహిత్య విమర్శగా 'Money Writes', 1927లో ప్రచురించాడు. ఈ రెండు పుస్తకాలు ముఖ్యంగా Money Writes రచయితలను బాగా గాయపరిచింది. ప్రచురణ మాత్రమే సరిపోదన్నట్లుగా, సింక్లెయిర్ ఈ పుస్తకం కాపీలను ఆనాటి ప్రముఖ రచయితలందరికీ పంపాడు (పుండు మీద కారం చల్లటమంటే యిదే)

సింక్లెయిర్ లెవిస్ (తరువాత నోబెల్ గ్రహీత) కన్నీళ్ళు పెట్టుకున్నంత పని చేసి తక్షణమే ఈ పుస్తకాన్ని విత్ డ్రా చేసుకోవాలని బ్రతిమాలాడు.

సాటి రచయితలు ఎంత బాధపడితే అంత తృప్తి. 'వీళ్ల చమ్డాలు ఊడగొట్టాను' అంటూ తన ఆనందాన్ని కేరింతలలో మెంకెన్‌తో చెప్పుకున్నాడు సింక్లెయిర్.

ఇప్పుడు సింక్లెయిర్ లేడు. ఈ రచయితలూ లేరు. ఆ పుస్తకాలలో ఉన్నది రచయితల మీది కోపం కాదు, డబ్బు ఎరజూపి రచయితల్ని తనకు దాసుల్ని చేసుకున్న అమెరికన్ పెట్టుబడిదారీ విధానం మీది కోపం అని స్పష్టమవుతుంది.

ఆనాడు మాత్రం ఈ రెండు పుస్తకాలూ సింక్లెయిర్‌ను తోటి రచయితల ఏకైక శత్రువుగా నిలబెట్టాయి.

తరువాతి ముఖ్యమైన రచన ఆయిల్ (1927). చమురు పరిశ్రమలోని కుళ్ళును పబ్లిగ్గా కడిగిన నవల. ప్రచురణ అయిన వెంటనే నిషేధానికి గురైంది.

అమెరికన్ చరిత్రలో శాక్కో – వాంజెట్టి కేసుకు అత్యంత ప్రాధాన్యత ఉన్నది. ఇద్దరు (శాక్కో, వాంజెట్టి) బ్యాంకు దోపిడీ కేసులో అరెస్టు

అవుతారు. సోషలిస్టు / అనార్కిస్టు మిలిటెంట్లు అన్న అభియోగంతో వాళ్ళ మీద సంవత్సరాల తరబడి విచారణ జరుగుతుంది. చివరికి మరణశిక్ష విధిస్తారు. ఈ చరిత్రాత్మక గాథకు ప్రాణం పోసిన నవల 'బాస్టన్' (1928).

అప్టన్ సింక్లెయిర్ సాహిత్యంలో కొత్త భావాలు, నవ్యత ఏమీలేవు అని ఒక విమర్శ ఉన్నది. ఏది ఏమైనా కొన్ని లక్షలాది, కోట్లాది మందికి ఆ భావాలు చేరటానికి అతడి పుస్తకాలు సహాయం చేశాయి.

సింక్లెయిర్ ఉద్యమం రచనలకే పరిమితం కాలేదు. రాజకీయ వేదికలను కూడా వాడుకుని బడా పెట్టుబడిదార్లనూ, ప్రెసిడెంట్లనూ సవాల్ చేశాడు. ఆయన రచనలు ప్రారంభించినపుడు అమెరికాలో కనీసవేతన చట్టం, నిర్ణీత పనిగంటలు, పరిశ్రమల్లో, ప్రమాదవశాత్తూ, మరణించిన కార్మికులకిచ్చే ఎక్స్‌గ్రేషియా, ఆహారపదార్థాల నాణ్యతను నిర్ణయించే చట్టాలు, కార్మికుల ఐక్యకార్యాచరణ, యూనియన్లు, స్త్రీల హక్కులు, గుత్తాధిపత్యంలో ధరలు ఏకపక్షంగా నిర్ణయించటానికి వ్యతిరేకంగా చట్టాలు, నిరుద్యోగ భృతి, బ్యాంకుల, స్టాక్ ఎక్స్ఛేంజీల నియంత్రణకు శాసనాలు లేవు. తరువాతి తరాల అమెరికన్ ప్రజలు ఇవన్నీ ' ఉన్న వ్యవస్థలో బ్రతకగలగటానికి కారణం అప్టన్ సింక్లెయిర్ ఉద్యమాలు.

అప్టన్ సింక్లెయిర్ రచనల ప్రభావం అమెరికాకే పరిమితం కాలేదు. ఆనాటి రష్యాలో అతడి రచనలు విస్తృతంగా ప్రచురితమయ్యాయి. జర్మన్ నాటక రచయిత, ప్రయోక్త బెర్టోల్డ్ బ్రెక్ట్, రష్యన్, సినిమా జీనియస్ సెర్గీ ఐజెన్‌స్టీన్, హెర్బర్ట్ మార్క్యూస్ మొదలైనవాళ్ళు సింక్లెయిర్ రచనల ప్రభావాన్ని అంగీకరించారు. ముఖ్యంగా చార్లీ చాప్లిన్ సోషలిస్టు కావటానికి కారణం అప్టన్ సింక్లెయిర్.

## సింక్లెయిర్ మ్యానిఫెస్టో

పతితుల గురించీ, పీడితుల గురించీ, దగాపడిన తమ్ముళ్ళను గురించీ రాస్తాను. నా నిజాయితీకి వాళ్ళే సాక్షులు - ప్రశాంతమైన, విలాసవంతమైన, సుఖమైన జీవితాలు గడుపుతున్న సంపన్నులు కూడా ఒకరకంగా సాక్షులే. చరిత్రలో పేదల తరపున నిలిచిన వాళ్ళందర్నీ పేరుపేరునా వుదహరిస్తాను.

పేదల తరపున మాట్లాడిన వాళ్ళను చరిత్ర ఏం చేసింది? ఎన్ని చిత్రహింసలు పెట్టింది! ఎన్ని అవమానాలకు, కష్టాలకు గురిచేసింది!

ఈ నాగరిక ప్రపంచంలోని అన్యాయాలతో యుద్ధం చేయటానికి కవులు, కళాకారులు, రచయితలు ఎన్ని త్యాగాలకైనా సిద్ధం కావాలి.

అలనాడు త్యాగాలు చేసిన మహానుభావుల గురించి సానుభూతి చూపిస్తాం. కన్నీళ్ళు కారుస్తాం. కాని ఈ క్షణాన, మన కళ్ళముందే చిత్రహింసలకు గురవుతున్న వాళ్ళ గురించిన స్పృహ కూడా వుండదు.

గతంలో కన్నా ఎన్నో రెట్లు ఎక్కువగా కళాసాహిత్యాలను నేటి వ్యాపార విలువలు నిర్దేశిస్తున్నాయి.

ఎందరో ప్రచురణకర్తలతో, సంపాదకులతో మాట్లాడాను. ఈ వ్యాపార ప్రపంచంతో యుద్ధం చేస్తున్న వాళ్ళ తరపున వాదించాను.

రచయితలనూ సాహిత్య ప్రపంచాన్నీ వేరుచేస్తున్న ఎత్తైన గోడొకటున్నది.

అదే - "పాఠకులకేంకావాలి?" ఈ గోడను దాటే ప్రయత్నంలో వేలకు వేలమంది పిట్టల్లా రాలిపోతారు. అధిగమించగలిగిన ఆ కోటికొక్కడి జీవితమూ, ఆరోగ్యమూ అప్పటికే నాశనమైపోయి వుంటాయి.

ఆ ఒక్కణ్ణి నేను.

What public wants కాదు నా ఆదర్శం
నేను రాయదలచుకున్నదే రాస్తాను.

What public wants అనే కొరడాతో రచయితల్ని కొట్టటం మానినప్పుడే సాహిత్యం బాగుపడుతుందని నా ప్రగాఢ విశ్వాసం. మంచి రచయితలెప్పుడూ లోకం కోరింది రాయలేదు.

వాళ్ళు రాసింది లోకం చదివింది.

పాఠకుల అభిరుచికీ, రచయిత చెప్పదలచుకున్న సందేశానికీ నిరంతరం జరిగే పోరాటమే ప్రపంచ సాహిత్య చరిత్ర.

రచయితల, కళాకారుల కర్తవ్యం ఈ లోకంలో ఆనందాన్ని, ఆత్మ ఔన్నత్యాన్ని పెంచటం. కాని ఈ పనిచేసినందుకు వాళ్ళకు తిండెవరు పెడతారు?

ఎవర్నీ నమ్మించడానికీ, ఒప్పించటానికీ నేనిది రాయటంలేదు.

న్యాయం, నేను, కలిసి మెజారిటీ అని నాకు తెలుసు.

రచయితల కలాలకున్న 'పాఠకుల అభిరుచి' అనే సంకెళ్ళు తెంచటానికే నా జీవితం అంకితం చేస్తాను.

'ప్రేరణ' పొందిన వ్యక్తులు మాత్రమే కార్యోన్ముఖులై వుద్యమ లక్ష్యం కోసం జీవితాన్ని త్యాగం చెయ్యగలరు. అలాంటి వ్యక్తి జీవితం ప్రపంచంలోని ధనరాసులన్నింటికన్నా విలువైనది.

## మన 'సాహిత్యం'

సాహిత్యం సమాజానికి అద్దం పడుతుందనేది నిజం. అందువల్ల మనది డబ్బు సాహిత్యమని అన్నామంటే దాని అర్థం మనది డబ్బు సమాజమని. భూస్వామ్య యుగం తర్వాత, స్వేచ్ఛా విపణిలో నెగ్గగల్గిన, కుట్రలూ, కుతంత్రాలు పన్నగల్గిన ధనికవర్గపు చేతిలో ఉన్నాయి సమాజాన్ని నడిపించే పగ్గాలు. వీళ్లకున్న ప్రధాన ఆధారం - ధనం - సంపద. ఈ వర్గపు విలువల ఆద్యంతాలు ధనం. చరమ లక్ష్యం - ధనార్జన. భూస్వామ్య వర్గానికి భూమి ఎలాగో ఈ వర్గానికి 'ధనం' అలాగ. అందువల్ల ఈ వర్గపు సాహిత్యానికీ, కళలకూ చరమ లక్ష్యం - ధనార్జనే.

ఈ సమాజంలో, ఏ అర్హతలూ లేకపోయినాసరే ధనార్జనాపాటవం ఉంటే చాలు - అన్ని సుఖాలూ సమకూరుతాయి. వీళ్ల అధికార భాష 'డబ్బు'. వీళ్ల దృష్టిలో కళా, సాహిత్యాల పరమోద్దేశం వినోదం. మానవ విలువలున్న కళా సాహిత్యాలకు ఈ సమాజంలో స్థానంలేదు. ఈ సమాజంలో, యిప్పుడే, యిక్కడే ఆకలికి అలమటిస్తున్న కళాకారులూ, రచయితలూ వుండొచ్చు. కాని వాళ్లు కూడా తమ అసలు సమస్యల్ని పక్కనపెట్టి ధనిక ప్రభువుల వినోదం కోసమే కళాసృష్టి చెయ్యాలి.

రచయితలు తమ సమస్యల్ని గురించి గుండెల్ని పిండేసే రచనలు చెయ్యవచ్చు. కష్టాలు, కడగండ్లు చెప్పుకోవచ్చు. అప్పుడప్పుడూ యజమానులు పేదవాళ్ళ కష్టాలు వినటానికి సరదా చూపిస్తారు. కాని వీటి వుద్దేశం కూడా వినోదమే. ఖరీదైన డిన్నర్లకూ, క్లబ్బు వినోదాలకూ ఉన్న మధ్య కాలంలో యజమానులు పేదల కష్టాలు విని, చదివి ఆనందిస్తారు. అయితే ఈ కష్టాల కడగండ్ల పుస్తకాల్లోని హీరోల్లా తామెందుకుండరు? అంటే యజమాని విరగబడి నవ్వుతాడు.

ధనస్వామ్య జీవితానికి ప్రామాణికమైనది, ప్రాణప్రదమైనది 'నగదు చెల్లింపు'. ఎవరూ చదవని, గొప్ప పుస్తకం రాశానంటే మిస్టర్‌మనీ వికటాట్టహాసం చేస్తాడు. ఓ లక్ష కాపీలు అమ్ముడుపోయిన రచయితంటే, పుస్తకం ఎలా ఉన్నాసరే అతడు గొప్ప రచయితైపోతాడు. అది కూడా ఎంత తక్కువ కాలంలో ఎన్ని ఎక్కువ కాపీలు అమ్ముడయితే అంత

గొప్ప. కావలిసింది సక్సెస్. అంతే తప్ప 'సక్సెస్' ఎలా వచ్చింది? ఏ కారణం వల్ల అది 'సక్సెస్' అయింది అనేది అనవసరం. ఎవరో చెప్పినట్లుగా 'గొప్పవాడు', 'ప్రముఖుడు' అనేవాళ్లు ఆకర్షిస్తారు. గొప్ప స్మగ్లర్, హంతకుడు, గొప్ప కళాకారుడు, గొప్ప వ్యభిచారి, 'గొప్ప' అనేదాన్ని ఆరాధిస్తాం. వీళ్ల WHO'S WHO లో ఎటువంటివాడైనా సరే, హంతకుడు, దొంగలు, నేరస్తులు, ప్రెసిడెంట్లు, కోటీశ్వరులు, గ్రామీణులు ఎవరైనా సరే, 'గొప్ప' వాళ్లు మాత్రమే ఉంటారు. వీళ్ల ఆదర్శం చాలా స్పష్టమైనది. నికార్సైనది. 'ఒరిజినాలిటీ', 'కొత్త' అనేది వీళ్ల నిఘంటువులో లేవు. 'ప్రపంచం మొదటి నుంచి ఇలాగే ఉంది. ఇలాగే ఉంటుంది'... 'మానవ స్వభావం మారదు'.

అందువల్ల మనం చెయ్యవలసిందల్లా జనానికి కావలసిందేదో జాగ్రత్తగా ఎంచుకోవటమే. ఆ పరమ రహస్యం కనుక్కుంటే ఏదైనా సాధించవచ్చు.

పాఠకులక్కావలసింది - జాలి పుట్టించే అయ్యో అయ్యో కథలూ, వంటింటి నీతి సూత్రాలు. అందువల్ల అవే పాఠకుల కోరిక. అలాగే అదే రాద్దాం. పీడిత ప్రజల విముక్తికి జీవితాల్ని అంకితం చేసినవాళ్ల గురించి తెలుసుకోవాలని పాఠకులకు కోరిక లేదు. మనం రాయం. పోరాటాలు, సంఘర్షణలు, విలువల్ని ప్రశ్నించేతనం పాఠకులకక్కర్లేదు. సెంటిమెంటల్, ఎక్సైటింగ్, సెక్సీ ప్రేమకథలు కావాలి పాఠకులకు. దొంగతనాలు, బ్యాంకు దోపిళ్లు, హత్యలూ, సినిమాతారల ప్రైవేటు జీవితాలూ కూడా కావాలి. అంతేకాదు. సాహసోపేతమైన కథలన్నా పాఠకులకిష్టమే. అందువల్ల అడ్వెంచర్లు రాస్తాం మనం. పాఠకులకు ప్రేమవద్దు. కాని చక్కెర గుళికల రొమాన్సులు చాలా యిష్టం. ప్రేమ గొప్ప విషయమే. కాని ఆకలికి మాడే పేదింటి పిల్లలు లాడ్జింగుల్లో చవకగా దొరుకుతున్నంతకాలం ప్రేమను ఒక సీరియస్ విషయంగా తీసుకోవలసిన అవసరంలేదు. మన జీవితాల సంగతేమిటంటారా? మన బ్యాంకు బాలెన్సుకూ, మన యిళ్లల్లోని ప్రేమలకూ అవినాభావ సంబంధముందని అందరికీ తెలుసు. అందువల్ల మనకు పుస్తకాల్లో కనిపించాల్సిన ప్రేమ సెంటిమెంటు రూపంలో ఉన్న అయిస్‌క్రీం లాంటి రొమాన్సు.

ఈ డాలర్ నాణానికి అటువైపుచూస్తే, విలాసాలనూ, గౌరవప్రదమైన జీవితాలనూ సమకూరుస్తున్న ఈ నాగరికత, సమాజంలోని అత్యల్ప సంఖ్యాకులకు మాత్రమే వీటిని ఇవ్వగలుగుతున్నదని తెలుస్తుంది. ఉత్పత్తి సాధనాల మీద, వ్యాపార సరళి మీదా, పరిపాలనా వ్యవహారాల మీదా, రాజ్యాంగం మీదా పూర్తి అధికారాన్ని చిక్కించుకొని, వీటిని తన గుప్పిట్లో పెట్టుకున్న ధనస్వామ్యం, కూలీలు, జీతాలు పెంచుతూనే ధరల్ని యింకా ఎక్కువ నిష్పత్తిలో పెంచి తన ఆదాయాన్ని యిబ్బడి ముబ్బడి చేసుకుంటున్నది. అత్యధిక సంఖ్యాకులు కనీసావసరాలు తీరక, ఆకలితో, అనారోగ్యంతో అకాల మృత్యువువాత పడుతుంటే 'పాపం, నిర్భాగ్యులు, ఏం చేస్తాం' అనేటట్టు మనల్ని మభ్యపెడుతున్నది. కన్నీళ్లు కార్చటానికి పేదలు బాగానే ఉంటారుగాని, తిరగబడితే వాళ్లే విప్లవకారులవుతారు.

ఒక్కమాటలో చెప్పాలంటే, ఇది నియమబద్ధమైన దోపిడీ, పీడన. భౌతికంగా తన దౌర్జన్యం కొనసాగించటానికి యజమానుల వద్ద సైన్యం, పోలీసులు, ఆయుధాలు, తూటాలు, జైళ్లు ఉన్నాయి. ఇంకా ఆలోచనల్ని అణచటానికి వివిధ రాజకీయ పార్టీలూ, ప్రణాళికలూ, విద్యాసంస్థలూ, గుళ్ళు, పత్రికలూ, సాహిత్యం, సినిమాలు ఉన్నాయి.

కూలీ రేట్ల ద్వారా, జీతాల ద్వారా కార్మికుల్ని గుప్పిట్లో పెట్టుకున్నట్లుగానే అదే 'డబ్బు' అనే ఆయుధంతో ఆలోచనల్ని కూడా కంట్రోల్ చేస్తున్నది. పత్రికల్లో రచయితలకు పేరు తేవటంలో, బెస్ట్ సెల్లర్స్ తయారు చెయ్యటంలో కూడా వీళ్ల పద్ధతి డబ్బాశ చూపించటమే. మన విద్యాసంస్థల్లో వాళ్ల కనుకూలమైన విద్యాబోధనే జరుగుతుంది. మన పత్రికల్లో వాళ్ల అధికారం మీద గ్లామర్ పెంచే కథలే వస్తాయి.

ధనస్వాముల దృష్టిలో రచయితలు కేవలం వినోదకులూ, విదూషకులూ మాత్రమే - వేశ్యలకూ, వీధి గారడీగాళ్లకూ మధ్యనెక్కడో ఉంటుంది వీళ్ల స్థానం.

తమకు వినోదం కల్పించే, తమ వర్గ ప్రయోజనాన్ని కాపాడే రచయితలకు, పూర్తిగా దాసోహమన్న రచయితలకు తమ వర్గపు సౌకర్యాలు వీళ్లు తప్పక కల్పిస్తారు - మంచి యిళ్లు, డబ్బు, కీర్తి. ధనవంతుల్ని కీర్తించటమే కాదు, వాళ్ల దృష్టితో సమాజాన్ని చూసి రచనలు చెయ్యగలగాలి. అదే వాళ్లక్కావలసిన అర్హత.

మనం ఏదన్నా రాయచ్చు. పూర్వకాలంలో రాజులు, రాణులు ఎలా విలాసవంతమైన శృంగార, ధైర్య, సాహసోపేత జీవితాలు గడిపారో రాయొచ్చు. ప్రస్తుతకాలంలో, కోటీశ్వరులు ఎంత తెలివిగా, జీనియస్సులుగా, అద్భుతమైన జీవితాలు గడుపుతున్నారో రాయొచ్చు. ఉన్నత వర్గీయుల జీవిత పద్ధతుల్లోని తళుకుబెళుకులు, చమక్కులు ఎన్నైనా మనం శ్లాఘించవచ్చు. యుద్ధాల గురించీ, తెలివైన హత్యల గురించీ, అపరాధ పరిశోధనల గురించీ, సూపర్‌మాన్, డిటెక్టివ్‌ల గురించీ పుంఖాను పుంఖంగా రాయొచ్చు. పేదవాళ్ల గురించీ రాయొచ్చు. వాళ్ల కష్టాలు, వాళ్ల నిజాయితీ, వాళ్ల పొదుపు, వాళ్ల సహనం - ఏదైనా రాయొచ్చు.

ఒకటే నియమం. ఇవన్నీ కేవలం వినోదానికి వుద్దేశించినవై ఉండాలి. పొరబాటున ఏ మూర్ఖరచయితైనా మరి పరిపాలకులకు ఇబ్బంది కలిగించే వాళ్లను ప్రశ్నించే రచనలు చేస్తే మాత్రం వాణ్ణి వెదుక్కుంటూ పోలీసులొస్తారు. వాడి రచనల్లో ఏ రకమైన సాహిత్య విలువలూ లేవని చెప్పటానికి సాహిత్య విమర్శకులుంటారు. రచయితగానూ, వ్యక్తిగానూ వాడికి చావు దగ్గర్లోనే ఉందని మనం గ్రహించవచ్చు. ఈ సమాజంలోని పేదవర్గం పుష్పక విమానం లాంటిది. నీలాంటి మరొక్కడు చేరటానికి అక్కడ ఎప్పుడూ చోటుంటుంది. తనను ధిక్కరించిన వాళ్లకు కనీసావసరాలు తీరకుండా చేసి, మాడ్చి చంపటం ధనస్వామ్య సమాజపు ప్రత్యేకత.

మనం రచయితల్ని రుషులుగా, ప్రవక్తలుగా, సంస్కర్తలుగా, విమర్శకులుగా, దార్శనికులుగా చూడ్డంలేదు. కాపీలు అమ్ముడుపోవటాన్ని బట్టి మాత్రమే రచయితకు ప్రాముఖ్యతనూ, ప్రత్యేకతనూ నిర్ణయిస్తున్నాం.

రచయిత ఉద్దేశం పత్రికల్లో పేరు చూసుకోవటమే అనటం ప్రతివాళ్లకూ ఆనవాయితీ అయింది. నిజమే. ఈ పత్రికలకు కథల్తో రచనల్తో వున్న సంబంధం వ్యాపార ప్రకటనల్తో ఉన్న సంబంధం కంటే ఎక్కువేమీ కాదు. అసలు పత్రిక అనేది ప్రకటనలు అచ్చేసుకుని డబ్బు చేసుకోవటానికే. అందులో పాఠకులను ఆకర్షించటానికి కొన్ని రచనలు అచ్చేస్తారు. అందువల్ల ఈ ప్రకటనదార్ల, ఉత్పత్తిదార్ల ప్రయోజనాలకు విరుద్ధమైన రచనలు పత్రికల్లో వచ్చే అవకాశమే లేదు. పత్రికలో - ప్రకటనలు పోగా, మిగతా పేజీల్లో కనిపించే రచనలన్నీ సాహిత్యమా? ప్రకటనలు చూడటానికి పాఠకులు కావాలి. పాఠకులకు ఆకట్టుకోవటానికి రచనలు కావాలి. కాని పత్రికలోని సిగరెట్ల, సబ్బుల, ఇతర వినియోగ

వస్తువుల ఉత్పత్తిదారుల అభిరుచికీ, పాఠకుల అభిరుచికీ, అసలు సాహిత్యానికీ ఎంత సంబంధముంది? అసలు సాహిత్యాభిలాషుల అభిరుచికీ, వినియోగవస్తువుల ఉత్పత్తిదార్ల అభిరుచికీ సారూప్యమేమిటి? ఇవన్నీ శోచనీయమైన విషయాలే.

అక్కడక్కడా, ఒకరో ఇద్దరో సాహిత్యాభిలాషగల సంపాదకులు రహస్యంగా ఈ పత్రికల్లో దాక్కున్నా, వాళ్లు చెయ్యగలిగిందేమీ లేదు. ఎవరైనా ఏమైనా చెయ్యాలనుకుంటే, అంతటితో వాళ్ల భవిష్యత్తు ముగుస్తుందనటానికేమీ సందేహం లేదు. ఇటువంటి సంపాదకులు పత్రికల్లో ఉండకుండా చూడటమనేది ఈ వ్యవస్థ స్వభావం.

ఇది కూలీకి, అమ్ముడుపోయిన బానిసల సమాజం. దాన్ని వ్యతిరేకించే వాళ్లను అది దగ్గరకు రానివ్వదు. బానిసలూ, యజమానులూ స్వభావరీత్యా శత్రువులు. రెండు కత్తులు ఒక ఒరలో యిమడలేవు. బానిసలకు గొలుసులున్నాయి. ఆ గొలుసును తడుముకుంటూపోతే అటువైపున యజమాని చెయ్యి ఉంటుంది. ఈ సమాజ స్వరూపాన్ని అర్థం చేసుకుని మార్చటానికి ప్రయత్నించలేని వ్యక్తి బానిసకన్నా అధ్వాన్నం. మరి బానిసలకన్నా అధ్వాన్నమైన జీవితాలు గడుపుతున్న మనకు కళా, సాహిత్యాలతో పనేమిటి? మన కళ్ళు మనమే పొడిచేసుకుని. మనకు మనమే సంకెళ్లు తగిలించుకొని మన ఆత్మల్ని మనమే చంపుకొని జీవచ్ఛవాలమైన మనకు సాహిత్యమెందుకు?

## క్షమించండి, ఇది అనువాదం కాదు.

ఇది ఇంగ్లీష్ మాతృకకు తెలుగు కథనం. చాలా మార్పులు, చేర్పులు చేసిన కథనం. ఉదాహరణకు ఒకచోటు, కళా, సాహిత్యాల ఆవిర్భావం గురించి రాస్తున్నప్పుడు సింక్లేర్ వాదనకు తోడుగా మార్క్సు, ప్లెహనోవ్, జార్జి థాంసన్, ఎర్నెస్ట్ మాండేల్ వంటి మహానుభావుల అభిప్రాయాలను కూడా జతచేశాను.

'మామనార్ట్' (Mammon Art) అమెరికన్ యూరోపియన్ పాఠకులను దృష్టిలో పెట్టుకుని రాసిన పుస్తకం. అనేకమంది రచయితలు, కళాకారులు వాళ్లకు అప్పటికే తెలుసనే నమ్మకం వుందిగనుక, వాళ్ల జీవిత పరిచయాలనూ, కృషినీ ప్రస్తావించకుండా నేరుగా తన వ్యాఖ్యానం ప్రారంభిస్తాడు సింక్లేర్. తెలుగు పాఠకుల సౌలభ్యం కోసం, నాకు తెలిసిన మేరకు, మొదట వాళ్లను సంక్షిప్తంగా పరిచయం చేసి, తరువాత సింక్లేర్ అభిప్రాయాలను రాశాను.

ఇక మాతృకలోని సమాచారాన్ని (మనకు) అనవసరమనుకుంటే కుదించటమో, లేదా స్పష్టతకోసం పెంచటమో జరిగింది.

'సోషలిస్టు సంస్కృతికి టెక్స్ట్‌బుక్' అని రచయిత చెప్పిన ఈ పుస్తకం తెలుగు వాళ్లకు ఏ మేరకు వుపయోగపడినా, నా ప్రయత్నం ఫలించినట్టే.

(అయిపోయింది)

కవిత

# బతకనేర్చినవాడు

- సిహెచ్.వి. బృందావనరావు

**అతనికేం!** అతను బతకనేర్చినవాడు
రొట్టెముక్కకు ఏ వైపు వెన్న రాసుందో
అతి చులాగ్గా అర్థంచేసుకోగలడు
గాలివాటం ఏవైపు నుంచి వీయబోతుందో
ముందుగానే ముక్కుల్తో పసిగట్టగలడు
అవసరానికి పనికొచ్చే అధినాయకుడెవరో
అక్కరకురాని చుట్టమెవరో
అరనిముషంలో పోల్చుకోగలడు
ఏ ఎండకు ఏ గొడుగు పైకెత్తాలో
వరదలో కొట్టకపోయేటప్పుడు గూడా
లాభాన్ని ఎలా ఒడుక్కోవాలో
అతనికి తెలిసినంతగా మరెవరికీ తెలీదు
కాలంతోపాటు ప్రవహించడం
అతనికి నల్లేరుపై బండి నడక
అవకాశాన్ని ఆవలికి పోనీకపోవడం
అతడు ఉగ్గుపాలతో నేర్చిన నడత.
ఇతరుల తలపై కాలుపెట్టి తొక్కితేనే
తాను పైకెక్కగలనని ఎరిగినవాడు
పక్కవాడి కంచాన్ని సంగ్రహించైనా
తన కుక్షిని నింపుకోవడం మరిగినవాడు
భూముల్నూ, గనుల్నూ, ఖనిజాల్నూ భోంచేసి
ఆరగించుకోగల జఠరాగ్నిని ఆవరించినవాడు
శరీర మొత్తాన్నీ కడుపుగా మార్చుకుని
తినేకొలదీ పెరిగిపోయే ఆకలిని ధరించినవాడు
అందిన ప్రతిదానినీ ఆలింగనం చేసుకొని
సొంతంగావించుకునే చొరవగలవాడు
తరతరాలకూ తరగని ఆర్జనతో
దుర్నిరీక్ష్యంగా వెలుగుతున్నాననుకుంటున్నవాడు
నిజమే, అతను బతకనేర్చినవాడేగాని
అన్ని అంగాలూ సజావుగా వుండి
ఉచ్ఛ్వాస నిశ్వాసలుగా మనగలగడమే బతుకనుకునే వాడు
అతనికి ఎలా బతకాలో తెలీదు
ఎందుకు బతకాలో అసలే తెలియదు
అతని చేతులకు కన్నీళ్ళు తుడవడం తెలియదు
అతని చూపులకు చిరునవ్వులు పూయించడం తెలియదు
ఆర్తులకు ఆసరా అందించవు అతని భుజాలు
ఆత్మీయంగా ఆలింగనించుకోనీవు అతని హజాలు
ప్రాణమున్నంతదాకా మనడమే బతుకనుకుంటాడు గాని
చనిపోయింతర్వాత గూడా బతికుండడమే
నిజమైన బ్రతుకని మాత్రం
అతను నేర్చినవాడు కాదు!

# సాహిత్య పత్రికల ప్రారంభ సంపాదకీయాలు 40

# హైద్రాబాదాంధ్ర సాహిత్య పరిషత్పత్రిక

## Quarterly Journal of The Hyderabad Telugu Academy

## హైదరాబాదాంధ్ర సాహిత్య పరిషత్పత్రిక

## మూడు నెలలకొకసారి ప్రకటింపబడును

## 1945 - ఏప్రియల్

ఈ పత్రికను హైదరాబాదాంధ్ర సాహిత్య పరిషత్తు వారు 1945 ఏప్రిల్‌లో త్రైమాస పత్రికగా ప్రారంభించారు. దీని సంపాదకీయవర్గ సభ్యులు - రాయప్రోలు సుబ్బారావు, వల్లూరి సూర్యనారాయణరావు, తూములూరి శివరామ కృష్ణమూర్తి శాస్త్రి, మహమ్మద్ ఖాసింఖాన్ కాగా కురుగంటి సీతారామయ్య ముఖ్య సంపాదకుడు.

ఈ పత్రిక మొదటి సంచికలో (ఏప్రియల్ 1945) వేటూరి ప్రభాకరశాస్త్రిగారు 'రెడ్డి రాజుల ఆంధ్ర వాఙ్మయసేవ' పైనా, వేదాల తిరువేంగళా చార్యులుగారు, 'ఆంధ్రసాహిత్యము, అలంకార శాస్త్రము పైనా, పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, 'అగస్త్య మహాకవి' పైనా వి. వి. హనుమంతరావుగారు 'ఆంధ్రవచన స్వరూపము'పైనా వ్యాసాలు రాశారు. తూములూరి శివరామకృష్ణ శాస్త్రిగారి 'మాతృక' అనే రచన, ప్రథమోత్సవ వృత్తాంతము' అనే రచనలు కూడా ఈ సంచికలో వున్నాయి.

## హైదరాబాదాంధ్ర సాహిత్య పరిషత్పత్రిక

## స్వ విషయము

హైదరాబాదునందలి సాహిత్యోపాసకులు కొందరుచేరి పాండిత్య పరిశోధనలకు, ముఖ్యముగా ఇక్కడ సాహిత్యాభివృద్ధి కొరకు యథాశక్తిగా పనిచేయగల సంస్థయొకటి యుండిన అవసరమని పర్యాలోచించి "హైదరాబాదాంధ్ర సాహిత్యపరిషత్తు" అను పేర స్థాపించిరి. ఇది 1940 సంవత్సరము అక్టోబరు నెలలో జరిగెను. ఈ క్రిందివారు స్థాపక నిర్వాహకులుగా కార్యక్రమ మారంభింపబడెను.

ఆచార్య రాయప్రోలు సుబ్బారావు, అధ్యక్షుడు
కురుగంటి సీతారామయ్య
శ్రీ తూములూరు శివరామకృష్ణశాస్త్రి
శ్రీ మొహమ్మద్ ఖాసింఖాన్, కార్యదర్శి

పరిషదుద్దేశ్యములలో క్రిందివి ప్రధానములుగా నిర్ణయింపబడినవి :

(1). హిందూ ముస్లిములు పరస్పరము ఒకరి సంస్కృతిని ఒకరు అర్థము చేసుకొనుటకుపకరించు గ్రంథములను ప్రచురించుట.

(2). ఆంధ్రము నందు ఉత్తమ రచనలను ప్రచురించుట.

(3). నిజాం రాజ్యమున లభించు ప్రాచీన తాళపత్ర గ్రంథములను సేకరించుట, భద్రపరచుట, అపూర్వములు ప్రకటించుట.

(4). ఆంధ్ర సంస్కృతి, ఆంధ్రభాష ఆంధ్ర వాఙ్మయము, వీనియందు పరిశోధనలు, వ్యాఖ్యానములు, విమర్శలు సలుపుట.

(5). ఒకటి ఆంగ్లమునను, ఒకటి ఆంధ్రమునను రెండు త్రైమాసిక పత్రికలను ప్రచురించుట. పరిషత్సభ్యుల యొక్కయు, ఇతర పండితుల యొక్కయు పరిశోధన వ్యాసములకు ఇందుతావిచ్చి తోడుపడుట.

తెలుగుభాషను గురించియు, సాహిత్యమును గురించియు, ఇతరులకు తెలియజేయునట్టియు, ఆంధ్రప్రతిభను ఆంధ్రేతరులకు తెలియజేయునట్టియు వ్యాసములు ఆంగ్లపత్రిక యందుండును. ఆంధ్రభాషా, వాఙ్మయ, జాతి చరిత్రములకు సంబంధించిన విషయములును, ఆంధ్రేతర సాహిత్యములలో గొప్ప కావ్యముల నుండి యనువాదములును, ఆంధ్రేతర భాషావాఙ్మయ చరిత్రములు, మున్నగు విషయములును తెనుగు పత్రికయందుండును.

(6). అప్పుడప్పుడుత్సవములను జరుపుచు ఆంధ్ర సంస్కృతికి సంబంధించిన విషయములపై ప్రఖ్యాత పరిశోధకుల ఉపన్యాసములను, చర్చలను, చిత్రకళా ప్రదర్శనములను ఏర్పాటుచేసి, ఆంధ్ర సంస్కృతి విస్తృతికి తోడ్పడుట. సుప్రసిద్ధులైన ఆంధ్రభాషాసాహిత్య చారిత్రక పరిశోధకులను, ఇతరాంధ్ర ప్రముఖులను గౌరవ సభ్యులుగా నుండుటకాహ్వానింపవలయునని కూడ తీర్మానింపబడెను.

పై విషయముల వల్ల ఈ పరిషత్తునకు కేవల సారస్వత చారిత్రక, భాషా వాఙ్మయసేవయే ఆదర్శమనియు, తన్నిర్వహణమున స్థానిక దృష్టి ముఖ్య విషయమనియు విశదము కాగలదు. పై యుద్దేశ్యములతో జరిగిన కృషికి తొలిపంటయే ఈ పరిషత్తు ప్రథమవత్సరమున కావించిన క్రింది ప్రచురణములు.

(1). ఆదర్శప్రభువు (మ.ఘ.వ. సప్తమ ఆసఫ్జాప్రభువువారి ప్రథమ పంచవింశతివర్ష రాజ్యచరిత్రము) 370 పుటలు.
(2). ఖుర్-ఆన్-షరీఫ్ (ప్రథమభాగము) 145 పుటలు.
(3). నవ్యాంధ్ర సాహిత్య వీథులు; 1827-1942 వరకు ఆంధ్ర సాహిత్య చరిత్రము. 620 పుటలు
(4). ఖుర్-ఆన్-షరీఫ్. (రెండవ భాగము) 200 పుటలు.
(5). కొందరు తంజావూరు కవులు, పండితులు (పరిశోధక వ్యాసములు) 185 పుటలు
(6). ఆంధ్రవాఙ్మయ చరిత్ర. (ఆంగ్లము) 150 పుటలు.

ఈ గ్రంథములు ప్రచురించిన తరువాత ప్రథమోత్సవము చేయసంకల్పము కలిగెను. తదనుసారముగా 1943వ సంవత్సరము డిసెంబరు 14, 15, 16, 17 తేదీలలో కాశీ హిందూ విశ్వ విద్యాలయోపాధ్యక్షులును సుప్రసిద్ధాంధ్రులునగు డాక్టర్ సర్. సర్వేపల్లి రాధాకృష్ణ ప్రముఖుని అధ్యక్షులుగను, మ.ఘ.వ. నిజాం ప్రభుత్వ

విద్యాశాఖామంత్రులగు నవాబ్ సర్. మెహిదియార్జంగు బహాద్దూర్ వారు ప్రారంభకులుగను ప్రథమ సమావేశము, హైదరాబాదు ప్రభుత్వ పురమందిరమున మిక్కిలి జయప్రదముగా జరిగెను. అందు కొన్ని ఆంగ్లమునను, కొన్ని ఆంధ్రమునను వ్యాసములు చదువబడెను. తత్సమావేశ వృత్తాంతము వేరుగా నిందు ప్రకటింపబడినది. స్థలాంతరమున కాననగును.

త్రైమాసిక పత్రికను ప్రచురించుటకు మ.ఘ.వ. నిజాం ప్రభుత్వమున కనుమతికొరకు వేడియుంటిమి. దయతో శ్రీ ప్రభుత్వమువారు అనుమతినొసంగిరి. ప్రథమ సమావేశమునందు చదువబడిన ఆంగ్ల వ్యాసములను ఆంగ్లపత్రికయందును, ఆంధ్ర వ్యాసములను తెనుగు పత్రికయందును ప్రచురింపనెంచితిమి. ఇంతలో యుద్ధమువలన ముద్రణసౌకర్యములు కొరవడుట తటస్థించెను. అందుచే ఆలస్య మనివార్యమైనది. ఆంగ్లపత్రిక ప్రథమసంచికయు ముద్రణయందున్నది.

ఈ పత్రికాముఖమున పరిషదాదర్శమును సూచించు మ.ఘ.వ. సప్తమ ఆసఫ్జాప్రభువు చత్రచ్ఛాయక్రింద భాషాసంస్కృతి మూలకమగు హిందూముసల్మాను సమ్మేళనావిష్కారమునకు ఈ రేఖాచిత్రము ఉప లక్షకము. ఈ పవిత్రాశయ సిద్ధికై మా పరిషత్తు చేయు విధేయ వ్యవసాయము ఎంత సహకారమొనర్చిన నంత ధన్యమగును.

పరిషత్తు తీర్మానానుసారముగ నీక్రింది యాంధ్రమహామహులు పరిషత్తుయొక్క గౌరవసభ్యులుగా నెన్నుకొనబడిరి. వారును దయతో సభ్యత్వమున కంగీకరించిరి. వారికందరకును మా వందనములు.

డాక్టర్ సర్. రాధాకృష్ణన్ కె.టి., డి.లిట్.

శ్రీ బెజవాడ రామచంద్రారెడ్డిగారు ఓ.బి.ఇ.

శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు

" మల్లంపల్లి సోమశేఖరశర్మగారు

" పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారు

" భావరాజు వెంకటకృష్ణారావు ఎం.ఏ., బి.ఎల్.

" మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు

" పెండ్యాల వెంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు

" డాక్టరు పి. శ్రీనివాసాచారిగారు ఎం.ఏ., పి.హెచ్.డి.

" " మారేమండ రామారావుగారు ఎం.ఏ., పి.హెచ్.డి.

శ్రీ శ్రీ శ్రీ సాహిత్యసామ్రాట్, మహారాజా విక్రమదేవవర్మగారును, శ్రీ శ్రీ శ్రీ రాజా రామచంద్రారెడ్డిగారును మా పరిషత్తునకు పోషకులుగా ఉండుటకు దయతో అంగీకరించిరి.

ప్రథమసమావేశ సందర్భమున ఒసగబడిన కొన్ని వ్యాసములను ద్వితీయసంచికకై నిలుపవలసి వచ్చినందులకు చింతిల్లుచున్నాము. ఆంధ్రదేశమందలి వివిధ పండితులు, భాషాసాహిత్య చారిత్రక పరిశోధకులు మాకుచేసిన సహాయమునకు మిక్కిలి కృతజ్ఞులము. ఇట్లే ముందుకూడ మమ్మాదరింపవలెనని ప్రార్థించుచున్నాము. ఈ పత్రిక యందు పద్యములు, ఖండ కావ్యములు, కథానికలు, నవలలు మున్నగునవి ప్రకటింపబడవు. పాండితియు, పరిశోధనమును, స్వసంస్కృతి విస్తృతి మూలమున వివిధ సంస్కృతుల సమ్మేళనమును ఈ పరిషత్తుయొక్కయు, పత్రికయొక్కయు ముఖ్యోద్దేశములు.

ఏత దాశయపరిపూర్తికై మాకు తోచినట్లు యథాశక్తిగా పాటు పడుటయే మా విధి. ఈ మాటలతో మా ప్రథమ సంచికను ఆంధ్రలోకమునకు సమర్పించుచున్నాము.

విధేయుడు, **సంపాదకుడు**

# ముప్పై ఏళ్ళ క్రితం ప్రజాసాహితి

## 1984 మార్చి - 68వ సంచిక

**మెడకు** తగిలించుకున్న త్రాడుతో బండరాళ్ళను పైకి లేపుతున్న బాలుడు - పొట్టకూటి కోసం చేస్తున్న ప్రదర్శన చిత్రాన్ని 'ఇండియాటుడే' పత్రిక సౌజన్యంతో ముఖచిత్రంగా ప్రచురించిన ఈ సంచిక పేజీలు 64. వెల : రెండు రూపాయలు.

'కుళ్ళిన శవానికి సింగారింపు' అనే శీర్షికగల సంపాదకీయంలో కొత్త బడ్జెట్‌పై వ్యాఖ్యానిస్తూ "పాలకవర్గాలు ఆర్థిక సంక్షోభపు ఊబిలో కూరుకుపోయారనడానికి చక్కటి ఉదాహరణే ఈ బడ్జెట్" అన్నారు.

'సంగం' నవల, కొ.కు. వ్యాసాలపై ధారావాహికలు ఈ సంచికలో కొనసాగాయి. పాపినేని శివశంకర్, ధరల పెరుగుదలపై 'భూమ్యాకర్షణ' అనే గల్పిక రాశారు. తుమ్మేటి రఘోత్తమ్మరెడ్డి రాసిన 'ఓ పిల్లి కథ' ఈ సంచికలో వుంది. భగత్‌సింగ్ 53వ వర్ధంతి సందర్భంగా దేశీ యువతను ఉద్దేశించి భగత్‌సింగ్ రాసిన లేఖను నిర్మలానంద అనువదించారు. గత సంచికలో ప్రారంభమైన కె. ఐలయ్య వ్యాసం 'భారతదేశంలో స్త్రీలు - ఒక చారిత్రక పరిశీలన' ఈ సంచికలో పూర్తయింది.

జనమిత్ర, చంద్రశేఖర్ ఆజాద్, పిఎస్‌కె సత్యనారాయణ, శ్రీమతి లక్ష్మీ సుహాసిని, రే, చావలి శాంతికుమార్, బి.ఆర్.వి. ప్రసాదమూర్తి, ఇస్మాయిల్, పాతూరి వెంకటేశ్వరరావుల కవితలు ప్రచురించారు. ఆర్.రామకృష్ణ, బి.మహేశ్ రాసిన పాటలు వున్నాయి.

స్పందన శీర్షికలో, పి. రామకృష్ణారెడ్డి, ఒక లేఖ రాస్తూ, రంగనాయకమ్మపై వేసిన పరువునష్టం దావాలో యండమూరికి 'అంత తేలిగ్గాపోయే పరువు అదేం పరువు?' అన్నారు. ఏలూరు నుండి ప్రభ, 'ఇందిరా గాంధీ హాస్యప్రియత్వం' అంటూ రాజకీయ నాయకుల తెరవెనుక భాగోతాలను బట్టబయలు చేసే 'ఎస్ మినిస్టర్' అనే కార్యక్రమాన్ని దూరదర్శన్‌లో అర్థాంతరంగా నిలిపివేయటాన్ని ప్రశ్నించారు.

ఆంక్షలు-నిషేధాలు శీర్షికలో ప్రేమచంద్ హిందీ మాసపత్రిక 'హంస్'పై నల్లచట్టం దండయాత్ర వివరించారు. చైతన్యవాహిని శీర్షికలో విజయనగరం, పర్చూరు, మచిలీపట్నం, వెంకటగిరి, రాజమండ్రిలలో జరిగిన కార్యక్రమాల వివరాలున్నాయి. స్వీకారం శీర్షికలో ఆరు పుస్తకాల వివరాలున్నాయి. ✤



# అభ్యుదయ జానపద గేయాల ప్రజా వాగ్గేయకారుడు పీటర్ సీగర్

"వుయ్ షల్ ఓవర్‌కమ్", (విజయం సాధిస్తాం, మేం విజయం సాధిస్తాం) అనే అమెరికన్ జానపదగీతాన్ని, పౌరహక్కుల ఉద్యమానికి, ఇతర ప్రజాఉద్యమాలకు అన్వయించి ప్రపంచవ్యాప్తం చేసిన సంగీతకారుడు, గాయకుడు పీటర్ సీగర్ జనవరి 27, 2014న న్యూయార్క్ నగరంలో తన 94వ ఏట మరణించారు. అయితేనేం ఆయన పాడిన ఎన్నో ప్రజానుకూల గేయాలు మనకు వినబడుతూనే వుంటాయి. మనకు స్ఫూర్తినిస్తూనే వుంటాయి. 'వుయ్ షల్ ఓవర్‌కమ్'కు అదే బాణీలో హిందీలో రాసుకున్న 'హమ్ హోంగే కామయాబ్' పాట ద్వారా మనదేశమంతటా వివిధ ఉద్యమకారులు స్ఫూర్తిని పొందుతూనే వున్నారు.

ఈ మూడు పంక్తుల పల్లవిని పౌరహక్కులు ఉద్యమం సందర్భంగా అమెరికాలో మార్టిన్ లూథర్‌కింగ్ (జూనియర్) విస్తృతంగా ఉపయోగించుకున్నారు. నల్లజాతి గాయకుడు పాల్ రోబ్సన్ కూడా ఈ పాటను తన సంగీత కచేరీలలో పాడి శ్రోతలను ఉర్రూతలూగించేవారు. ఈ పాట ఇంగ్లీషులోగానీ, మనదేశంలో హిందీ, తెలుగులలోగానీ పాడటం ద్వారా పీటర్ సీగర్‌నూ, పాల్ రోబ్సిన్‌నూ సజీవంగా మన కళ్ళముందు చూస్తుంటాం.

పీటర్ సీగర్ న్యూయార్క్ నగరంలో 1919లో మే 3న జన్మించారు. ఈయన తండ్రి తరపు పూర్వీకులు జర్మనీ నుంచి అమెరికా విప్లవం కాలంలో అమెరికా వచ్చి, ఇంగ్లండ్ నుంచి అమెరికా వచ్చిన కుటుంబంలో యువతిని వివాహమాడారు. పీటర్ తండ్రి కూడా సంగీత విద్వాంసుడే, గాయకుడే. ఆయన 1913లో అమెరికన్ మ్యూజికాలజికల్ సొసైటీని స్థాపించాడు. పీటర్ తల్లి సంగీత సంస్థలో శిక్షణ పొందిన వయొలిన్ విద్వాంసురాలు - ఆ తర్వాత ఉపాధ్యాయినిగా పనిచేశారు.

పీటర్ 18 నెలల వయసులో, వీరి కుటుంబం మరో ఇద్దరు కొడుకులతో దక్షిణ అమెరికాలో శ్రామికులకు సంగీతం నేర్పడానికి వెళ్ళింది. ఆ తర్వాత న్యూయార్క్‌లో సంగీతం నేర్పుతూ కాలం గడిపారు. తన భార్య కాన్‌స్టన్స్ తన పేరుతో రహస్య బ్యాంక్ అకౌంట్‌ను తెరచిన విషయం తెలుసుకొని, బాధపడి పీటర్ తండ్రి చార్లెస్ ఆమెతో తెగదెంపులు చేసుకున్నాడు. ముగ్గురు కొడుకుల సంరక్షణ బాధ్యత తానే వహించాడు. తండ్రి, తల్లి విడిపోయేనాటికి పీటర్ వయసు ఏడేళ్ళు. 1932లో తండ్రి ఛార్లెస్ తన సహాయకురాలు, జానపద సంగీతంపై అమితమైన అభిరుచి కల్గిన రూత్‌ను వివాహం చేసుకున్నాడు. పీటర్ పెద్దన్నయ్య రేడియో ఖగోళశాస్త్రజ్ఞుడు. కాగా, చిన్నన్నయ్య స్కూలు ప్రిన్సిపల్‌గా పనిచేశారు. పీటర్ బాబాయి అలాన్ సేగర్ ప్రసిద్ధ కవి. ఆయన మొదటి ప్రపంచ యుద్ధంలో చనిపోయిన మొదటి అమెరికన్ సైనికులలో ఒకరు. పీటర్ పిన్ని సంతానం మార్గెట్, మైక్, బార్బరా, పెనలోపి జానపదగాయకులుగా పేరుపొందారు. వీరందరూ గాయకులనే పెళ్ళిచేసుకున్నారు. ఆవిధంగా పీటర్ సీగర్ పూర్వీకుల నుండీ గాయక, సంగీత సంప్రదాయంలో వున్నవారే.

ఇక పీటర్ విషయానికి వస్తే, పీటర్ 1943లో తోషి అలీనా ఓటాను వివాహం చేసుకున్నాడు. ఆమె జులై 2013లో మరణించారు. వీరికి పుట్టిన మొదటి శిశువు ఆరునెలల వయసులోనే మరణించింది. మిగిలిన ముగ్గురూ - డేనియల్, ప్రసిద్ధ ఫోటోగ్రాఫర్‌గా, చలనచిత్ర నిర్మాతగానూ, మైకా, కుడ్యచిత్రకారునిగానూ, టిన్యా, - వారి పిల్లలు టావో సంగీతకారునిగా, కేసీ కళాకారిణిగా, కితామా చలనచిత్ర నిర్మాతగానూ స్థిరపడ్డారు.

పీటర్, విద్యార్థిగా వున్నప్పటి నుంచీ సంగీతం పట్ల అభిరుచి పెంపొందించుకున్నాడు. రాజకీయాలు, జానపద సంగీతంపై కేంద్రీకరించడంతో 1938లో మార్కులు సరిగా రాకపోవడంతో గ్రేడు రాక స్కాలర్‌షిప్ పోగొట్టుకుని చదువుకు స్వస్తివాక్యం చెప్పారు. ఆయన 5 తీగల బాంజో, 12 తీగల గిటార్, 4 తీగల యుకులిలి, మాండొలిన్, పియానో మొదలగు వాయిద్యాలను వాడారు.

పీటర్ తన 17వ ఏట యువ కమ్యూనిస్టు లీగ్‌లో సభ్యునిగా చేరాడు. 1942లో అమెరికా కమ్యూనిస్టు పార్టీ సభ్యుడయ్యాడు కానీ 1949లో సభ్యత్వం వదులుకున్నాడు. 1941లో ఈయన విడుదల చేసిన 'సాంగ్స్ ఫర్ జాన్ డో' అనే పాటల ఆల్బమ్‌పై వివాదం చెలరేగింది. ఆ పాటలన్నీ మాస్కో అనుకూలంగా వున్నాయనీ, ఈ పాటలన్నీ అమెరికన్ రాజ్యవ్యవస్థకు, పాలకులకు వ్యతిరేకమైనవనీ, చట్టవ్యతిరేకమనీ, వీటికి కమ్యూనిస్టులో, నాజీలో ఆర్థిక సహాయం అందించి వుంటారనీ, జానపదపాటల ముసుగులో ఇవి ప్రజలలో విషాన్ని తేలిగ్గా ఎక్కిస్తాయనే ప్రచారం పత్రికలలో, ఇతరత్రా జరిగింది.

అప్పట్లో రక్షణ కర్మాగారాల్లో ఆఫ్రికన్ అమెరికన్లు పనిచేయడాన్ని నిషేధించారు. ఇది ఆఫ్రికన్ అమెరికన్లకూ, తెల్లజాతి అభ్యుదయవాదులకు ఆగ్రహం కల్గించింది. యుద్ధ పరిశ్రమలలో చూపే వివక్షకు వ్యతిరేకంగా వాషింగ్టన్‌లో ఒక మహా ప్రదర్శన నిర్వహించడానికి పౌరహక్కుల నాయకులైన ఎ.జె.మస్టీ, నల్లజాతి నాయకులు వి.ఫిలిప్ రాండోల్ఫ్, బయార్డ్ రస్టిన్ నడుం కట్టారు. కాని ప్రెసిడెంట్ రూజ్వెల్ట్ ఇది గమనించి, రక్షణ పరిశ్రమలలో వివక్ష చూపించడాన్ని నిషేధించి, నల్లజాతి ప్రజల ఆగ్రహాన్ని చల్లార్చాడు.

హిట్లర్ సోవియట్ యూనియన్‌పై దాడిచేసిన సందర్భంగా "ప్రియమైన అధ్యక్షా!" అంటూ పీటర్ సీగర్ రాసి గానంచేసిన కవిత ఆయన దృక్పథాన్ని వ్యక్తం చేస్తోంది.

"అధ్యక్షా! గతంలో మనమెప్పుడూ ఏకీభవించలేదు, నాకు తెలుసు
కాని అది ఏమాత్రం ముఖ్యం కాదిప్పుడు
ముఖ్యమైనదేమిటంటే మనమిప్పుడు చెయ్యాల్సినది
హిట్లర్‌ను మట్టిగరిపించాలి
అది పూర్తయ్యేవరకూ, మిగిలినవి పక్కనపెడదాం
"ఇప్పుడు మన మహత్తర మాతృదేశం గురించి ఆలోచిస్తే,
అది దోషరహితం కాదు కాని - ఎప్పటికైనా అవుతుంది.
కొంచెం సమయమీయండి మాకు
ఈ కారణం వల్లనే పోరాడాలనుకుంటున్నా!
అంతా దోషరహితమనీ కాదు, అంతా సవ్యమనీ కాదు
దానికి సరిగ్గా వ్యతిరేకం -

నేను పోరాడుతున్నాను - ఎందుకంటే
నాకు ఇంకా మెరుగైన అమెరికా కావాలి -
మంచి న్యాయవ్యవస్థ కావాలి
వసతి, ఉద్యోగాలు, పాఠశాలలు కావాలి.
నీగ్రోవి కనుక ఈ రైలు ఎక్కవద్దు
యూదువి గనుక ఇక్కడ వుండవద్దు
కార్మిక సంఘంలో వున్నావు గనుక ఇక్కడ పనిచేయవద్దు - "
జిమ్ క్రోలు వద్దు - అటువంటి నియమాలు వద్దు

కనుక అధ్యక్షా!
ఈ బృహత్కార్యక్రమం పూర్తిచేద్దాం
హిట్లర్‌ను మట్టిగరిపిద్దాం
మానవజాతిని అణగద్రొక్కడానికి
అతని స్థానం వేరెవరూ ఆక్రమించరాదు
కనుక నేనడిగేదేమిటంటే
నాకొక తుపాకీ ఇవ్వు -
పని త్వరగా పూర్తిచేద్దాం!"

మెకార్థీ కాలంలో, సీగర్ యుద్ధవ్యతిరేక భావాలను వక్రీకరించి, ఆయన నాజీ జర్మనీని బలిపరుస్తున్నాడనీ ప్రచారం చేశారు. సీగల్ అమెరికా సైన్యంలో విమానాల మెకానిక్‌గా పసిఫిక్ ప్రాంతంలో పనిచేస్తున్నప్పుడు, అమెరికన్ సైనికులకు సంగీతం వినిపించి వారికి ఆహ్లాదం కలిగించే బాధ్యత అప్పచెప్పారు. ఆ తర్వాత సీగర్, ఇతరులతో కలిసి, 'పీపుల్స్ సాంగ్స్' అనే దేశవ్యాప్త సంస్థను ప్రారంభించారు. దీని ఆశయం, కార్మికుల, అమెరికన్ జనసామాన్యపు పాటలను సృష్టించటం, వ్యాప్తిచేయటం. ఈ సంస్థ నిర్వాహకునిగా సీగర్ 1948 అమెరికన్ అధ్యక్ష ఎన్నికలలో రూజ్వెల్ట్‌కు వ్యవసాయ కార్యదర్శిగాను, ఉపాధ్యక్షునిగాను పనిచేసిన హెన్రీ ఎ.వాలెస్ తరపున ప్రచారం చేశారు. వాలెస్ ప్రొగ్రెసివ్ పార్టీ తరపున పోటీచేశారు. అయితే వాలెస్ న్యూయార్క్ నగరంలో మాత్రమే గెలుపొందాడు. కాని తన ఎన్నికల ప్రచారంలో కమ్యూనిస్టులు, వారి అభిమానులైన సీగర్, పాల్ రోబ్సన్‌ల సహాయ సహకారాలు తీసుకున్నందుకు తీవ్ర విమర్శలకు గురయ్యాడు.

స్పానిష్ అంతర్యుద్ధ కాలంలో 1943లో ఇతర గాయకులతో కలిసి 'సాంగ్స్ ఆఫ్ ది లింకన్ బెటాలియన్' పేరుతో ఒక ఆల్బమ్‌ను సీగర్ రూపొందించాడు. దీనిలో "స్పెయిన్‌లో జిరామా అనే లోయ వుంది", "వివాలా క్విన్స్ బ్రిగడా"లాంటి ప్రసిద్ధమైన పాటలున్నాయి. 1960లో మరల ఈ ఆల్బమ్‌ను ఎల్.పి.రికార్డుగా "సాంగ్స్ ఆఫ్ లింకన్ అండ్ ఇంటర్నేషనల్ బ్రిగేడ్' పేరుతో విడుదల చేశారు. రెండోవైపు 1938లో రూపొందించిన ప్రజాస్వామ్యం కోసం ఆరు పాటలు తిరగి విడుదల చేశారు. వీటిని బాంబులు పడుతున్న స్పెయిన్‌లోని బార్సిలోనాలో రికార్డుచేశారు.

రెండు ప్రసిద్ధి చెందిన జానపద గాయకుల బృందాలకు పీటర్ సీగర్ సంస్థాపక సభ్యుడు. మొదటిది 'ది ఆల్మనాక్ సింగర్స్'. ఇది ప్రత్యేకంగా తన పాటల ద్వారా పారిశ్రామిక కార్మిక ఉద్యమాన్ని బలపరిచింది. జాతికి, మతానికి సంబంధించిన అభ్యుదయ సిద్ధాంతాలను ప్రోత్సహించింది. దీనిని 'పాడే వార్తపత్రిక' అన్నారు. రెండో బృందం 'ది వీవర్స్'. 1950లలో కమ్యూనిస్టుల పట్ల తీవ్ర వ్యతిరేకత ప్రబలిన కాలంలో, ఈ బృందసభ్యులు అభ్యుదయకరమైన సందేశాలను పరోక్షమైన పద్ధతిలో ప్రచారం చేశారు. 1953లో ఈ బృందానికి గట్టి దెబ్బ తగిలింది. రేడియోస్టేషన్లు వీరి రికార్డులు ప్రసారం చేయడానికి తిరస్కరించాయి. ఆ తర్వాత ఈ బృందం వారు ఒక సిగరెట్టు కంపెనీ వారి ప్రకటనను అంగీకరించినందుకు పీటర్ సీగర్ ఈ బృందం నుండి రాజీనామా చేశారు.

1950లలోనూ, తన జీవితకాలంలోనూ సీగర్ పౌర, కార్మిక హక్కులకు, జాతి సమానతకు, అంతర్జాతీయ అవగాహన, సైనికపాలన వ్యతిరేకతలకు తన మద్దతు తెలియచేశాడు. ప్రజలు తమ లక్ష్యాన్ని చేరుకోడానికి పాటలు సహాయం చేస్తాయని ఆయన చివరివరకూ విశ్వసించారు. 1956 ప్రాంతంలో సోవియట్ కమ్యూనిజం పట్ల గల భ్రమలు తొలగించుకున్నాడు. 1949లో కమ్యూనిస్టుపార్టీ నుంచి వైదొలగినా, ఆ పార్టీలో కొనసాగినవారితో వాదించినా స్నేహం కొనసాగించారు.

మెకార్థీ వేధింపులలో భాగంగా 1955 ఆగస్టు 18న అమెరికన్ వ్యతిరేక కార్యకలాపాల కమిటీ వారి ముందు సీగర్ విచారణకు హాజరయ్యారు. ఈ విచారణలో ఆ కమిటీ ముందు తన వ్యక్తిగత, రాజకీయ సంబంధాల గురించి వివరాలు ఇవ్వడానికి తిరస్కరించారు. అలా చెప్పడం అమెరికన్ రాజ్యాంగంలో మొదటి సవరణ హక్కు హరించినట్లేనన్నారు.

"నా సంబంధాల గురించి కానీ, నా తాత్విక, మతసంబంధమైన రాజకీయ విశ్వాసాలుగానీ, ఎన్నికలలో ఎవరికి ఓటు వేసానన్న విషయంలోగానీ, వ్యక్తిగత విషయాలు ఏమైనాసరే - వారికి సంబంధించిన ఏ ప్రశ్నకూ జవాబులు ఇవ్వను. ఇటువంటి ప్రశ్నలు ఏ అమెరికన్‌కైనా అసందర్భపు ప్రశ్నలే! అదీగాక ఒత్తిడిచేసి అడిగే ఈ ప్రశ్నలకు సమాధానమీయను" అన్నాడు. ఆ తర్వాత 1957 మార్చి 26న కాంగ్రెసును ధిక్కరించిన నేరంపై ఆయన్ను న్యూయార్క్ వదలివెళ్తే ఫెడరల్ ప్రభుత్వానికి తెలియచేయాలన్న నిబంధన పెట్టారు. మార్చి 1961లో ఒక జూరీ విచారణలో కాంగ్రెసును ధిక్కరించిన నేరానికి ఒక సంవత్సరం జైలుశిక్ష విధించారు. కాని మే 1962లో అప్పీలు కోర్టు ఈ శిక్ష వేయడం తప్పని చెప్పి, శిక్షను రద్దుచేసింది.

1960లో సాన్‌డియాగో స్కూలులో ఏర్పాటుచేసిన సంగీత కచేరి జరగాలంటే - "ఈ కచేరీని కమ్యూనిస్టు భావాలను ప్రచారం చేయడానికిగానీ, ప్రభుత్వాన్ని కూలద్రోయడానికిగానీ ఉపయోగించను" అనే వ్రాతపూర్వకమైన ప్రమాణాన్ని ఇవ్వమని సీగర్‌ను ఆ స్కూలు యాజమాన్యం కోరింది. సహజంగానే అలా చేయడానికి సీగర్ తిరస్కరించాడు. అమెరికన్ పౌరహక్కుల యూనియన్ వారు ఆ స్కూలు పెట్టిన షరతుపై కోర్టులో ఇంజక్షన్ ఆర్డరు తెచ్చి, ముందుగా నిర్ణయించినట్లుగా కచేరీ జరిగేట్లు చేశారు. 50 ఏళ్ళ తర్వాత, 2009 ఫిబ్రవరిలో సాన్‌డియాగో స్కూలువారు, తమ పూర్వీకుల చర్యలకు సీగర్‌ను క్షమించమని కోరారు.

1950ల చివర్లోనూ, 1960ల మొదట్లోనూ ఈయన కార్యక్రమాలపై నిషేధం విధించిన కాలంలో, సీగర్ సంగీత ఉపాధ్యాయునిగా పాఠశాలల్లోనూ, కళాశాలల్లోనూ, వేసవి శిబిరాల్లో పాప్ సంగీతం నేర్పారు. ఆ కాలంలో అణ్వస్త్ర వ్యతిరేక ఉద్యమం ఉధృతం కాగా, సీగర్ రాసి పాడిన యుద్ధ వ్యతిరేక పాటలు - ఉదా : "పూవులన్నీ ఏమైనాయి?","టర్న్! టర్న్! టర్న్!" బాగా ప్రచారమయ్యాయి.

1960లలో ఆయన పౌరహక్కుల ఉద్యమంతో బాగా సన్నిహితంగా వున్నారు. టెన్నీసీలోని హైలాండ్ ఫోక్ స్కూలు కోసం, కార్నె హాల్‌లో ఒక కచేరీని 1963లో జరపడానికి సహాయం చేశారు. ఈ సంఘటనా, మార్టిన్ లూథర్‌కింగ్(జూ) మార్చిలో నిర్వహించిన చలో వాషింగ్టన్ కార్యక్రమంలో పౌరహక్కుల ఉద్యమం వారి గీతం 'వుయ్ షల్ ఓవర్‌కమ్', విస్తృతంగా ప్రజా బాహుళ్యానికి చేరింది.

1963లో సీగర్ ఆస్ట్రేలియాలో పర్యటించారు. ఈ యాత్ర ఆస్ట్రేలియా అంతటా జానపద సంగీతం పట్ల పెద్ద ఆసక్తిని రేకెత్తించింది. దేశవ్యాప్తంగా జానపద క్లబ్బులు పుట్టాయి. జానపద కళాకారులకు కచేరీలలో, ఉత్సవాలలో, టెలివిజన్లలో, రికార్డింగులలో ఆదరణ లభించింది.

టెలివిజన్‌లో సీగర్‌కు విధించిన ఆంక్షలు 1960ల మధ్య అంతమైనాయి. 1965-1966 సంవత్సరాలలో 39 గంటల కార్యక్రమాలు రికార్డైనాయి. 1966లోనే సీగర్ వ్యంగ్య ధోరణిలో ఆనాటి దేశాధ్యక్షుడు లిండన్ జాన్సన్‌పైనా, వియత్నాం యుద్ధం, ఆయుధాల పోటీ మొదలైన అంశాలపై, తన వ్యతిరేకత వ్యక్తంచేస్తూ 'డేంజరస్ సాంగ్స్' (అపాయకరమైన పాటలు) అనే ఆల్బమ్ విడుదల చేశారు.

1967లో 'మొలలోతున బురదమడుగులో' ('Waist Deep in the Big Muddy') అన్న పాటలో రెండవ ప్రపంచయుద్ధంలో ఒక కెప్టెను తెలివితక్కువతనపు ఆజ్ఞల వల్ల తన సైనికులను నీళ్లలో ముంచిన సంఘటన వర్ణించారు. అయితే ఈ పాట, ఈ సంఘటన దేశాధ్యక్షుడైన లిండన్ జాన్సన్‌కు అన్వయిస్తుంది. ఆయనే పెద్ద తెలివితక్కువ కెప్టెను. వియత్నాం యుద్ధం అనే ఊబిలోకి అమెరికన్ సైన్యాన్ని తోసేస్తున్నాడని అంతరార్థం.

1969 నవంబరు 15న వాషింగ్టన్ డి.సి.లో వియత్నాం యుద్ధాన్ని వ్యతిరేకిస్తూ 5లక్షల మందితో సాగిన వియత్నాం మారటోరియం కవాతుకు జాన్ లెనాన్ రాసిన "శాంతికొక అవకాశమీయండి" అనే పాట పాడుతూ సీగర్ నాయకత్వం వహించారు. ఆ ఊరేగింపు వైట్‌హౌస్ దగ్గరకు వెళ్ళినపుడు పాట మధ్యలో సీగర్ తన కంచు కంఠంతో "నిక్సన్! వింటున్నావా?' అనీ, 'నిరసనకారులు మేమంతా అడిగేదొక్కటే - శాంతికి ఒక అవకాశం ఇవ్వండి' అనీ నినదించారు. సీగర్ తన కుటుంబ సభ్యులతో ఉత్తర వియత్నాంలో 1972లో పర్యటించారు.

సీగర్ 1966లో హడ్సన్ నది కాలుష్య నివారణ సంస్థకు ఒక సంస్థాపక సభ్యుడు. ఈ సంస్థ హడ్సన్ నదిలో కాలుష్యాన్ని శుద్ధిపరిచే కార్యక్రమం తీసుకుంది. ఆ సంస్థ వారితో కలిసి పనిచేసిన రోజులు గుర్తుగా సీగర్ 'క్లియర్ వాటర్ క్లాసిక్స్' అనే ఆల్బమ్ విడుదల చేశారు.

పోలెండ్‌లో సాలిడారిటీ ప్రతిఘటన ఉద్యమానికి విరాళాలు సేకరిస్తూ 1982లో ఒక కచేరీ నిర్వహించారు. ఆ విధంగా ఆయన సోవియట్ కమ్యూనిజంపట్ల వ్యక్తిగత అయిష్టతను బహిరంగంగా మొదటిసారి తెలియచేశారు. తన స్వీయచరిత్రలో ఆయన క్రిస్టియన్ అని చెప్పుకునేవారు, 15, 16, 17 శతాబ్దాలలో వున్న మత కోర్టులు శిక్షలు విధించినందుకు ప్రజలను క్షమాపణలు అడగాలి అనీ, ప్రొటెస్టెంట్స్ మతద్రోహుల పేరుతో కొందరిని సజీవంగా అగ్నికి ఆహుతి చేసినందుకూ క్షమాపణలు అడగాలన్నారు. అలాగే మత యుద్ధాలలో యూదులను, ముస్లిములను ఊచకోత కోసినందుకు క్షమాపణలు అడగాలన్నారు. అమెరికాలోని శ్వేతజాతీయులు అమెరికాలోని మూలవాసుల భూమిని దొంగిలించినందుకు నల్లవారిని బానిసలుగా చేసినందుకు క్షమాపణలు అడగాలన్నారు. ప్రపంచవ్యాప్తంగా దేశాలు ఆక్రమించినందుకు ఐరోపావాసులు ప్రపంచ ప్రజలను క్షమించమని అడగాలి. రూజ్వెల్ట్, స్పెయిన్‌కు చెందిన ఫ్రాంకోలు కూడా క్షమాపణలు అడగాలి అన్నారు.

1955లో ఒక ముఖాముఖిలో సీగర్ "నన్ను ఇప్పటికీ కమ్యూనిస్టుగానే పిలుచుకొంటాను" అన్నారు. ఎందుకంటే చర్చిల్లో కనబడే క్రిస్టియానిటీ క్రైస్తవం కాదనీ, రష్యాలోని కమ్యూనిజం, కమ్యూనిజం కాదని వివరించారు.

సీగర్ చనిపోయే వరకూ చురుకుగా కార్యక్రమాలలో పాల్గొన్నారు. 2011 అక్టోబరు 21న ఆయన తన 92వ ఏట ఆక్యుపైవాల్ స్ట్రీట్ ఊరేగింపులో న్యూయార్క్ నగరంలోని కొలంబస్ సర్కిల్‌లో పాల్గొన్నారు. దీనిని 'పీటర్ సీగర్ మార్చ్(కవాతు)' అని పేరు పెట్టారు. ఆ తర్వాత 2012 డిసెంబరు 14న, 2013 ఏప్రిల్ 9న 2013. ఆగస్టు 9న, 2013 సెప్టెంబరు 21న వివిధ కచేరీలలో పాల్గొన్నారు. 2014 జనవరి 27న రాత్రి 9.30కి నిద్రలోనే ప్రశాంతంగా చనిపోయారు. అమెరికా అధ్యక్షుడు బరాక్ ఒబామా, సీగర్ మరణంపై వ్యాఖ్యానిస్తూ "ఎన్నో ఏళ్ళుగా పీటర్ తన గొంతునూ, తన సుత్తినీ కార్మికుల పౌరుల హక్కుల కోసం, ప్రపంచశాంతికోసం, పర్యావరణ పరిరక్షణ కోసం, వుపయోగించాడు- మనలను కూడా తనతో గొంతు కలపమన్నాడు. మనం ఎక్కడి నుంచి వచ్చామో, మనం ఎక్కడికి వెళ్ళాల్సిన అవసరం వుందో - మనకు జ్ఞాపకం చేసిన పీటర్ సీగర్‌కు మనం సదా కృతజ్ఞులమై వుండాలి" అన్నారు. ప్రసిద్ధ కవి కారల్‌సాండ్ బర్గ్ ఈయనను "అమెరికా యొక్క ట్యూనింగ్ ఫోర్క్' అని అభివర్ణించారు.

'పాట' ఒక ఆయుధం - మెరుగైన సమాజ సాధన కోసం పనికొచ్చే పనిముట్టు - ఈ ప్రపంచంలో ఎంతో మంచి సంగీతం వుంది - దాన్ని సరిగ్గా ఉపయోగించుకుంటే సమాజాన్ని రక్షించుకోవచ్చు' అని చెప్పిన సీగర్‌కు ఇదే మా నివాళి. ✤

# చైతన్య గీతిక

**- మండవ సుబ్బారావు**

**మన** తెలంగాణ వచ్చెనని తెగ సంబురాలు చేసుకోకు
కలిమి దొరల భోగాలకు గులాంగిరి చేయబోకు
సామంత ప్రభుల పాలనకు బాంచెనౌతననబోకు
అడ్డమైన చాకిరిలో నడ్డివిరగ గొట్టుకోకు
కాలుమొక్కమనెడి వాన్కి సాగిలపడి మొక్కబోకు
తరతరాల బూజు నెపుడు సరదాకైనా తలకెత్తుకోకు
మరిచిపోకు మరువబోకు
మన తెలంగాణ వీరుల విప్లవ పోరాటం
నిన్న మొన్న ప్రాణాలిచ్చిన
చిన్న చిన్న పోరగాళ్ళ ఆశలను యాదిచేస్కొ
ప్రజారాజ్యం స్థాపించాలి
ముందు తరాల బిడ్డల కోసం
నిరంతరం మనం పోరు సాగించాలి
నిజాయితీని రాపిడి పెట్టాలె అసమానత్వాల అంతం కోసం
నిప్పుకణికలై చైతన్యగీతం పాడాలె !! ✤

# బురదమడుగులో మొలలోతున

- పీటర్ సీగర్
అనువాదం : కొత్తపల్లి రవిబాబు

*(1967లో నేనొక మంచిపాట రాశాను. దేశంలో అందరికీ విన్పించటానికి సమయంలేదు. రోజూ వియత్నాం యుద్ధంలో ప్రజలు వందలాదిగా చనిపోతున్నారు. కొలంబియా కంపెనీ వారిచేత రికార్డు చేయించాను. ఆ రికార్డును దేశంలోని వివిధ ప్రాంతాలలో సరఫరా చేయాల్సిన కొలంబియా కంపెనీ అమ్మకపు శాఖవారు-మమ్మల్ని చూసి హేళనగానవ్వి, వాటిని పంపిణీ చేయకుండా గోడౌన్‌లో పడేశారు.*

*అయితే ఒక హాస్యజంట తను టీ.వీ. షోలో నన్ను అతిథిగా పిలిస్తే, ఆ కార్యక్రమంలో అమెరికన్ సైనికులు నాలుగు విభిన్న యుద్ధాల్లో - (అమెరికన్ విప్లవం, అంతర్యుద్ధం, ప్రథమ ప్రపంచ యుద్ధం వియత్నాం యుద్ధం) - పాడుకునే పాటలు పాడాను. నిజానికి ఇది రెండవ ప్రపంచ యుద్ధంలో సైనిక శిక్షణ పొందుతున్న సైనికులకు సంబంధించిన ఒక కథా గేయం. ఆ యుద్ధంలో ఒక కేప్టెను తన సైనికులను ఒక పెద్ద బురదమడుగుని దాటమని ఆజ్ఞాపిస్తాడు. అయితే దాని లోతుచూసి సార్జంటు వెనక్కి తిరుగుదామని ప్రతిపాదిస్తారు. కాని కేప్టెన్ మాత్రం 'భయపడకండి - నా వెనుకే రండీ' అంటూ ముందుకు సాగి మడుగులో మునిగిపోతాడు. దీన్ని వియత్నాంతో అమెరికా చేస్తున్న యుద్ధంతో పోల్చి అమెరికాను బిగ్‌ఫూల్ అని ఆ సైనికులు తిడతారు.*

*వియత్నాంపై అమెరికా చేసిన యుద్ధంలో పెంటగన్ ఓటమికి గురైనా, అమెరికన్ ప్రజలకు మాత్రం అది విజయం.*

*పాట అనేది ప్రసంగం కాదు. పాట వినేవారి జీవితానుభవాల నేపథ్యంలో అది కొత్త కొత్త అర్థాలను స్ఫురింపచేస్తుంటుంది. ఈ పాటలో ఎక్కడా వియత్నాం పేరుగానీ, అధ్యక్షుడు లిండన్ జాన్సన్ పేరుగానీ వుండదు. చరిత్రలోగానీ, వృత్తి జీవితంలోగానీ ఏదైనా పాట తరచుగా అన్వయించుకోదగినదిగా వుండవచ్చు - అలాంటిదే నేను రాసి పాడిన ఈ పాట)*

**అదంతా** 1941 నాటిమాట
ఒక సైనిక బృందంలో సభ్యుడను నేను
ఒక రాత్రి లూసియానాలో
వెన్నెల కాంతిలో మా సైన్యం కదిలింది
మమ్మల్నొకనది దాటమన్నాడు మా కేప్టెన్
దానితో ప్రారంభమైంది అసలు కథ
ఒక పెద్ద మడుగులో మోకాళ్ళ లోతులో బురద వున్నా
ఆ తెలివితక్కువ దద్దమ్మ
మమ్ములను ముందుకే పొమ్మన్నాడు
సార్జంటు అన్నాడు కదా -
"మీకు ఖచ్చితంగా తెలుసా
మన స్థావరానికి వెళ్ళడానికి
ఇదే అసలుసిసలు మార్గమా?"
"సార్జంట్ - ఈ నది ఎగువున
ఒక మైలు దూరంలో దీనిని నేను దాటాను
కొంత ఒంద్రుగా - జారుతూ వుంటుంది-అంతే
ఇది దాటితే పొడినేల వచ్చేస్తుంది"
మేము మొల లోతున ఆ పెద్దమడుగులో...
ఆ పూల్ ముందుకే మున్ముందుకే సాగమన్నాడు
సార్జంటు అన్నాడు కదా
"ఈ బరువంతా వేసుకొని
ఎవడూ ఈదలేడు"
దానికి కేప్టెన్ జవాబు
"సార్జంట్! ధైర్యం కోల్పోకు
మనకిప్పుడు కావాల్సింది కృతనిశ్చయం
నా వెనక రండి - "
ఆ పెద్ద మడుగులో మెడలోతు దిగబడ్డాం
ఆ గాడిద మమ్ములను ముందుకే సాగమన్నాడు.
అకస్మాత్తుగా చందమామను మేఘాలు
కమ్మివేసాయి
మాకు వినబడింది గళగళ ధ్వని
అప్పుడే చూసాం మా కేప్టెన్ శిరస్త్రాణం
నీళ్ళలో తేలుతోంది
సార్జంటు అరిచాడు
"వెనక్కి తిరగండి
ఈ క్షణం నుంచి నేనే మీకు నాయకుణ్ణి"
వెంటనే ఆ మడుగు నుంచి బయటపడ్డాం
కేప్టెన్ చనిపోయాడు పాపం నదిలోపల
అంతకు ముందు దాటిన ఆ ప్రదేశంలో
ఊబిలో దొరికిన అతని శవాన్ని తెచ్చాం
అంత లోతుందని
అతనికి తెలియదేమో -
మేము దిగిన చోటుకు
అరమైలు ఎగువన
మా అదృష్టం -
ఈ మడుగులో మరోపాయ కలిసింది
మా దద్దమ్మ ముందుకు సాగమని చెప్పిన
ఆ మడుగులోంచి బయటపడ్డాం
నేనేమీ నీతిబోధ చేయబోవడం లేదు
అదంతా మీకు వదిలేస్తున్నా
మీరు ఆరోగ్యాన్ని సంరక్షించుకుంటూ
నడుస్తుండవచ్చు - మాట్లాడుతుండవచ్చు
కాని పత్రికలు చదివినప్పుడల్లా
ఆ పాత సన్నివేశం గుర్తొస్తుంది
మేమంతా మొలలోతు ఆ మడుగులో వున్నాం
తెలివితక్కువ దద్దమ్మ ముందుకే సాగమన్నాడు
మొలలోతులో బురదమడుగులో
ఆ గాడిద ముందుకే పొమ్మన్నాడు
మొలలోతులో, మెడలోతులో
పొడుగాటి వాడు కూడా మునిగిపోతాడు
మొలలోతులో...
ఆ దద్దమ్మ ముందుకే సాగమన్నాడు ✤

# ఈశాన్యంపై వర్ణ వివక్ష

ఈశాన్య రాష్ట్రాల పట్ల భారత రాజ్యవ్యవస్థ క్రూర అణచివేత పద్ధతులను అనుసరిస్తుంటే, భారతీయ ప్రధాన ప్రవాహపు సంస్కృతి వర్ణ వివక్షను పాటిస్తున్నట్లు ఇటీవలి కొన్ని సంఘటనలు రుజువు పరుస్తున్నాయి. గత జనవరి 29న ఢిల్లీ మహానగరంలో నిడో టానియా అనే అరుణాచలప్రదేశ్‌కు చెందిన విద్యార్థి హత్య దీనికొక ప్రత్యక్ష సాక్ష్యం. నిడో జలంధర్‌లో చదువుకుంటూ ఆరోజు ఢిల్లీలోని లజ్‌పత్‌నగర్ ప్రాంతానికి వచ్చాడు. తనకు కావాల్సిన ఇంటి సమాచారాన్ని తెలుసుకునే క్రమంలో అతని రంగు, మాట, వేషధారణలను చూసి స్థానికులు ఎగతాళి పట్టించటంతో ఎదురుతిరిగాడు. అది భౌతిక ఘర్షణగా పరిణమించి అతని చావుకి కారణమైంది. నిడో టానియా అరుణాచలప్రదేశ్‌లో కాంగ్రెసు ఎం.ఎల్.ఎ. అయిన నిడో పవిత్ర కుమారుడు. ఈ హత్య దేశ రాజధానిలో వుంటున్న ఈశాన్య రాష్ట్రాల వారిలో తీవ్ర అలజడిని రేపింది. పోలీసులు నిడో నిరక్షించలేకపోయారనీ, ఢిల్లీవాసులు వర్ణవివక్షను ప్రదర్శించారనీ, గాయపడిన వ్యక్తిని వైద్యశాలకు తరలించేవారే లేకపోయారనీ విమర్శిస్తున్నారు. సంవత్సరన్నర క్రితం రిచర్డ్ లాయిటామ్ అనే మణిపూర్‌కు చెందిన విద్యార్థి తాను చదువుతోన్న బెంగుళూరు కళాశాల హాస్టల్ గదిలో హత్యకు గురయ్యాడు. ఈ దుర్ఘటన చాలా తీవ్రసంచలనం కలిగించగా, ఈశాన్య ప్రాంతీయులంతా తమ స్వస్థలాలకు వెళ్ళిపోవటానికి ఏర్పాటుచేసిన ప్రత్యేక రైళ్ళకు ప్రత్యేక భద్రతను కూడా కల్పించాల్సి వచ్చింది. అదే కాలంలో చండీఘడ్‌లో ఎం.బి.ఎ. చదువుతూండిన మేఘాలయకు చెందిన సిల్వా సంగ్మా (మేఘాలయ ముఖ్యమంత్రి ముకుల్ సంగ్మా కూతురు) ఆత్మహత్య చేసుకుంది. అసలు కారణాలు తెలియరాలేదుగానీ ఆమె పరీక్షహాలుకు సెల్‌ఫోను తీసుకెళ్ళి పట్టుబడినందువల్ల అలా జరిగిందని మీడియాకు సమాచారమిచ్చారు.

నిజానికి ఈశాన్య భారతం బ్రిటీషు వలసవాదుల నుండి వారసత్వంగా వచ్చి భారతదేశంలో కలిసిందిగానీ, అది ఢిల్లీ పాలకుల హయాంలో ఢిల్లీ పాలన క్రింద గత చరిత్రలో ఎన్నడూలేదు. (దక్షిణాది రాష్ట్రాలు కూడా దాదాపు అంతే.) మానవశరీర శాస్త్రం(ఆంత్రొపాలజీ) ప్రకారం వారు మంగోలాయిడ్ జాతులకు చెందినవారు. బ్రిటీషువారు తెరమరుగైన తర్వాత తమకూ స్వయంపాలన, స్వాతంత్ర్యం కావాలని డిమాండ్‌చేస్తూ అనేక రూపాల్లో పోరాడుతున్నారు. వారిని అణచివుంచటానికే 1958లో సాయుధదళాల ప్రత్యేకాధికారాల చట్టం రూపొందించి ఈశాన్య రాష్ట్రాలలో సుమారు 5 లక్షలు, జమ్మూ-కాశ్మీరులో 5 లక్షల సైన్యాన్ని కాపలాగా వుంచటం ద్వారా భారత పాలకులు దేశ 'సమగ్రత'ను కాపాడుతున్నారు. ప్రత్యేకధికారాల ద్వారా లభించిన యధేచ్ఛతో సాయుధదళాలు సాగించే అత్యాచారాలకు నిరసనగా 2005లో మహిళలు కొందరు మణిపూర్ రాజధాని ఇంఫాల్‌లో దిగంబరంగా ఊరేగింపు జరిపి "భారత సైనికులారా మమ్ములను రేప్ చేసుకోండి" అని నిరసనకు తెగించారు. గత 13 సంవత్సరాలకు పైగా మణిపూర్ రాజధాని ఇంఫాల్‌లో ఐరోమ్ షర్మిల అనే మహిళ సాయుధదళాలను ఉపసంహరించాలని డిమాండ్‌చేస్తూ ఆమరణ నిరహారదీక్ష జరుపుతుంటే ఆమెను ప్రభుత్వాసుపత్రికి తరలించి ఫ్లూయిడ్స్ ద్వారా ఇన్నేళ్ళుగా ప్రభుత్వం బతికిస్తోంది.

ఇప్పుడు ఢిల్లీ, బెంగుళూరుల్లో జరిగిన ఘటనలు సాంస్కృతిక స్థాయిలో మిగిలిన భారతీయులు ఈశాన్య ప్రాంతీయుల పట్ల చూపుతున్న వివక్షకు నిదర్శనంగా ఉన్నాయి. వీటిని భారతీయులు ఖండించాల్సి వుంది. వర్ణ, జాతి, లింగ, ప్రాంత, కుల వివక్షలను వదిలించుకోలేని దేశమూ, జాతులూ ప్రజాస్వామికం కాలేవు. ప్రజాస్వామిక సంస్కృతిని ఆకాంక్షించేవారందరూ ఈశాన్య జాతులపట్ల ప్రదర్శితమవుతున్న 'వర్ణ' వివక్షను ఖండించాలి. అక్కడ ప్రజలపై ముఖ్యంగా మహిళలపై సాగుతున్న సాయుధదళాల అత్యాచారాలపై జస్టిస్ జగన్మోహనరెడ్డి లాంటివారు ఎపుడో యిచ్చిన నివేదికను అమలుపరచమని డిమాండ్ చేయాలి. 

# మహిళల సమస్యలపై పుస్తకావిష్కరణకు కలకత్తా బుక్ ఫెయిర్ అభ్యంతరం

**38వ** అంతర్జాతీయ కలకత్తా బుక్‌ఫెయిర్ జనవరి 29 నుండి ఫిబ్రవరి 9 వరకు జరిగింది. దీనిని గత 37 సంవత్సరాలుగా పబ్లిషర్స్ అండ్ బుక్ సెల్లర్స్ గిల్డ్ వారు నిర్వహిస్తున్నారు. ఈ ఏడాది దాదాపు 110 మంది ప్రచురణకర్తలు దీనిలో పాల్గొన్నారు.

అయితే ఫిబ్రవరి 4న జరగాల్సిన ఒక పుస్తకావిష్కరణ సభకు వేదికనీయడానికి బుక్‌ఫెయిర్ కమిటీవారు తిరస్కరించారు. 'నారీ నిర్యాతన ప్రతిరోధ కమిటీ'వారు ఈ పుస్తకావిష్కరణ సభను ఏర్పాటుచేశారు. సేతు ప్రకాశిని వారు ప్రచురించారు. ఆ పుస్తకం పేరు "పిరిజాయీ నారీ ఓ మానవాధికార్' (వలసలుపోతున్న స్త్రీలు – వారి మానవహక్కులు). దీని రచయిత్రి యశోధర బాగ్చీ. మైత్రీయీ చటోపాధ్యాయ స్మారక సంస్థ వారి మొదటి స్మారకసభలో 2013లో ఆమె ప్రసంగించారు. ఆ ప్రసంగం ఆధారంగా రూపొందించిన పుస్తకం ఇది. దీనిలో వలసలకుపోయే స్త్రీల బాధల గాథలు, పెళ్ళిళ్ళు, విడాకులు, పని, వ్యభిచారం మొదలైన వాటివల్ల స్త్రీలు ఎదుర్కొంటున్న సమస్యలను రచయిత్రి విశ్లేషించారు. స్త్రీల స్థితిగతులపై పశ్చిమ బెంగాల్ ప్రభుత్వం నియమించిన మహిళా కమీషన్‌కు గతంలో వీరు అధ్యక్షురాలిగా పనిచేశారు. ఈ పుస్తకంలో ఏ వర్గంవారి మనోభావాలను గాయపరిచే విషయాలు లేవు. రాజకీయ వివాదాలు సృష్టించే అంశాలు లేవు.

కాని స్త్రీలపై అత్యాచారాలను నిషేధించడంలో పశ్చిమబెంగాల్ ప్రభుత్వం ఘోరంగా విఫలమైందని తీవ్రంగా విమర్శించే మిరాతున్ నహార్ ఈ పుస్తకాన్ని ఆవిష్కరించాలి. ఈ ఆవిష్కరణసభలో నహార్ ప్రభుత్వాన్ని విమర్శిస్తారనీ, అప్పుడు ముఖ్యమంత్రి మమతకు ఆగ్రహం వస్తుందన్న భయంతో ది బుక్ ఫెయిర్ నిర్వాహకులు ఈ ఆవిష్కరణ సభకు అనుమతి నిరాకరించారు.

ముఖ్యమంత్రిగా మహిళ వున్నా కూడా, మహిళల స్థితిగతుల గురించి ప్రజాస్వామికంగా చర్చించడానికీ, విమర్శించడానికీ అవకాశంలేని దుర్దశ నుంచి బయటపడటానికి ఎన్నో పోరాటాలు, త్యాగాలు చేయవలసి వుంటుంది.

బుక్‌ఫెయిర్ కమిటీ వారి ఈ చర్యను మేధావులు పలువురు ఖండించారు. ప్రజాస్వామిక హక్కుల పరిరక్షణ సంస్థ (ఎపిడిఆర్) దీనిని ఖండిస్తూ ఒక ప్రకటన విడుదల చేసింది. అయితే, ఈ పుస్తకాన్ని 7వ తేదీ శుక్రవారం కలకత్తా ప్రెస్‌క్లబ్‌లో ఆవిష్కరించారు. 

# మతమౌఢ్యపు అసహనం

ప్రముఖ ఇండాలజిస్టు (భారత చరిత్ర అధ్యయనవేత్త) వెండీ డోనిజర్ అనే రచయిత్రి రాసిన "ది హిందూస్ – యాన్ ఆల్టర్నేటివ్ హిస్టరీ" (హిందువులు – ఒక ప్రత్యామ్నాయ చరిత్ర") అనే పుస్తకాన్ని ప్రపంచ ప్రసిద్ధ ప్రచురణకర్తలు పెంగ్విన్ వారి ఇండియా శాఖ ప్రచురించింది. 2009లో అది అత్యధికంగా అమ్ముడుపోయిన పుస్తకంగా నమోదయ్యింది. అయితే 2010లో ఒక హిందూ ఛాందస సంస్థ ఐన "శిక్షా బచావ్ ఆందోళన్" వారు పెంగ్విన్ వారికి ఒక లీగల్ హెచ్చరిక పంపించారు. దానిలో వారు ప్రచురణకర్త, రచయిత్రి బేషరతుగా క్షమాపణ చెప్పి, పుస్తకాన్ని అమ్మకాల నుండి ఉపసంహరించుకోవాలని కోరారు. ఆవిధంగా ఆ కేసు న్యాయపోరాటాల్లో కొనసాగుతూ వుంది.

భారతీయులు తన విశ్లేషణ చదవాలని రచయిత్రి వెండీ డోనిజర్ కోరిక. కనుక సుదీర్ఘమైన న్యాయ పోరాటాలు 2009 నుండీ పెంగ్విన్ చేసింది. కాని దేశంలో పరిస్థితులు ఎలా మారాయంటే ఇతరుల 'మనోభావాలు కించపరచడం' అన్న సాకుతో తమకు నచ్చని, తమను విమర్శించే పుస్తకాలపై, చిత్రాలపై దాడిచేయడం సర్వసాధారణమైపోయింది. "ఒక చెడు ఉద్దేశంతో ఏ ప్రజల మతాన్నికానీ, మత విశ్వాసాలను కానీ అవమానపరిచినా, అటువంటి ప్రయత్నం చేసినా" ఇండియన్ పీనల్ కోడ్ (భారత శిక్షాస్మృతి) ప్రకారం శికార్హులు. దీనిని ఉపయోగించుకొని ప్రచురణకర్తలపై, వ్యక్తులపై దాడులు చేస్తున్నారు.

దీనానాథ్ బత్రా అనే విశ్రాంత ప్రధానోపాధ్యాయుడు స్థాపించిన ఈ శిక్షా బచావ్ ఆందోళన్ సమితి వారి అభ్యంతరం ఏమిటంటే, ఈ పుస్తకంలోని సూత్రీకరణలు ఫ్రాయిడ్ మనో వైజ్ఞానిక విశ్లేషణా పద్ధతిపై ఆధారపడి వున్నాయనీ, ఫ్రాయిడ్ అంటే లైంగిక విషయాలపై కేంద్రీకరించినవాడనీ – ఈ రచయిత్రి 'సెక్స్ హంగ్రీ' రచయిత అనీ!

గతంలో మహారాష్ట్ర ప్రభుత్వంపై వత్తిడి తెచ్చి "శివాజీ! ముస్లిమ్ రాజ్యంలో హిందూ రాజు" అనే పుస్తకాన్ని ఇటువంటి ఆందోళనాకారులే నిషేధింపచేసారు. ఆ సందర్భంగా భండార్కర్ ఓరియంటల్ రిసెర్చి ఇన్‌స్టిట్యూట్‌పై దాడిచేసి ఎన్నో విలువైన అపురూపమైన గ్రంథాలను విధ్వంసం చేశారు.

ఇవన్నీ భావప్రకటనా స్వాతంత్ర్యాన్నీ, వాక్స్వాతంత్ర్యాన్నీ అరికట్టే చర్యలే. కొత్త ఆలోచనలు, కొత్త భావాలు, కొత్త విశ్లేషణలను నిరోధించడం ప్రారంభిస్తే మన ఆలోచనలు నిలువనీటిలాగా కుళ్ళిపోవడం తప్ప ఏ అభివృద్ధీ వుండదు.

భావప్రకటనాస్వాతంత్ర్యంపై, వాక్స్వాతంత్ర్యంపై జరిగే ఇటువంటి చర్యలన్నింటినీ తీవ్రంగా ఖండించడం ప్రజాస్వామికవాదులందరి కర్తవ్యం.

✤

# తెలుగు వికీపీడియా (తెవికీ) దశాబ్ది ఉత్సవాలు

**వికీపీడియా** అనేపదం ఎన్‌సైక్లోపీడియా (విజ్ఞాన సర్వస్వం) అనే పదం నుండి రూపొందించారు. ఎన్‌సైక్లోపీడియా అచ్చులో వుంటుంది. వికీపీడియా ఇంటర్నెట్‌లో ఒక వెబ్‌సైటుగా వుంటుంది. హవాయి భాషలో వికీ అంటే వేగం అని అర్థం. అంటే వేగవంతమైన విజ్ఞాన భాండాగారం అన్నమాట. దీనిని స్వేచ్ఛా విజ్ఞాన సర్వస్వమనవచ్చు. ఎందుకంటే మనకు తెలిసిన విషయాలపై వ్యాసాలను, వివరాలను ఈ వికీపీడియాకు పంపించవచ్చు. ఆ విషయంపై అంతకు ముందే ఎటువంటి సమాచారం లేకపోతే, మనం పంపించిందే దానిలో చేరుస్తారు. ఒక్కోసారి ఇప్పటికే పొందుపరిచిన విషయాలలో తప్పులు వుంటే మనమే వాటిని సరిచేయవచ్చు

వికీపీడియా 2001 జనవరి 16న ప్రారంభమైంది. ప్రస్తుతం ఇది 287 భాషలలో వుంది. దీని వ్యవస్థాపకులు జిమ్మీ వేల్స్. లారీ సాంగర్‌లు. ఇంగ్లీషు వికీపీడియా ప్రారంభమైన రెండేళ్ళకే తెలుగు వికీపీడియా మొదటిపేజీ 2003 డిసెంబర్ 10న బోస్టన్ నగరంలో సమాచార సాంకేతిక నిపుణుడిగా పనిచేస్తున్న వెన్న నాగార్జున రూపొందించారు. ఆ తర్వాత రవి వైజాసత్య(మిన్నిసోటా), మాకినేని ప్రదీపు(బెంగుళూరు). తుమ్మల శిరీష్(చదువరి–హైదరాబాదు), వీవెన్(వీరవెంకట చౌదరి), కొలిచాల సురేశ్, ఇంద్రగంటి పద్మ, నల్లమోతు శ్రీధర్, టి.సుజాత మొదలైన ఎందరో దీని అభివృద్ధికి కృషిచేస్తున్నారు.

ప్రస్తుతం తెలుగు వికీపీడియా(తెవికీ)లో 51,287 వ్యాసాలున్నాయి. ఈ సంఖ్య రోజురోజుకీ పెరుగుతూ వుంటుంది. తెవికీ కి అనుబంధంగా విక్షనరీ, వికీసోర్సులు ప్రారంభమైనాయి. విక్షనరీ అంటే బహుభాషా నిఘంటువు. ప్రస్తుతం దీనిలో 57వేల పైన పుటలున్నాయి. వికీసోర్సులో అత్యంత విలువైన సాహిత్యం డిజిటల్ రూపంలో భద్రపరుస్తారు.

తెవికీ 10వ వార్షికోత్సవ వేడుకలు ఫిబ్రవరి 15, 16 తేదీలలో విజయవాడ కాకరపర్తి భావనారాయణ కళాశాలలో జరిగాయి. 15వ తేదీ మధ్యాహ్నం కార్యక్రమంలో ప్రజాసాహితి పాల్గొంది. దశాబ్ది ఉత్సవాల సందర్భంగా కొమర్రాజు లక్ష్మణరావు పేరుతో ప్రారంభించిన బహుమతులు, ఈ రంగంలో స్వచ్ఛందంగా పనిచేస్తున్న వీవెన్, ప్రదీప్, రవిచంద్ర, చరణ్, భాస్కర్, అహ్మద్ నిసార్, శశిధర్, రామకృష్ణారెడ్డి తదితరులు అందుకున్నారు.

ప్రగతిశీల, విప్లవ ఉద్యమాలపైగూడా తెలుగు వికీపీడియాలో సమాచారం, వ్యాసాలు, జీవిత చరిత్రలు చేర్చాల్సి వుంది.

✤

# రైతన్నల ఆవేదన

- తుర్లపాటి రామమోహనరావు

ఏవిరా ఆనాటి నాగళ్ళు
అరె! ఏవిరా రైతన్న కొడవళ్ళు
నాటికి ఈనాటికి మన సేద్యమే గతి మారిపోయెర ॥ ఏవిరా ॥

విత్తడానికి, నాటడానికి
కోతకొయ్యను కుప్పనూర్చను
కూలి నాలి పొట్టగొట్టగ
యంత్ర భూతములొచ్చె గదరా ॥ ఏవిరా ॥

ఎడ్లు బోయె గొడ్లు బోయె
ఏరువాకలు నిలిచిపాయె
సంకురాతిరి పండగొచ్చి
సప్పగానే ఎల్లిపాయె ॥ ఏవిరా ॥

సజ్జలారిక జొన్న కూళ్ళు
సూతమన్నా కళ్ళ ఒడవు
సద్దికూళ్ళు మోటు మోటని
పిజ్జ బర్గరు ఫాషనంటిరి ॥ ఏవిరా ॥

సల్ల అంబలి దాగెటోళ్ళు
సార బ్రాందీ మరిగినారు
ఇల్లు గుల్లై ఒళ్ళు గుల్లై
భూమి పుట్రా అమ్ముకున్నరు ॥ ఏవిరా ॥

గిట్టుబాటు ధరలు రాక
వడ్డీ కొడ్డీ గట్టలేక
రైతు వెన్ను విరిగిపాయె
ఆత్మహత్యలె శరణమాయె ॥ ఏవిరా ॥

ఎరువులా ధరలెక్కిపాయె
పురుగుమందుల ధరలు బెరిగే
విత్తనాలకు కరువు వచ్చి
సేద్యమే ఒక దండగాయె ॥ ఏవిరా ॥

ఫ్యాక్టరీలు బెట్టడానికి
ప్రాజెక్టు కట్టడానికి
రోడ్లు వెయ్యను బ్రిడ్జిగట్టను
రైతు భూములె గుంజుకొంటిర ॥ ఏవిరా ॥

మాయదారి సెజ్జులొచ్చి
పంటభూములు ఆగమాయెన
పచ్చపచ్చని భూములన్నీ
ప్లాట్లుజేసే జూదమాయెన ॥ ఏవిరా ॥

రైతుకష్టం దీరడానికి
రైతు రాజ్యం రావడానికి
పోరుజెండా నీడలోన
పోరుజేయగ సాగిరార ॥ ఏవిరా ॥

## పరిచయం

### తెలుగు జానపద కళ

కవిత్వం - కథ, విమర్శ, బొమ్మలాట, రంగస్థల, రేడియో, టీ.వీ.లలో నటన, చిత్రలేఖనం, జానపదకళలలో విశేష కృషి చేసిన తాతా రమేశ్ బాబు 2012 ఆగస్టు 6, 7, 8, 9 తేదీలలో గుడివాడ నుండి అద్దంకిదాకా, మూడు జిల్లాలలో చేసిన తొలి తెలుగు జానపద కళాచైతన్యయాత్ర విశేషాలతోనూ, పాల్గొన్న కళాకారుల, జానపద కళాపరిశోధకుల వివరాలు, ఛాయాచిత్రాలతోనూ రూపొందించిన వ్యాసాల సంకలనం ఇది. ఈ పుస్తకం రెండవ భాగంలో ప్రముఖుల వ్యాసాలు అనే భాగంలో ఆరుద్ర, బి. జ్యోతి స్వరూపారాణి, యు. దేవపాలన, చిట్టినేని శివకోటేశ్వరరావు, పేట శ్రీనివాసులు రెడ్డి, జ్యోతి చంద్రమౌళి, దామెర వెంకటసుబ్బారావు, మహత్మ, బీరం సుందరరావు, జి.రాధ, కొత్తపల్లి రవిబాబు, ఎం.కె.దేవకి, మూలె రామమునిరెడ్డి, కసిరెడ్డి వెంకటరెడ్డి, పొద్దుటూరి ఎల్లారెడ్డి, టి. ఉదయశంకర్‌ల వ్యాసాలు జానపద కళలను వివిధ కోణాల్లో పరామర్శించాయి.

ఇవిగాక 'పగటివేషాలు - సామాజికాంశాలు', 'తెలుగు వాకిట 'బొమ్మలాట', కృష్ణాజిల్లా జానపద కళలు', 'కొన్ని జానపద కళారూపాలు' అనే వ్యాసాలను చివర్లో ప్రచురించారు.

. జానపద కళా సాహిత్యాలపై అభిరుచి వున్న వారందరికీ ఆకర గ్రంథంగా ఉపయోగపడే 272 పుటలు గల ఈ పుస్తకం వెల : 200/- ప్రథమ ముద్రణ : 9 ఆగస్టు, 2012.

### జ్ఞాపిక : తరతరాల గుడివాడ ప్రాంత శత కవితలు

ఇటీవల ఆయా ప్రాంతాలవారి కథలు సంకలనాలుగా చూస్తున్నాం. అయితే ఇది 'తరతరాల గుడివాడ ప్రాంత శతకవితల' సంకలనం. సంపాదకుడు తాతా రమేశ్‌బాబు గుడివాడ ప్రాంత కవుల కవిత్వాన్ని పరిచయం చేయడం ప్రధాన లక్ష్యంగా ఈ సంపుటిని ప్రచురించారు.

దీనిని మూడు భాగాలుగా - నాటి కవుల విభాగం, నేటి కవుల విభాగం, రేపటి కవులవిభాగం-విడదీశారు. ఈ మూడు విభాగాల్లోనూ, ఆయా కాలాల్లోని ప్రసిద్ధ కవులూ, అప్రసిద్ధ కవులూ వున్నారు. మాదయ్య కవి, దగ్గుపల్లి దుగ్గయ్య, ఉప్పులూరి కనకయ్య, దాసు శ్రీరాములు గాక విశ్వనాథ సత్యనారాయణ, చలం, నార్ల, బాలబంధు, ఆత్రేయ, వడ్డెర చండీదాసు, బందారు పాపారావు, యలమంచిలి శ్రీరాములు మొదలగువారి కవితలు మొదటి భాగంలో వున్నాయి. నేటి కవుల విభాగంలో అక్కినేని నాగేశ్వరరావు, కె.జి.సత్యమూర్తి, జాలాది, చలసాని ప్రసాద్, సుంకర అప్పాజీ, రుద్రజ్వాల, వసుధ, గుత్తికొండ అహల్యాదేవి, సాహితీ ప్రియ మొదలగువారి రచనలున్నాయి. రేపటి కవుల విభాగంలో తాతా జ్ఞాపిక, వెలగాడ పార్వతి, చవల లతాశ్రీ, నగిరెడ్డి హేమలత మొదలగువారి కవితలున్నాయి. అంటే 1485 నాటి మాదయ్య కవి నుండి 1997 నాటి నగిరెడ్డి హేమలత వరకు ఈ సంపుటిలో తమ రచనలతో సాక్షాత్కరిస్తారు.

160 పుటలున్న ఈ పుస్తకం ధర రూ. 100/- ప్రథమ ముద్రణ అక్టోబరు, 2011.

**పై రెండు పుస్తకాల ప్రతులకు :**

**తాతా జానకి, 14/161-2, స్టేషన్ రోడ్, గుడివాడ - 521 301.**
**సంచారవాణి : 94415 18715.**
E-Mail : rbtata@gmail.com




**19-1-2014 విజయవాడ :**

ప్రతినెలా 3వ ఆదివారం జనసాహితి ఆధ్వర్యంలో విజయవాడలో నిర్వహించే సాహిత్యసభను '2013లో తెలుగు కవిత్వం'పై జరిగింది. సభకు కవి చిత్తలూరి సత్యనారాయణ అధ్యక్షతవహించారు. ప్రతినెలా అందించే సాహిత్య నివాళిని వల్లంపాటి వెంకటసుబ్బయ్యకు సింగంపల్లి అశోక్‌కుమార్ సమర్పించారు. 2013లో కవిత్వం గురించి మాట్లాడేందుకు సమయం చిక్కకపోవటంతో స్థూలంగా 2013దాకా తెలుగు కవిత్వం అనే అంశంను వివరిస్తూ కవి, విమర్శకుడు కొప్పర్తి వెంకటరమణమూర్తి ప్రసంగించారు. వస్తు వైవిధ్యాన్ని కవులు విస్తారంగా పాటించిన దాన్ని ప్రస్తావిస్తూ శిల్పంలో విశేషమైన కృషి జరుగుతోందన్నారు. కె. శివారెడ్డి, పాపినేని శివశంకర్‌ల కవిత్వాన్ని గురించి మాట్లాడుతూ వారు కవులుగా ప్రారంభమైన నాటి వస్తునిష్టలో మార్పుతీసుకోకుండానే శిల్ప వైశిష్ట్యాన్నీ, విస్తృతినీ సాధిస్తున్నారని చెప్పారు. ఈ అంశంపై స్పందిస్తూ అరసవిల్లి కృష్ణ(విరసం)పై అభిప్రాయంతో తాను విభేదిస్తున్నట్లు చెప్పారు. లఘు కవిత్వంపై ప్రసంగించాల్సిన రావి రంగారావు హాజరుకాలేదు. ప్రసంగవ్యాసాన్ని పంపారు. దాన్ని దివికుమార్ చదివి వినిపించారు. అందులో "యుద్ధమూ - శాంతి"పై కవితను విశ్లేషిస్తూ యుద్ధం వద్దు శాంతి కావాలనేది సాధారణ ప్రకటనే కాని ఆచరణాత్మక సమస్యగా తీసుకున్నప్పుడు శాంతి కావాలంటే, అశాంతి శక్తులతో ప్రస్తుత ప్రపంచంలో సామ్రాజ్యవాదంతో యుద్ధం చేయక తప్పదనీ శాంతికీ యుద్ధానికీ నడుమ నుండే గతితార్కిక సంబంధం చూడాలే కానీ ఉత్త ఆదర్శవాదం నిష్ప్రయోజనమనీ చెప్పారు. సింగంపల్లి అశోక్‌కుమార్, రావి రంగారావు గొప్పదని ఉల్లేఖించిన (సూర్యారావు) లఘుకవిత అనుకరణ అనీ విమర్శించారు. అధ్యక్షుని వివరణతో చర్చ వస్తువు - రూపమూ పై రసవత్తరంగా సాగింది. వస్తువు కోసం శిల్పముందిగానీ శిల్పం కోసం వస్తువులేదనీ, రూపానికి (formకి) మోసంచేసే గుణమున్నదనీ, తత్త్వశాస్త్రంలో భౌతికవాదం - భావవాదం అర్థమయితేకానీ వస్తు-రూపాల చర్చకు శాస్త్రీయత కలుగదనీ దివికుమార్ వివరించారు.

**26-1-2014 నాగాయలంక** లో జనవరి12న మరణించిన సజ్జా నారాయణరావుగారి సంతాపసభ నిమ్మగడ్డ శేషగిరిరావు అధ్యక్షతన జరిగింది.

రైతుకూలీసంఘం కార్యదర్శి కొప్పుల కోటయ్య సజ్జా నారాయణ రావుగారి కృషిని గుర్తుచేసుకుంటూ తొలితరం కమ్యూనిస్టులపై బనాయించిన కుట్రకేసులు, నిషేధాలు, చిత్రహింసలు, ఎన్‌కౌంటర్లు గురించీ, కమ్యూనిస్టు పార్టీ స్థాపన, రహస్యకృషి మొదలైన విషయాలు వివరించి దివి తాలూకాలో కమ్యూనిస్టుల ప్రభావం ఎంత బలంగా వుండేదో జ్ఞాపకం చేసుకున్నారు. ఎం.ఎల్.పార్టీ బాధ్యులు ముప్పాళ్ళ భార్గవశ్రీ మాట్లాడుతూ తొలితరం ఆదర్శాలను కొనసాగించాల్సిన బాధ్యత మనమీద వుందనీ, పళనియప్పన్ సాగించిన హత్యాకాండలో ఎందరో చనిపోయారని, గ్రామాలపై పోలీసుదాడులు జరిపి, కాన్‌సెంట్రేషన్ క్యాంపుల్లో చిత్రహింసలు చేశారనీ చెప్పారు.

జనసాహితి ప్రధాన కార్యదర్శి దివికుమార్ నారాయణరావుగారిని జ్ఞాపకం చేసుకుంటూ 1977లో ఉప్పెన వచ్చినపుడు, సహాయ కార్యక్రమాలలో పాల్గొన్నవారికి వారి ఇల్లు ఒక ఆశ్రయంగా ఉండేదని చెప్పారు.

'ప్రజాసాహితి' ప్రధాన సంపాదకుడు కొత్తపల్లి రవిబాబు తన ప్రసంగంలో చనిపోయినవారు పంచభూతాలలో కలిసిపోతారనీ, మరణానంతర జీవితం, స్వర్గం, నరకం, వైతరణీనది దాటడం పురోహితులకు 16 దానాలు ఇవ్వడం, కర్మకాండ చేయకపోతే ఆత్మలు ఇక్కడే అసంతృప్తిగా తిరుగుతాయన్న నమ్మకం మొదలైనవన్నీ అశాస్త్రీయమైన విషయాలన్నారు. గరుడ పురాణంలో చెప్పిన పరలోక శిక్షలన్నీ పుక్కిటి పురాణామేనన్నారు. చనిపోయిన తర్వాత కూడా మనం సమాజానికి ఉపయోగడాలంటే, మన శరీరాన్ని వైద్యకళాశాలకు దానం ఇవ్వవచ్చునీ, మన కళ్ళు దానమీయవచ్చని చెప్పారు. సమావేశానికి వచ్చిన వారందరికీ ప్రగతిశీల సాహిత్యాన్ని నారాయణరావుగారి కుటుంబసభ్యులు ఇచ్చారు.

**4-2-2014 హైదరాబాదు :**

స్థానిక కేంద్రీయ విశ్వవిద్యాలయంలో "దళిత ఉద్యమం - నామ్‌దేవ్ ఢసాల్" అనే అంశంపైన గోష్ఠి జరిగింది. దళితుల, ఆదివాసీల అధ్యయనాల మరియు అనువాదాల వేదికలు దీన్ని జనసాహితితో కలిసి నిర్వహించాయి. ఆచార్య వి.కృష్ణ అధ్యక్షత వహించారు. ముందుగా జనసాహితి రాష్ట్ర ప్రధాన కార్యదర్శి దివికుమార్ గత నెల 15న మరణించిన దళిత పాంథర్ల ఉద్యమ నిర్మాతలలో ముఖ్యుడైన కవి నామ్‌దేవ్ ఢసాల్ ఉద్యమ నేపథ్యం గురించి చెప్పారు. ఆనాటి బ్లాక్ పాంథర్ల ఉద్యమ ప్రభావం, అమెరికా సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా వియత్నాం సాగిస్తున్న విముక్తి పోరాటం, నక్సల్బరీ ఉద్యమం భారతదేశ వ్యాపితంగా నూతన తరాలను తీవ్రంగా ప్రభావితంచేయటం, 20ఏళ్ళ స్వాతంత్ర్యంలో ఆశించిన మార్పులు రాకపోగా దళితులతో సహా శ్రామికుల జీవితం మరింత దుర్భరమౌతూండటం... వీటి ప్రభావాలతో దళిత పాంథర్ల ఉద్యమం ఆవిర్భవించిందని చెప్పారు. మన సామాజిక వ్యవస్థలోని అర్ధవలస - అర్ధఫ్యూడల్ లక్షణం కలిసి వున్నట్లే దళిత సమస్యలో వర్గం - కులం కలగలిసే వుంటాయని, అది అర్థం కావాలంటే సమాజపు అతి సంపన్నుల కులమూలాలను, అతి నిరుపేదల కుల మూలాలు పడుగు - పేకల్లా కలసి వుంటున్నాయనే వాస్తవాన్ని అర్థం చేసుకోవాలని చెప్పారు. దళిత పాంథర్ల మేనిఫెస్టోలోని దళిత నిర్వచనాన్ని అర్థం చేసుకోవాలనీ, ఆర్థిక దోపిడీ, సాంఘిక పీడనలకు గురవుతున్న సమస్త పీడిత వర్గాలూ నిమ్న కులాలూ, మహిళలూ, మైనారిటీలు... ఈ విశాల సంఘటనలో భాగస్వాముల్ని చేయాలనే అవగాహన అందులో స్పష్టం చేశారనీ... నేటికీ మనం చర్చించుకుంటూ వస్తున్న ఈ సమస్య యొక్క మూలాలను పరిష్కారాలను విడివిడిగా కాకుండా కలివిడిగా

అర్ధం చేసుకోవాల్సివుంటుందని చెప్పారు. దళిత పాంథర్ల కార్యక్రమంలో భూమి సమస్య గురించిన ప్రాముఖ్య స్థానాన్ని ఎత్తిచూపారు. డాక్టర్ దార్ల వెంకటేశ్వరరావు గత వందేళ్లుగా వెలువడుతున్న దళిత సాహిత్యం దళిత ఉద్యమాన్ని... సంస్కరణోద్యమకాలం, విప్లవోద్యమ ప్రభావం, అంబేద్కర్ కాన్షీరాం ప్రబోధం, అంతః సంఘర్షణ కాలాలుగా విభజించి నేటిది పునఃసమీక్షా కాలమని చెప్పారు. నామ్‌దేవ్ ధసాల్ అంబేద్కర్ - మార్క్స్, మావోల తాత్త్వికతను మేళవించి తన కవిత్వాన్ని రాసిన వాడన్నారు. 40 ఏళ్ళక్రితపు దళిత పాంథర్ల మేనిఫెస్టో తిరిగి అధ్యయనం చెయ్యాలని చెప్పారు. దాన్ని ప్రచురించిన 'ప్రజాసాహితి'ని అభినందించారు. అధ్యక్షుడు ప్రొ.వి.కృష్ణ మాట్లాడుతూ నామ్‌దేవ్ ధసాల్‌లాంటి విప్లవకారుణ్ణి తనలోకి గుంజుకు పోగలిగింది హిందూ వ్యవస్థ. దళితుడంటే సమస్త కులాల, మతాలలో వున్న శ్రమజీవులనే అర్థాన్నిచ్చినవాడు ధసాల్ అన్నారు. "కులవ్యవస్థ కూడా ఎంత బలమైనదంటే... శ్రామికవర్గమూ దళిత బహుజనాలు కలిసి పోరాడాలన్న ధసాల్‌ను కూడా కులస్తులు బహిష్కరించారన్నారు. మనిషి మనిషిగా చూసే వ్యవస్థ రావాలన్నదే ధసాల్ అంతిమ ఆశయమని ఆచార్య వి. కృష్ణ చెప్పారు. పాలమూరు విశ్వవిద్యాలయంలో పనిచేస్తున్న ఆచార్య మనోజ మరాఠీ నుండి ధసాల్ పద్యాలు విశ్లేషిస్తూ, తెలుగులో కూడా అర్థాలు చెబుతూ హిందీలో ప్రసంగించారు. ధసాల్ కవిత్వ విశేషాలు వివరించారు. పరిశోధక మరాఠీ విద్యార్థి ప్రకాశ్ చిల్వంత్ కూడా మాట్లాడారు.

**15-2-2014 నూతక్కి (గుంటూరుజిల్లా) :** స్థానిక 'గురజాడ కళావేదిక' వారు ప్రతి సంవత్సరం ఇదే నెలలో గత 30 ఏళ్ళుగా నిర్వహిస్తున్న సాంస్కృతిక కార్యక్రమంలో భాగంగా ఈసారి "వేమన సాహిత్యం-ప్రస్తుత సమాజం" అనే అంశంపైన సభను ఏర్పాటు చేశారు. సభకు సామాజిక కార్యకర్త వి.ఎన్.ప్రసాద్ అధ్యక్షత వహించగా బొర్రా గోవర్ధన్ (ఉపాధ్యాయుడు, రచయిత-నగరం) ప్రధానోపన్యాసం చేశారు. "నాస్తికోవేదనిందకా" అనే సామెత ప్రకారం బుద్ధుడూ, వేమనా కూడా నాస్తికులే అవుతారని" వేద విద్యలెల్ల వేశ్యలవంటివి" లాంటి పద్యాలను ఉటంకించి చెప్పారు. తన కవిత్రయం "తిక్కన-వేమన-గురజాడ" అని శ్రీశ్రీ చెప్పిన విషయాన్ని ఉటంకించారు. వేమనమీద బౌద్ధ ప్రభావం వుందని చెప్పారు. "పసిడి గలుగువాని బానిస కొడుకులు" అని కులం-గోత్రం గురించి చెప్పుకునే వారిని వేమన ఎద్దేవా చేయటంవెనుక మార్క్స్ చెప్పిన "ధనం" పాత్రని వేమన కూడా అర్థం చేసుకున్నట్లేనని అన్నాడు. యజ్ఞయాగాదుల పేరుతో జరిపిన, ఇంకా జరుపుతున్న ఘోరాలను వర్ణిస్తూ వేమన వాటిని ఖండించినట్లు చెప్పారు. తరువాత మాట్లాడిన జనసాహితి దివికుమార్ 30 ఏళ్ళుగా 'గురజాడ-కళావేదిక'ను పట్టుదలగా కొనసాగిస్తున్న కార్యకర్తలను అభినందించారు. మూఢ విశ్వాసాలను, కులమత తత్త్వాలను ఖండించటంలో గురజాడ వేమన వారసుడౌతాడని చెప్పారు. వేమన కాలంవాడే అయిన పోతులూరి వీరబ్రహ్మం కూడా "చిల్లర రాళ్ళకు మొక్కుతువుంటే చెడిపోదువురా" అని చెప్పాడనీ, వేమన నాస్తికుడు కాడనీ కానీ విగ్రహారాధనను తీవ్రంగా నిరసించాడనీ, నిజమైన దేవుడు మనిషిలోనే ఉన్నట్లు చెప్పాడని, "భూమిలోన పుట్టుభూసారమెల్ల, తనువులోన పుట్టుతత్త్వమెల్ల, శ్రమములోన పుట్టు సర్వంబు తానౌను" అని మానవ సంపద సృష్టికి మూలం, సంపదలోని సారం "శ్రమ" అని వేమనలాంటి వారు తమ అనుభవ జ్ఞానంతో గ్రహించారనీ, కారల్‌మార్క్స్ 200 సంవత్సరాల తర్వాత దాన్ని సైద్ధాంతిక స్థాయిలో వివరించాడనీ చెప్పారు. గురజాడ కళావేదిక నిర్వాహకుడు సిహెచ్.నాగిరెడ్డి వందన సమర్పణానంతరం పులగం నాగిరెడ్డి దర్శకత్వంలో వెనిగళ్ళ గ్రామ నాటకబృందం "ఉత్తిష్ట భారతి" అనే నాటికను ప్రదర్శించారు.

**16-2-2014 విజయవాడ :**

స్థానిక చంద్రరాజేశ్వరరావు గ్రంథాలయంలో "అంతర్జాతీయ మాతృభాషాదినోత్సవం" "వట్టికోట ఆళ్వారుస్వామి 53వ వర్ధంతి (శతజయంతి)సభ"ను జనసాహితి నిర్వహణలో దివికుమార్ అధ్యక్షతన జరిగింది. కొమర్రాజు లక్ష్మణరావుకి సాహిత్యనివాళిని అరుణ 'ప్రజాసాహితి' నుండి చదివి వినిపించారు. కవి, విమర్శకులు కొండ్రెడ్డి వెంకటేశ్వరరెడ్డి మాతృభాషలో విద్య ప్రాముఖ్యతను వివరించారు. పొరుగు రాష్ట్రాలయిన తమిళనాడు, కర్ణాటకలలో వారి వారి భాషలపట్ల ఆ ప్రభుత్వాలు తీసుకుంటున్న పాటి శ్రద్ధను ఆంధ్రప్రదేశ్‌నేలుతుండిన ప్రభుత్వాలు చేపట్టకపోవటాన్ని విమర్శించారు. జాతీయోద్యమ కాలం నుండి ప్రజలకు చేసిన వాగ్దానాన్ని తుంగలో తొక్కటమేకాక, ప్రపంచీకరణకు లోబడిన ప్రభుత్వాలు ఇంగ్లీషు భాషకు కూడా లొంగిపోవటాన్ని ఖండించారు. ఈ కారణంగా తెలుగు సాహిత్య సృజనకు నూతన తరాలు దూరమవుతున్నాయనీ, అది సమాజానికి నష్టమనీ... తెలుగుభాషా ఉద్యమాన్ని మరింత తీవ్రంగా, విస్తృతంగా కొనసాగించాల్సిన అవసరమున్నదనీ చెప్పారు. వట్టికోట ఆళ్వారుస్వామి జీవిత రేఖలను, కృషినీ పరిచయంచేస్తూ సింగంపల్లి అశోక్‌కుమార్ నివాళినర్పించారు. సభాధ్యక్షుడు దివికుమార్ - యునెస్కో ప్రమాణాల ప్రకారం తెలుగుభాష క్షీణదశలో వున్నదనే చేదునిజాన్ని మనం గుర్తించాలని చెప్పారు. ప్రభుత్వం విద్యావ్యాపారుల ప్రయోజనాల కొరకు భాషను, విద్యావ్యవస్థను నిర్మిస్తోందనీ ఇందులో కనీస ప్రజాస్వామిక విలువలు కూడా లేవని చెప్పారు. ఉన్నత సాంకేతిక పరిశోధనా విద్యలు కూడా మాతృభాషలో జరిగేట్టు కనీస చర్యలు తీసుకోకుంటే రాష్ట్రం ఒకటిగా వున్నా నాలుగు ముక్కలయినా ఒకటేనని చెప్పారు. వట్టికోట ఆళ్వారుస్వామి శతజయంతి సంవత్సరమిది అన్నారు. "ప్రజలమనిషి" "గంగు" నవలలు చదివితే ఆనాటి తెలంగాణాలో సాగిన గ్రంథాలయోద్యమం, సంఘనిర్మాణ హక్కుల కోసం ఉద్యమాలు రైతాంగ ఉద్యమంగా, వ్యవసాయక విప్లవంగా, విముక్తిపోరాటంగా ఎదిగిన తీరుని తన నవలా సాహిత్యంలో చిత్రించాలనే పథక రచనతో 'ప్రజలమనిషి' 'గంగు' నవలలు రాశారనీ, కానీ చిన్నవయసులోనే (47 ఏళ్ళు) ఆయన మరణించటం తెలుగు సాహిత్యానికి తీరని లోటని చెప్పారు. ఒక నవల కుండాల్సిన "వస్తు-శిల్ప" సమన్వయం 'ప్రజలమనిషి'లో పరిపూర్ణంగా వుందని చెప్పారు. తెలుగుభాష, జాతి వికాసం నేటి ప్రపంచీకరణ శక్తులతో, భూస్వామ్య సంస్కృతితో సాగించే పోరాటంపై ఆధారపడివుంటుందనీ...దీన్ని విస్మరించే "ప్రత్యేక - సమైక్య" వాదాలు సాధారణ ప్రజాప్రయోజనాలను నెరవేర్చలేవని అన్నారు.

✤




**పుట్టిల్లు :** కథాసంపుటి.

డా॥ కె.వి.రమణరావు,1/8డెమ్మీ, 256 పుటలు,వెల:రూ.140/, విశాలాంధ్ర ప్రచురణ నెం : 2350/472 ప్రథమ ముద్రణ : సెప్టెంబరు 2013. ఇది విశాలాంధ్ర ప్రచురణాలయం వజ్రోత్సవ సంవత్సరం.

ఈ సంపుటిలో వున్న 26 కథల రచయిత కామరాజు వెంకట రమణరావు, తిరుపతి శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయంనుండి వృక్ష శాస్త్రంలో డాక్టరేట్ పొందారు. వివిధ ప్రభుత్వ కళాశాలల్లోనూ, విద్యాశాఖ కళాశాల విద్యా విభాగంలోను, ఉన్నత విద్యామండలిలోని, రాజీవ్ గాంధీ విశ్వవిద్యాలయంలో పనిచేసిన ఆయన ప్రస్తుతం రావులపాలెం డిగ్రీ కళాశాల ప్రిన్సిపల్‌గా పనిచేస్తున్నారు.

ఈ కథా సంపుటికి ముందుమాట రాస్తూ డా॥ తాటిచర్ల గురురామ ప్రసాద్ (ప్రిన్సిపల్, సిల్వర్ జూబ్లీ, ప్రభుత్వ కళాశాల, కర్నూలు) ఇలా అంటున్నారు. "అక్కడక్కడా ఆత్మాశ్రయ ధోరణి, కవితాత్మక వచనం, పదచిత్రాలు, సర్రియలిస్టిక్ కవిత్వం, సౌందర్య పిపాస, పాశ్చాత్య చిత్రకళ, సంగీత అభినివేశం, మనోవైజ్ఞానిక ధోరణి, లలితకళల క్రియాలాలిత్యం" వీరి కథల్లో తళుక్కుమంటాయి. అంతస్సూత్రంగా వ్యాపించి వుంటాయి. ప్రతులకు : విశాలాంధ్ర వారి అన్ని శాఖలలోను.

**నిచ్చెన మెట్లలోకం :** కవిత్వం (2000-2011)

జూపల్లి ప్రేమ్‌చంద్. 1/8డెమ్మీ, 132 పుటలు. వెల : రూ.70/- మొదటిముద్రణ : అక్టోబరు - 2011.

వర్షాభావానికీ, కరువుకూ మారుపేరు అనంతపురం జిల్లా, వరుసగా కొన్నేళ్ళపాటు అక్కడ వర్షాలే కురవ్వు. కురిసినా అకాల వర్షాలుగా వచ్చి, వేరుశనగ పంటను నాశనం చేసి పోతాయి. అక్కడ రైతుల మత పశువులను కబేళాలకు అమ్ముకొంటుంటారు. ఆ అనంతపురం రైతుల దుర్భర జీవితాన్ని ప్రేమ్‌చంద్ తన కవితల్లో చిత్రించారు. ఆదివాసులు, దళితులు, బహుజనులు, ముస్లిములు, క్రైస్తవులు, ఐక్యంగా పోరాడి చరిత్రను తిరగరాయాలని కవి ఆకాంక్ష. అయితే మన కులవ్యవస్థ వీరందరినీ విడదీసి ఐక్యంగాకుండా చేస్తూనే వుంది. వర్గదృక్పథంతో కుల వ్యవస్థకుట్రను ధిక్కరించినపుడే అసంఖ్యాక ప్రజలకు విముక్తి.

అనంతపురం జిల్లా ప్రజల భాషలో రాసిన కొన్ని కవితలు విశిష్టంగా వున్నాయి. అలాగే ప్రపంచీకరణకు వ్యతిరేకంగా రాసిన కవితలు కవి అభ్యుదయ సామాజిక దృక్పధాన్ని తెలియచేస్తున్నాయి.

ఇప్పుడు నిన్ను వేధిస్తున్న ఒకే ఒక ప్రశ్న
డాలర్ చెట్టుకు ఉరివేసుకోవడమా?
డాలర్ చెట్టును కూకటి వేళ్ళతో పెకలించడమా? అంటున్నాడు కవి.

అయితే ఒక కవితలోని పాదాలను ముక్కలు ముక్కలు చేసి, ఒక పుటలో సరిపోయే రచనను మూడు, నాలుగు పుటలకు విస్తరింపచేయటం ద్వారా ఏ ప్రయోజనం సాధించారో అర్థంకాలేదు.

ఈ కవితా సంపుటిని పరిచయం చేస్తూ అంబటి సురేంద్ర రాజు, సిద్ధార్థ, జి.గౌతమ్, గుడిపాటిగార్లు రాసిన ముందుమాటలున్నాయి. ప్రతులకు : పాలపిట్ట బుక్స్, 16-11-20/6/1/1, 403, విజయశ్రీ రెసిడెన్సీ, సలీంనగర్, మలక్‌పేట, హైదరాబాద్-500 036. ఫోన్ : 040 - 27673430.

**అంతర :** రామాచంద్రమౌళి అరవై కవితలు.

మెకానికల్ ఇంజనీరింగ్‌లో ఎం.ఎస్‌చదివి, ఇంజనీరింగ్ కళాశాలలో పనిచేసి, 2006 జనవరి 1న ఉద్యోగ విరమణ చేసిన రామాచంద్రమౌళి మొదటి రచన 1962లో 'చందమామ' పత్రికలో అచ్చయింది. 1971లో మొదటి కవిత్వ సంపుటి 'దీపశిఖ' వెలువడింది. ఇప్పటికి 223 కథలు, 8 కవితా సంపుటాలు, 18 నవలలు, 3 విమర్శగ్రంథాలు, 2 నాటకాలుకాక 5 ఇంగ్లీషు అనువాద కవితా సంపుటాలేకాక ఇంజనీరింగ్‌పై ఏడు పాఠ్యగ్రంథాలు రాశారు.

ఈ 'అంతర' 8వ కవితాసంపుటి. ఇదికూడా ఇంగ్లీషులోకి అనువాదమైంది. కవిగా అనేక దేశాలు పర్యటించి వివిధ విశ్వవిద్యాలయాల్లో ప్రసంగించారు. అనేక జాతీయ అంతర్జాతీయ కవిత్వ వేదికలపై తన కవిత్వాన్ని వినిపించారు.

కవి నిర్విరామంగా నిరంతరం సంపూర్ణత వైపు పయనించాలంటూ, నిత్య అధ్యయనం కవికి అవసరమని చెప్పే రామాచంద్రమౌళి 2010, 2011, 2012లలో రాసిన కవితలివి. ప్రతి కవితకు జీవవంతమైన ఛాయాచిత్రాలను కందుకూరి రమేశ్‌బాబు సమకూర్చారు. పాలమీగడ లాంటి తెల్లని ఆర్ట్‌పేపర్‌పై ముద్రించిన ఈ 1/8డెమ్మీలో 142 పుటలున్న ఈ సంపుటి వెల : రూ.150/- సాహితీ సోపతి, కరీంనగర్ వారి ప్రచురణ. మొదటి ముద్రణ : 30 డిసెంబరు 2012. బొబ్బా ఆండ్రూస్ కవర్‌డిజైన్ చేశారు. ప్రతులకు : రామాచంద్రమౌళి, 11-24-498 టెలిఫోన్ భవన్‌లేన్, పోచమ్మ మైదాన్, వరంగల్లు - 506 002. email : chandramoulirama@gmail.com

**లెనిన్ ప్రసిద్ధ రచన : రాజ్యమూ - విప్లవమూ**

మార్క్సిస్టు రాజ్యసిద్ధాంతమూ - విప్లవంలో కార్మికవర్గ కర్తవ్యాలు... క్లుప్తీకరణ : ఎన్.వి.యస్. నాగభూషణ్, 1/8 డెమ్మీ, 48 పుటలు. వెల : రూ.20/- తరిమెల నాగిరెడ్డి మెమోరియల్ ట్రస్ట్. ప్రచురణ సంఖ్య :66, ప్రచురణకాలం:2014, ఫిబ్రవరి. ప్రతులకు : 32-13-26/1, బి.ఎం.రావు రోడ్డు, మొగల్రాజపురం, విజయవాడ- 10. లేదా మైత్రిబుక్‌హౌస్, జలీల్‌వీధి, కారల్‌మార్క్స్ రోడ్, విజయవాడ - 2.

**కళానేత** (గుడిబండి వెంకటరెడ్డి అంతరంగ తరంగాలు)

రచన : అలపర్తి రామకృష్ణ. 1/8 డెమ్మీ 144 పుటలు. వెల : రూ.100/- ప్రతులకు : జివిఆర్ ఆరాధన కల్చరల్ ఫౌండేషన్, బి70-ఎఫ్-1, పి.యస్.నగర్, విజయనగర్ కాలనీ, హైదరాబాదు - 500057. సంచారవాణి : 98498 82783.

**ఆచార్య వాసిరెడ్డి భాస్కరరావు జీవితం - రచనలు - సమాలోచన**

ఖమ్మం ప్రభుత్వ కళాశాలలో ప్రభుత్వ పాలనాశాస్త్ర అధ్యాపకునిగా 1966-68లలో పనిచేసి, 1968-1973 మధ్య ఉస్మానియా విశ్వవిద్యాలయంలోనూ, 1978 నుండి 1999 వరకు వరంగల్లు కాకతీయ విశ్వవిద్యాలయంలో వివిధ హోదాలలో పనిచేసిన ఆచార్య వాసిరెడ్డి భాస్కరరావు రచనలపై అభ్యుదయ రచయితల సంఘం

మద్దుకూరి చంద్రశేఖరరావు జయంతి సందర్భంగా వరంగల్లులో ఒక ప్రాంతీయ సదస్సులో ఆచార్య వాసిరెడ్డి భాస్కరరావు జీవితము - రచనలు, సమాలోచన జరిపారు. ఈ సమాలోచన 2013 మార్చి 23న ఉదయం 10 నుండి సాయంత్రం 5 వరకు జరిగింది. ఆ సమాలోచనలో వాసిరెడ్డి రచనలపై 27 మంది చదివిన వ్యాసాలు ఈ పుస్తకంలో వున్నాయి.

1/8డెమ్మీలో 162 + 18 పుటలు. వెల : రూ.90/- ప్రచురణ కాలం : 2013 మార్చి. ప్రతులకు : డా॥ వి. వీరాచారి, 3-83 శ్రీ వెంకటేశ్వరకాలనీ, గోపాలపురం, హనుమకొండ, వరంగల్లు - 506 015. సంచారవాణి : 99636 10842.

**దేవుడు చనిపోయిన టీ టేబుల్** బి.ఎస్.ఎం. కుమార్ కవిత్వం

ఇది కుమార్ ఐదవ కవితా సంపుటి. ఇంగ్లీషులో మాత్రం 'ఏ లాంగ్ పోయమ్' అని రాశారు. ప్రతి కవితాసంపుటితోనూ మరికొంత సంక్లిష్టత సాధిస్తున్నారు ఈ కవి. అసలే తెలుగు చదవని విద్యార్థి యువతరం ఈ కవిత్వం చదివితే ఇక తెలుగుజోలికి రాకుండా పోతారు. ఉదాహరణకు మొదటి నాలుగు కవితల్లో ప్రత్యక్షమయ్యే కుమార్ సృష్టించిన ఈ కొత్త పదబంధాలు మనలను ముందుకుపోకుండా బంధిస్తాయి. చూడండి. 'మంత్ర స్థాపిత', 'మృత్యు స్వస్తంగా', 'సహార్ద్రి', 'నగరపు సంజారా', 'తన్విత', 'శ్రేయాంశి', 'ఛాయా సర్దనలు', 'విష్కంభ వృక్షం', 'శిక్షమితస్మరణ', 'సంభ్రాంత విశ్వం', 'స్వాంభరణ', 'విశ్వసహ మంధన' మొదలగునవి.

1/8 డెమ్మీలో 170 పుటలున్న ఈ పుస్తకం వెల : రూ.100/- మొదటి ముద్రణ 2013. సూర్య ప్రచురణలు. ప్రతులకు : బి.ఎస్.ఎమ్. కుమార్, 14-179/1 గణేశ్ నగర్ కాలనీ, ఆర్.ఎన్.రెడ్డి నగర్, హైదరాబాదు-500 097. విద్యుల్లేఖ చిరునామా : bm_ kumar @yahoo.com

**అక్షర సమరం** కవితల సంపుటి.

రచయిత : తుంపాల శ్రీరామమూర్తి. 2010-2013లలో రచయిత రాసిన 54 కవితల సంపుటి ఇది. సమతా ప్రచురణలు - సంఖ్య : 1. తొలిముద్రణ : జనవరి, 2014. 1/8 డెమ్మీ, 68 పుటలు. వెల : రూ.60/- ప్రతులకు : 9-9-57/2 సమతా నిలయం, జోగివాని పాలెం, కొత్తగాజువాక, విశాఖపట్టణం - 530 026. దూరవాణి : 0891-2516192. సంచారవాణి : 94402 60280.

**బోధనాంత'రంగం'** తెలుగు బోధనా పద్ధతుల శాస్త్రం

రచయిత : డా॥ రావిరంగారావు.

డా॥ రావి రంగారావు ఎన్నో కవితలు, శతకాలు గతంలో రాశారు. లఘు కవితలకు ఎనలేని ప్రోత్సాహమిచ్చారు. విద్యార్థులకు కవిత్వంపై అవగాహన కల్గించే ప్రసంగాలేగాక, వారిచేత కవితలు రాయించడం నిరంతరం చేస్తున్నారు.

ఆయన బిఇడి కళాశాల అధ్యాపకునిగా, ప్రిన్సిపల్‌గా సాధించిన అనుభవాల్తో తెలుగు ఎలా బోధించాలి అన్న విషయంపై రాసిన 20 వ్యాసాల సంపుటి ఇది. తెలుగు అధ్యాపకులకు ఎంతో ఉపయోగపడే "పద్యం లయానుగుణంగా, భావానుగుణంగా ఎలా చదవాలి?", 'పద్యాంశాన్ని అవగాహనాత్మకంగా ఎలా బోధించాలి?' 'ఆధునిక వచన కవితా బోధన మెలకువలు', 'సృజనాత్మక నైపుణ్యబోధన' మొదలగు శీర్షికలతో వున్న ఈ 20 వ్యాసాలూ తెలుగు బోధించేవారందరూ చదివి వంటబట్టించుకోవాల్సినవే.

**సూర్యరసం** వచన కవితలు. రచన : డా॥ రావి రంగారావు

"నిరాడంబర సౌందర్యాన్ని కనిపెట్టి గ్రహించడానికి ప్రపంచమంత మేధ కావాలి. పసిపాపంత హృదయం కావాలి... ఈనాటి తరానికి తెలియని, రేపటి తరానికి తెలియాల్సిన వావిలాల గోపాలకృష్ణయ్య లాంటిది నా కవిత్వం" అంటున్న డా॥ రావిరంగారావు వివిధ సందర్భాలలో రాసిన 60 వచన కవితల సంపుటి ఇది.

1/8 డెమ్మీలో 128 పుటలు గల ఈ పుస్తకం వెల : రూ. 100/- మొదటి ముద్రణ : నవంబరు, 2013. ఇది సాహితీ మిత్రులు, మచిలీపట్టణం వారి 92వ ప్రచురణ. ప్రతులకు : డా॥ రావి రంగారావు. 20/151-1 మోనికా రెసిడెన్సీ, కొబ్బరితోట, చిలకలపూడి, మచిలీపట్నం - 521 002. సంచారవాణి : 92475 81825. దూరవాణి : 08672-254345. విద్యుల్లేఖ చిరునామా : raavirangarao@gmail.com బ్లాగు : raavirangarao.blogspot.com

**సుగంధాల భరిణె**

గజల్ ప్రక్రియలో రెండు పాదాల కవితలు రాసినవారు కె. ప్రభాకర్. ఉర్దూ పారశీక కవితా రూపమైన గజల్ గురించి, సామల సదాశివ 'ప్రస్తావన'లో విలువైన సమాచారం అందించారు. ప్రభాకర్ కవితలను పరామర్శ చేస్తూ ఇంద్రగంటి శ్రీకాంత్ శర్మ, ప్రొఫెసర్ ఎస్.లక్ష్మణమూర్తి, అన్నంరాజు సుబ్బారావు, డా॥ చల్లా విజయలక్ష్మి, సౌభాగ్య, దివాకర్ల రాజేశ్వరి, డా॥ సి.నారాయణరెడ్డి, కోవెల సుప్రసన్నాచార్య, ప్రొ. ముదిగొండ వీరభద్రయ్య, జి.శ్రీశైలం వ్యాసాలు రాశారు. ఇంగ్లీషులో ప్రొఫెసర్ జె.వి.రాఘవేంద్రరావు రాశారు. 60 పుటలుగాక మిగిలిన 120 పుటలలో, అక్కడక్కడ బాలి గీసిన బొమ్మలతో దాదాపు 900 ద్విపాదల సుగంధాల భరిణె ఇది.

1/8 డెమ్మీలో 60+120+14 పుటలు గల ఈ పుస్తకం వెల : రూ.150/- ప్రచురణ కాలం 2013. ప్రతులకు : రవి పబ్లిషింగ్ హౌస్, 2ఎల్-7/4 III ఫేజ్, కె.పి.హెచ్.బి కాలనీ, హైదరాబాదు -5000085. సంచారవాణి : 94401 36665. విద్యుల్లేఖ చిరునామా : prabhakark1950@gmail.com

(ఇంకా ఉన్నాయి) ✤

**ఆదర్శాలూ-ఆచరణీయాలు!**

చాగంటి కోటేశ్వరరావు వాల్మీకి రామాయణంపై ఇచ్చిన ఉపన్యాసాలలోని మంచి మాటలు - సంకలనం : టి. నవీన్. ప్రచురణ : శాంతా వసంతా ట్రస్ట్.

**వినదగునెవ్వరు చెప్పిన...**

మానవీయ విలువలను ఉద్దీప్తంచేసే 1001 వాక్యాలను సంకలనం చేసినవారు శ్రీమతి నేదురుమల్లి రాజ్యలక్ష్మి. ప్రచురణ : శాంతా - వసంతా ట్రస్ట్, హైదరాబాదు.

**మనసుపలికే...** ఓ ఔత్సాహిక పారిశ్రామికవేత్త మనోగతం.

రచయిత : వరప్రసాద్ రెడ్డి (శాంతాబయోటెక్నిక్స్) **పై మూడు పుస్తకాలు అమూల్యం.** ప్రతులకు : శాంతా వసంతా ట్రస్టు, 822ఎ, రోడ్ నెం-40, జుబిలీహిల్స్, హైదరాబాద్-500 033. దూరవాణి : 040-23546111.



## వట్టికొండ విశాలాక్షి

(1920-2007)



## అక్షర నివాళి

51

విశాలసాహితి

వట్టికొండ విశాలాక్షి
ఎఱ్ఱజెండా గూటిపక్షి
తొలితరపు అభ్యుదయ
సాహితీ సృజన సాక్షి

# నారి సారించిన భారతనారి

**సింగంపల్లి అశోక్‌కుమార్**

అంబరవీధిని అదిగో జెండా / ఆశాజ్యోతిగ అగపడుచున్నది
ఎఱ్ఱని రంగుతో ఎగురుచు నున్నది/మిలమిల ధగధగ మెరయుచునున్నది ॥అం॥
సుత్తీ కొడవలి సుందరముగనూ / అందే యిమిడి అగుపడుచుండగ ॥అం॥
స్వాతంత్ర్యము తన జన్మహక్కెయని / దిక్కుదిక్కులకు తెలుపుచునున్నది ॥అం॥
శాంతి సౌఖ్యముల శాశ్వతముగ నిల / స్థాపన చేయగ చాటుచునున్నది ॥అం॥
ఫాసిస్టులనూ పరిమార్చుటకై / పరుగున రమ్మని ప్రజల పిలుచుచు ॥అం॥

అంటూ 40వ దశకంలోనే ఎఱ్ఱజెండా ఔన్నత్యాన్ని అక్షరీకరించి నారి సారించిన భారతనారి వట్టికొండ విశాలాక్షి తొలితరం అభ్యుదయ రచయిత్రి.

స్థితివంతమైన వ్యవసాయ కుటుంబంలో పుట్టిన విశాలాక్షి ఉన్నత విద్యలభ్యసించక పోయినా తెలుగుతో పాటు సంస్కృతం అభ్యసించారు. హిందీ సాహిత్యాధ్యయనం చేశారు. పిన్న వయసులోనే భావకవిత్వంతో సాహిత్య సృజన ప్రారంభించినా అరసం ప్రభావంతో రెండవప్రపంచ యుద్ధపరిణామాల చైతన్యంతో అభ్యుదయపంథాలో అడుగుపెట్టి చివరిదాకా ప్రగతిశీల భావాలతో రచనలు చేశారు.

మహిళాసంఘాలలోనూ, గ్రంథాలయోద్యమంలోనూ పాల్గొన్నారు. జాతీయోద్యమంలో పాల్గొన్నారు. ఉన్నవ లక్ష్మీనారాయణ సన్మాన సభలో ఆయన నవల 'మాలపల్లి'పై విశాలాక్షి ప్రసంగానికి ఉన్నవతో పాటు పలు ప్రముఖుల ప్రశంసలందుకున్నారు.

అరసం అధికార పత్రిక 'అభ్యుదయ'లో పలు రచనలు చేశారు. తొలినవల 'భారతనారి' సాహిత్య పత్రిక'భారతి'లోనూ,1943లో గేయసంపుటి 'అభ్యుదయగీతాలు'అచ్చయింది.ఎన్నోకథలు, గేయాలు, ఆమె భర్త వట్టికొండ రంగయ్య సంపాదకత్వంలో నడిచిన 'ప్రజావాణి'పత్రికలో వెలుగు చూశాయి.

1943 ఫిబ్రవరి 13,14 తేదీల్లో తెనాలిలో తాపీ ధర్మారావు అధ్యక్షతన జరిగిన ప్రథమాంధ్ర అభ్యుదయ రచయితల సంఘం మహాసభలకు హాజరయిన వట్టికొండ విశాలాక్షి, రంగయ్య దంపతులు కార్యవర్గ సభ్యులుగా ఎన్నికయ్యారు.

'సామ్యవాద విభాతకాంతులు జగతి దౌర్జన్యాంధకారము పారద్రోలెడు వరకు నిద్దుర పట్టునే నాకు' అంటూ శ్రమజీవులపై జరుతున్న దోపిడీపైనా, జాతి వివక్షతపైనా, మతమౌఢ్యంపైనా వెనుక బడిన స్త్రీజాతి బానిసత్వంపైనా,పురుషిజంపైనా, ఫాసిజంపైనా ఆమె ఝుళిపించిన కలం వినిపించిన గళం సాహిత్యపరంగానూ, చైతన్యపరంగానూ ఎంతో ప్రముఖమైనవి.

'స్త్రీకి పదిలమైన జీవితంకంటే ఆత్మాభిమానమే ముఖ్యం.మనం ధైర్యంచేసి ముందుకు రావడమే. భర్తను వదులుకోదలచుకుంటేనే చెయ్యాలి ఏది చెయ్యాలన్నా. అతను ఒప్పుకోకపోతే ఏం చేస్తాం. మార్చడానికి ప్రయత్నిస్తాం. అతని మనస్సు మారదు మారనప్పుడు మరేంచేస్తాం.విడిపోయి ఒంటరిగా జీవించడానికి అలవాటు పడాలి'అంటూ స్త్రీ ఆత్మ గౌరవానికి అర్థం చెప్పడమే కాకుండా, తనకే ఎదురైన ఒక సందర్భంలో ఆచరించి చూపించిన నిబద్ధురాలు. అలా తన వ్యక్తిత్వాన్నిగౌరవించడానికి సిద్ధపడిన తర్వాతే భర్తతో కలిసి జీవించారు.

'అరసానికి రాజీనామా చేయడమంటే చాలా చిన్నతనంగా అన్పించింది నాకు. ఏం తప్పుచేసిందని రాజీనామా చేయాలి? మీకేమో నచ్చలేదు. మీరు చేశారు. నేనెందుకు చేస్తాను. చేయను' అనేప్పటికి చాలా కోపం వచ్చింది ఆయనకు.'అట్లా అయితే నాకూ నీకూ సంబంధంలేదన్నారు. లేకపోతే పోయింది. నా తోవన నేనుంటా, మీ తోవన మీరుండండి అన్నాను. అరసం కార్యదర్శి పిచ్చయ్యతో వచ్చిన స్వల్ప వివాదం కారణంగా తమకు ఎంతో చైతన్యాన్ని సంతరించిన అరసానికి ఆయన రాజీనామా చేసి, తనను కూడా రాజీనామా చేయమని ఒత్తిడి చేసిన భర్తకు విశాలాక్షి వినిపించిన ధిక్కార స్వరం ఇది.

విశాలాక్షి రచనలు'భారతనారి,యుగధర్మం, తపోభంగం, ఆత్మబలం,నిష్కామయోగి'(నవలలు) మూగబాధ,ఆపేటిక,హృదయ పరివర్తనం,అనంత రామయ్య సీతకథ,గౌరవంకోసం,తల్లి లేక పోతే,మీసాల మీనయ్య (కథలు), ఇంకా మరికొన్ని అచ్చుకాని రచనలు.

విశాలాక్షి తనజీవితకాలంలోనే ప్రముఖ సాహితీవేత్త పాపినేని శివశంకర్,అరసం అధ్యక్షుడు పెనుగొండ లక్ష్మీనారాయణలు అధ్యక్ష,కార్యదర్శులుగా వట్టికొండ విశాలాక్షి కల్చరల్ ట్రస్ట్‌ను అరసం సహకారంతో ప్రారంభించారు. 1999నుండి విశాల సాహితీ పురస్కార కార్యక్రమం ఏటా జరుగుతోంది.

'రచయిత్రిలో మరొక విశిష్టత ఇతర రచయితల రచనలను గ్రుడ్డిగా అనుకరించక పోవటం. స్త్రీలతత్వాలను,సమస్యలను,స్త్రీలనర్థంచేసుకోగలిగినట్లుగా పురుషులర్థం చేసుకోగలగడం కష్టం.అందువల్ల సమగ్ర మానవ జీవితానికి రచయిత్రుల సొంతరచనలు అవసరం'అంటూ 'భారతనారి' నవలకు సాహితీవేత్త జి.వి. కృష్ణరావు ప్రశంసలందుకున్న వట్టికొండ విశాలాక్షి 1920 జూన్‌లో గుంటూరుజిల్లా చేబ్రోలు గ్రామంలో జన్మించారు. 2007జూన్10న, మరణించారు. ■

# తెలుగు ప్రచురణలు


















## సాహిత్య అకాదెమీ

దక్షిణప్రాంతీయ కార్యాలయము, సెంట్రల్ కాలేజి క్యాంపస్,
డా॥ బి. ఆర్. అంబేద్కర్ వీధి, బెంగుళూరు - 560 001
ఫోను: 080-22245152 / ఫ్యాక్స్: 080-22121932
email : sahityakademi@gmail.com




### JOURNALS

**INDIAN LITERATURE :** Bi-monthly in English
Annual subscription Rs. 250
Three years subscription Rs. 650
Each copy Rs. 50

**SAMKALEENA BHARATIYA SAHITYA :** Bi-monthly in Hindi
Annual subscription Rs. 125
Three years subscription Rs. 350
Each copy Rs. 25












I, 2014 (TELUGU) Rs. 20/- RNI No.APTEL/1977/571 Postal Regd. No. Vj/030/2012-2014

కవిత

# గులాబీలు రాలిపడుతున్న చప్పుడు...!

- చిత్తలూరి

గులాబీలు రాలిపడుతున్న చప్పుడు
మన హృదయాల్లోంచి
చెమ్మను వెలికితీస్తూ
మన మొద్దు చర్మాల మీద
చైతన్యపు చురకలంటిస్తూ
మన కళ్ళల్లోంచి నదుల్ని పొంగిస్తూ
మనం సమాధానం చెప్పలేని
వేన వేల ప్రశ్నల్ని సంధిస్తూ
స్పష్టంగానే వినబడుతుంది
గులాబీలు రాలిపడుతున్న చప్పుడు
ఎంత చప్పుడు... ఎన్ని గులాబీలు...
మనసు మూలల్లోకి
సమస్త మాలిన్యాల గబ్బిలాలను తోలేసి
మా 'నవా'ంతరంగాలను
చీకటి గుహలుగా మారుస్తున్న
రాజ్యం రాక్షస నీడలో
గులాబీలు రాలిపడుతున్న చప్పుడు
మంచి చెడుల బోధన కరువైన
తరగతి గదులు
మూసుకుపోయిన నాలుగు మూలల
జ్ఞాన నేత్రాలై
తమస్సును ఉషస్సుగా
భ్రమింపజేస్తున్న
విష సాంస్కృతిక దాడిలో...
గులాబీలు రాలిపడుతున్న చప్పుడు
స్పష్టంగానే వినపడుతుంది.
"ఒరేయ్! నువ్వు మొగాడివిరా!"
అన్న పితృస్వామిక బోధనలో
పూల పొత్తిళ్లలో కురుస్తున్న
విషబీజాల ముళ్లవానలో
స్పష్టంగానే వినబడుతుంది.
గులాబీలు రాలిపడుతున్న చప్పుడు
ఎంత చప్పుడు...
ఎన్ని గులాబీలూ...
నచ్చని చదువు క్రూరంగా తోసేస్తే
అక్షర పంజరం నుండి జారిపడి
రక్తం చిందిందో గులాబీ
నచ్చిన ఉద్యోగం కోసం
ఊరుగాని ఊరెళితే
బూడిద కుప్పలో రాలిపడిందింకో గులాబీ
బతుకు తెరువు కోసం
రంగుల మెలికలు తిరిగితే
అభిమానం ఓడిపోయి
వడలిపోయింది మరో గులాబీ
ఎడతెరిపిలేకుండా కురిసిన
అక్షరాల నిర్బంధవానలో
ఊపిరాడక ఉక్కిరిబిక్కిరయి
కఠిన శిలలాంటి కార్పొరేటు నేలమీద
కూలబడిపోయిందింకో గులాబీ
దేశం గొప్పతనాన్ని చూద్దామనొచ్చి
దేశీయ మృగాల దాడిలో
గాయపడి ఓడిపోయిందో టూరిస్టు గులాబీ
ఆడపుట్టుకే భరించలేని పాపమైందా
యవ్వనం క్రూరమృగాల
మృగయా వినోదమయిందా...
గులాబీలింతగా రాలిపడుతున్నాయేమిటి
పూల గుండెలింతగా తెగిపడుతున్నాయేమిటి
ఇకనైనా [illegible] కట్టయి
వేట మొదలెట్టకపోతే
పూల రేకల్లోంచి
విచ్చు కత్తులు మొలిపించకపోతే
క్రూరమృగాలు మరింత
స్వైరవిహారం చేస్తాయి
గులాబీలు రాలిపడుతున్న చప్పుడు
ఇంకా స్పష్టంగా వినబడుతుంది
ఎంత చప్పుడు... ఎన్ని గులాబీలంటూ
ఇంత విషాదాన్ని రొటీన్‌గా విని
నువ్వు, నేనూ, వారు, వీరూ ఊరకుంటే
మహా ప్రమాదం అంచున
జారిపడిపోవటమే మిగులుతుంది. *

కవిత

# సెలబ్రిటీ సౌందర్యం

- డా॥ శాంతికుమార్

ఆమె
సూటు మేధావుల టేపులకందదు
అంకెల కొలతల్లో అసలు యిమడదు
నూలుపోగు బరువయ్యే సుకుమారి కాదు

ఆమెకి
పిల్లి నడకలు తెలియవు
మిస్ దేశం మిస్ ప్రపంచం వంటి
క్షుద్ర సాంస్కృతిక్క వైరస్‌లంటవు
రేపటి తరానికి పంచే మురిపాలు నిండిన
పాలగుండె తప్ప పాల బుగ్గలుండవు
సొల్లుకళ్ల నిర్ణేతల్ని మురిపించే
ఆదర్శాల చిలకపలుకులుండవు
ఐష్ సుష్ గట్రా ముద్దుపేర్లుండవు.
కెమేరా క్లిక్కులూ డిజిటల్ చమక్కులూ
ఎమ్మెన్‌సీ ఎండార్స్‌మెంట్లూ దరిజేరవు.
సిగ్గుదాచే చిరుగుపాతలు తప్ప
అశ్లీలం సైతం సిగ్గుపడే
టూపీస్ రిబ్బన్ కాస్ట్యూంలుండవు !
పంచభక్ష్యాలు లేని పేదరికం తప్ప
కళ్లతో కడుపునింపుకునే
దౌర్భాగ్యం ఉండదు !

ఆమె - ఆకాశంలో సగం
కానీ
అవయవ జియోగ్రఫీ ప్రదర్శనతో
సగం ఆకాశాన్నాకర్షించే
మాయలూ తపన ఉండవు !

ఆకులో ఆకై
చాకిరిలో స్వేదమై
సంపదల సృష్టికి ఇంధనమై
కాలానికి చుక్కానై
జగతి గమనం నిర్దేశించే
శ్రమ సౌందర్యమే ఆమె !
'ఆమె'ని మించిన సెలబ్రిటీ ఉంటుందా? *

Editor : P.S. NAGARAJU, Edited, Printed and Published by K. RAVI BABU at Chaitanya Printers, Vijayawada- 520 002 for Co-operative Press, Vijayawad
A PUBLICATION OF JANASAAHITHI, ANDHRA PRADESH



## మనము ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KRSA101M304 |
| పుస్తకం పేరు | ప్రజాసాహితి |
| తారీఖు | 23 February 2025 |
| ముందు అట్ట | ఉంది |
| వెనుక అట్ట | ఉంది |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | లేవు |
| ఖాళీ పేజీలు | లేవు |
| లేని పేజీలు | లేవు |
| తయారు చేసినది | Sowmya |
| పేజీలు విడదీసినది | Sowmya |
| స్కాన్ చేసినది | Mary |
| పరీక్ష చేసినది | ROHITH |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | [illegible] |